ఆయన రాజ్యంలో హోమధూళికి కన్నీరు కార్చినవారు కలరుకాని, దుఃఖంలో కార్చినవారు లేరు. వక్రత కులకాం తలకురుల్లోనే గలదుకాని ఆయన నడతలో లేదు. కొరడాల ఝుళిపింపు గుర్రాలపైనేగాని, మనుష్యులపై ఝుళిపించరు.

ఆయనకు స్త్రీలంటే పడదు. తన ఆస్థానంలోనే, తనతో అన్నివిద్యల్లోనూ సములైన రాకుమారులతోనే ఆయన వేడుక, వారితోనే ఆయన పోటీలు, ఆయన కెందరో మంత్రులున్నారు. వారంతా బుద్ధికి బృహస్పతులు. వారు మంత్రులై వుండగా శూద్రక మహారాజుకు రాజ్యతంత్ర చింతయే లేదు,

ఎల్లప్పుడూ తోటి రాకుమారులను వెంటవేసుకొని దిగ్విజయ యాత్రలు నడపడంలోనే తను ఆలోచనలను సాగించేవాడు. ఇకాయనకు స్త్రీవాంఛ ఎలా వుంటుంది? తలచుకుంటే ఆయనకేం కొదువ? సౌందర్య రూప లావణ్యులైన లలనామణులు అనేకులు అంతఃపురంలో ఉన్నారు. అయ్యో! వారి పొత్తే ఆ ప్రభువుకు లేదు. అందుకే ఆయనకు సంతానం లేదు. అందుకే ఆయన మంత్రులకు రాజుగారిని తలుచుకుంటే చింత.

మహారాజు కొలువులో ఉంటే మృదంగం వాయిస్తాడు, కావ్యపఠనం గావిస్తాడు. బయటకు వెడితే వేటలు, బాణాలు, వాటి వాడిమొనలు, యుద్ధతంత్రం - ఇవీ ఆయన దినచర్యలు.

ఒకనాటి ప్రత్యూషం!

తూరుపుకొండ ఇంకా జేవురించలేదు. పద్మబాంధవుడింకా ప్రభవించలేదు. మహారాజు కొలువు తీర్చాడు.

ఆ కొలువులోకి ఒక ప్రతీహారి యాదృశ్చికంగా ప్రవేశించింది. ఆమె రూపాన్ని చూచి అంతా దిగ్భ్రాంతులయ్యారు. స్త్రీలు ధరించని ఖడ్గం ఆమె కటిసీమపై వ్రేలాడుతోంది. మెలికలు తిరిగిన సన్నని నడుం, ఆ నడుం ఆభరణాలతో పాము చుట్టుకున్న గంధం మానులా, భయంకరంగా ఉంది. బిగువైన, కొండశిఖరాలను బోలు కుచపాళి.

సభలో ప్రవేశించగానే ఆమె శరీరం పైనుండి, విస్తరిల్లిన కాంతి, సభలోనున్న రాజరాజన్యుల మణికిరీటాలపై పడి, తన అభీష్టాన్ని ప్రకటించి, వారి కేదో ఆజ్ఞాపిస్తున్నట్టుగా మెరిసింది. క్షణంలో పరశురాముని పరశుధారలకు మల్లే ఆమెకు సభంతా వశీకృత మైపోయింది.

ఠీవిగా ప్రవేశించిన ఆమె నేలకు వంగింది. మహారాజుకు నమస్కరించింది.

ఆమె నివేదించుకోదలచిన విన్నపమేమిటా అని సభ విస్తుపోతూ తిలకిస్తోంది. ఆమె నివేదిస్తోంది—

"మహారాజా! ద్వారంవద్ద ఒక చండాలకన్య వేచి ఉంది. స్వర్గానికి వెడుతున్న త్రిశంకుణ్ని కాలితో తన్ని ఇంద్రుడు త్రోసివేయగా, నేలపై పడ్డ ఆయన రాజ్య యశోలక్ష్మిలా ఉందామె. ఒక చేతిలో పంజరం, ఆ పంజరంలో ఒక చిలుక

ఉన్నది. ఆమె తమకిలా చెప్పమంది— 'రాజ్యంలోని సంపద లన్నీ రాజువే. నా చేతిలోనున్న చిలుకకూడా ఆయనకే చెందాలి, దీన్ని ఆయనకు అర్పించుకోడానికి నాకు రాజ దర్శనం కావాలి!' అని. ఇక ప్రభువుల ఆజ్ఞ!" అని ప్రతీ హారి మహారాజు ముఖంలోకి చూసింది. మహారాజు అందరి ముఖాల్లోకీ చూసాడు. వారేమీ మాట్లాడలేదు.

"సరే! లోనికి రమ్మను!"

ప్రతీహారి వెళ్ళి ఆ కన్యను లోనికి తెచ్చింది.

చండాలకన్య మహారాజును చూసింది. వజ్రాయుధ ధార లకు భీతిచెంది, కులపర్వతాల నన్నింటినీ కూడగట్టుకొని, మధ్యలో నక్కివున్న మేరునగంలా ఉన్నాడు - మహారాజు. రత్నకాంతులతో ఆయన ప్రకాశిస్తున్నాడు. దివ్యరత్నఖచిత సింహాసనాన్ని అధిరోహించాడు. వెనుక వింజామరలు వీస్తు న్నారు - విరుబోడులు. ఆ వీచికలకు, హంసపాళి అంచులతో, జలతారు కుచ్చులతోనున్న ఆయన పట్టుపీతాంబరం స్వర్ణ కాంతులు వెదజల్లుతూ, వ్రేలాడుతోంది. సుగంధాన్ని పూసిన ఆయన శరీరం సువాసనల వెదజల్లుతోంది. మెడలో ముప్పేట ముత్యాలహారం, పచ్చలు తాపిన భుజకీర్తులు, వజ్రాలు పొదిగిన కిరీటం, కలువలలాంటి కన్నులు - సాక్షాత్తు మహావిష్ణువో, ఇంద్రుడో అన్నట్టున్నాడాయన. మణులు చెక్కిన పాలరాతి నేలపై ఆయన దివ్యముఖారవిందం ప్రతి ఫలిస్తోంది.

గల్లు గల్లుమన్న కంకణాల ధ్వనితో వచ్చి, చండాలకన్య మహారాజుకు దూరంగానే, చేతిలోని బెత్తాన్ని నేలకు గ్రుచ్చి నిలిచింది. సభంతా దిగ్గున అటువైపు చూసింది.

ఆ కన్యతో మరో మనిషి వచ్చాడు. అతడు వృద్ధుడు. తల నెరసింది. ముఖంలో ముడుతలున్నాయ్. చూడ్డానికి నల్లగావున్నా, అతడు ధరించిన తెల్లని వలువలు, అతడికి కాంతినిచ్చి, చండాలునిలా గాక, సవర్ణునిలాగే కనబడుతున్నాడు. అతడి వెనుక ఒక పిల్లవాడున్నాడు. ఆ పిల్లవాని చేతిలోనే చిలుకవున్న పంజరముంది. ఆ చిలుక పచ్చని మేని కాంతి, ఆపంజరంపై బడి, మరకతంలా ప్రకాశిస్తోంది.

ఇకా చండాలకన్యా! నిజంగా మోహినీ అవతారమే. ఇంద్రనీలాల్లాంటి కురులు. అటువంటి రంగే - చీర, పైన ఎర్రని వలువ ముసుగులో నీరెండపడ్డ నల్లకలువలా వికసిస్తూ ఉంది. ఆమె సిగపై జాజులచెండు ఉంది. వసంతంలో పూలన్నీ వికసించి, జాజిపూవు మాత్రం విహీనమై ఉంటుంది. తానెంత సుందరి అయినా, కులం తక్కువది కావడంవల్ల జాజిపూవులా విహీన, అందుకోసం జాజిపూల చెండును జూటంపై ధరించి, సవర్ణులనేవారిని వెక్కిరిస్తున్నట్టుంది.

ఆమె మబ్బులు కప్పిన చంద్రబింబంలా, ఈశ్వరుడు తన త్రినేత్రంతో భస్మం చేసిన మన్మథుని పొగతో కప్పిన రతీదేవిలా, ఒక్క ముక్కలో చెప్పాలంటే శివుడు కిరాతవేషం

ధరించినప్పుడు, తానుకూడా ఆదే వేషం ధరించిన పార్వతీ దేవిలా ప్రకాశిస్తోంది.

ఒత్తుగా లత్తుకరాసుకున్న ఆమె పాదాలు, మహిషాసురుని రక్తంతో తడిసిన కాళీ పాదాలవలె ఉన్నాయ్. ఆమె కాలి అందెలపైనుండి, ఆ అందెల కాంతులు పైకి ప్రసరిస్తూంటే, అంటరానిదానిగా బ్రహ్మ తయారు చేసిన ఆమెను అంటదగినదానిలా చేయుటకు, అగ్నిదేవుడే ఆమెను ఆలింగనం చేసుకుంటున్నట్టుంది.

ఒక చేతిలో కమలం, ముఖంలో మందహాసం, విరిసిన కన్నులు, శంఖంలాంటి ఆ కంఠం... అన్నీ చిత్రించ చిత్రకారుని కుంచెకు తప్ప, అన్యులకు సాధ్యంకాదేమో!

శూద్రక మహారాజు, చిత్రకారుడు కూడాను.

అందుకే, ఆమెను చూచి అనుకుంటున్నాడు—

"ఇంత చక్కని చుక్కను సృష్టించిన బ్రహ్మ, అంటరానిదానిగా ఎందుకు చేసాడో? ఒకవేళ ఎవరైనా అంటితే ఆమె సౌందర్యమంతా నలిగి పోతుందనా?..."

అతడలా అనుకుంటుండగానే, ఆమె మెల్లగా మొలముత్యాలు గల్లుమన ఆ నేలపైనే కూర్చుంది. వెంట ఉన్న మనిషి, పిల్లవాని చేతనున్న పంజరంలోని చిలుకను తీసి, మహారాజుకు సమర్పిస్తూ అన్నాడు—

"మహాప్రభూ! ఈ చిలుక పేరు వైశంపాయనుడు. ఇది మహారాజుకే చెందాలని, మా దొర కూతురు మీ వద్దకు

తీసుకొచ్చింది. దీనికి సర్వ శాస్త్రాలూ తెలుసు. రచనా పాటవంలో కూడా ప్రవీణురాలు. మాట్లాడగలదు. సంగీతాన్ని విని ఆనందించగలదు. చిత్రలేఖనంలో సిద్ధహస్తురాలు. ప్రణయంలో విముఖులను సుముఖులుగా మార్చగలదు. దీనిని ప్రభువులు స్వీకరించండి!"

చిలుకతో నున్న పంజరాన్ని ఎదుట పెట్టాడు. పెట్టీ పెట్టగానే పంజరంలోని చిలుక, కుడికాలు పైకెత్తి ప్రభువుకు వందన మాచరించి, సంస్కృతంలో ఒక శ్లోకం చెప్పింది.

"మహారాజా! నీ శత్రు భార్యల బ్రతుకులు దుఃఖమయమైపోయాయ్. విముక్తాహారములా వారి చనుగవ సంతాపాగ్నితో కన్నీళ్ళ మధ్య మునిగి తేలుతున్నాయ్." అని.

మహారాజు దాని పఠనా పాటవానికి ఆశ్చర్యపోయి మంత్రి కుమారపాలితుని ముఖంలోకి చూసాడు. అతడు ఘనమైన నీతిశాస్త్ర పారంగతుడు. అతడికి తెలియని శాస్త్రం లేదు. ఆయనను అడిగాడు మహారాజు—

"మహామంత్రీ విన్నావుగదూ, కలకండ తునకలులాంటి దీని పలుకులు. శ్లోకం చదవడంలో దీని కెంత ఉపజ్ఞ ఉంది. సంస్కారులైన మనుషులే - దీనిని అందలేరేమో!"

'అదేమంత విచిత్రం మహారాజా! పక్షులకు మాటలు వచ్చున్న సంగతి మనకు తెలియనిది కాదు. అందులోనూ, మనుషుల శిక్షణలో చిలుకకు ఇట్టే మాటలు వచ్చేస్తాయ్. అన్నట్టు పూర్వం మనుషులకు మల్లే చిలుకలుకూడా మాటలు

వచ్చేవట. అగ్నిదేవుని శాపంవల్ల హాటి పలుకులు అస్ఫుట మైపోయాయట, తెలుసా ప్రభూ ?"

ప్రధానమంత్రి జవాబు విన్నాడేగాని మహారాజును ఆశ్చర్యం వొదల్లేదు. ఇంతలో మధ్యాహ్న సమయ సూచకంగా బయట నగారా మ్రోగింది. సభ చాలించబడింది. చండాలకన్యను విడిది మందిరానికీ, చిలుకను అంతఃపురానికీ తీసుకు పొమ్మని ఆజ్ఞాపించి, తాను ఆప్తులైన రాజపుత్రులతో ఏకాంత మందిరానికి వెళ్ళిపోయాడు.

లోపలకు వెళ్ళగానే మహారాజు అలంకారాలను దిగవిడిచాడు. అప్పుడాయన కిరణాలు లేని సూర్యునిలా, చుక్కలూ, చంద్రుడూ లేని ఆకాశంలా, నిరాడంబరంగా కనబడ్డాడు. దుస్తులను మార్చుకుని, వ్యాయామశాలకు వెళ్ళి రాకుమారులతో కాస్సేపు సాధకం చేశాడు. బాగా చెమటపోసింది. శరీరం అలసింది. ప్రభువు సాధనాలు క్రిందపెట్టి, వ్యాయామ మందిరం నుంచి రాగానే పరిచారికలు స్నానపరికరాలతో పరుగెత్తుకుని ఆయన ముందుకొచ్చి నిలిచారు. ప్రభువు స్నాన ప్రదేశానికి బయలుదేరాడు. ఇరుకెలంకులా కాంతా సముదాయం దారిలో మనుష్యులెవరూ వుండకుండా హెచ్చరికలు చేస్తూ, కొలనువద్దకు తీసుకొచ్చారు. చలువరాతి గట్టుతో నిర్మించిన కొలను అది. ఆ కొలను నుండి సువాసనలు గుభాళిస్తున్నాయ్. ఒక బంగరు దోనెపై ప్రభువును కొలను మధ్యకు తీసుకెళ్ళారు. ఆమధ్య స్ఫటిక వేదిక. దానిపై

వజ్రాలు తాపిన పీఠం. ఆ పీఠంపై శూద్రక మహారాజు ఉపవిష్టుడయ్యాడు.

ఒక కాంత వచ్చి వుసిరికతో ఆయన తలంటుతోంది. గళ్ళున ఆమె ముంజేతి గాజులు మధురధ్వనులను చిందుతున్నాయ్. చందన పొడితో మరొక కాంత నలుగు పెడుతోంది. పైట మాటిమాటికీ క్రిందకు వ్రేలాడకుండా, చను కట్టుచుట్టూ పైట చెంగును దోపుకుందామె. అభ్యంగనం పూర్తి కాగానే, కొందమకన్నియలు కొందరు, బంగారు పాత్రలతో నీళ్ళుపట్టి ఆయన శిరస్సుపై గుమ్మరించారు. అప్పుడు మద్దెలలు మ్రోగాయ్. వంధి మాగధులు మంగళ గానాలు చేసారు. తూర్యారవాలు, పిక్కటిల్లాయ్. నేల జలదరించింది. మహారాజు స్నానం పూర్తయింది. పాము కుబుసంలాంటి సన్నని, ధవళ వస్త్రాలను మహారాజు ధరించాడు. ముప్పేట ముత్యాల హారాన్ని మెడలో వేసుకున్నాడు జలతారు పాగాను తలకు చుట్టాడు. సూర్య దేవునికి అర్ఘ్యమిడచి. పూజా మందిరానికి బయలు దేరాడు.

తనఇష్టదైవమైన శివుని మనసార పూజించాడు. ఆమందిరాన్ని విడిచి, అగ్నిమండపానికి వచ్చి ఘుమాయించే కస్తూరి, అగరు, చందన ద్రవ్యాలను వొంటికి పులుంకొని, బట్టలు మార్చుకొని మిత్రులైన రాకుమారులతో సహపంక్తిలో విందారగించాడు.

విందు పూర్తి కాగానే, ప్రతీహారి కర్పూర మునుంచిన తాంబూల పళ్ళెరముతో ఎదుట సిద్ధమైంది. ప్రభువు

తాంబూల మేసుకున్నాడు. చివురుటాకుల్లావున్న తన చేతిని అందించింది—ప్రతీహారి. ఆ చేతిని ఊతగా గొని వసంత మండపానికి బయలు దేరాడు.

మంటపానికి చుట్టూ, ముత్యాల సరులతో కూర్చిన తెరలు ఉన్నాయ్. అవి దక్షిణ పవనాలకు ఊగులాడుతున్నాయ్, మండపానికి ఎగ్రబాకిన పూలతల నుండి సుగంధం విస్తరిల్లుతోంది. ఆ మంటప స్తంభాలు, కాంతు లీనుతున్నాయ్. మంటపం మధ్య హంసతూలికా తల్పంపై ప్రభువు విశ్రమించాడు. ఆ తల్పంపై విరజాజులు విరజిమ్మబడి ఉన్నాయ్. ప్రక్కనున్న పట్టుదిండుపై వాలి, తన చుట్టూఉన్న స్నేహితులతో కాస్సేపు సరసల్లాపాలాడి, చిలుక రహస్య మేమిటో తెలుసుకోవాలన్న అభిలాషతో చిలుకను తెమ్మని ప్రతిహారికి ఆజ్ఞాపించాడు.

ఆజ్ఞాపించడ మే తడవుగా, చిలుకను తీసుకొని ఒకకంచుకి, ప్రతీహారితో ప్రభువుముందు ప్రత్యక్షమై, నేలపై చేతులాన్చి జయకారం పలికి, విన్నవించుకున్నాడు—

'ప్రభూ ! చిలుకను స్నానం చేయించి, ఆహారం తినిపించి తమ వద్దకు పంపామని దేవి మనవి చేయమన్నారు.'

కంచుకి వెళ్ళిపోయాడు.

చిలుకను మహారాజు అడిగాడు—

' ఆహారం నీకు నచ్చిందా?'

'నచ్చడమేమిటి మహారాజా! నేరేడుపళ్ళ రసాన్ని సేవించాను. సింహం పెకలించగా నెత్తురుతో తడిసి, ఎర్రగా ఉండే ఏనుగు కుంభస్థలంలోని ముత్యాలవంటి, దానిమ్మగింజలను కొరికాను. తామరాకుల్లా పచ్చగా, ద్రాక్షపళ్ళలా తియ్యగావుండే ఉసిరికాయలను తిన్నాను. రాణులే తమ చేతులతో పెట్టిన ఆహారం అమృతంలా ఉండకపోతే ఏలా ఉంటుంది, మహారాజా?' అంది — చిలుక.

దాని మాటల కడ్డువచ్చి మహారాజు అడిగాడు—

'అది సరేగాని నీకిన్ని మాట లెలావచ్చాయ్? ఇంత జ్ఞానమెలా వచ్చింది? ఏదైనా శాపంవల్ల చిలుకవయ్యావా? లేక ఏ వరంవల్లనైనా, ఇంత గొప్పదాని వయ్యావా? నీ కథేమిటి? నీ వెలా ఈ బంధాలులకు చిక్కావ్? కాస్త వివరంగా చెప్పి, నా ఆశ్చర్యాన్ని తొలగించవూ?'

'అదంతా చాలా పెద్ద కథ! వినే ప్రభువులుంటే చెప్పడానికేం వినండి మహారాజా?' అంటూ చిలుక తన కథను చెప్పసాగింది.

## 2

మహారాజా! భారత భూమికి మొలనూలుగా మధ్యదేశంలో వింధ్యారణ్యం ఉంది. ఏనుగులు చిమ్మే జలంతో పెరిగి ఆకాశాన్ని తాకుతూ నక్షత్రాల్లా మెరిసే పూచిన పూల చెట్లతో దట్టంగా ఉండే అడవి అది, ఆ అడవిలో

పొదరిండ్లన్నీ ఆ వనలక్ష్మీ భవనాల్లాకనబడతాయ్. ఆ పొద రిండ్లలో చుట్టూ మొగలి, గన్నేరు, పొన్న, పొగడ చెట్లు! వాటికి తమలపాకుల తీగెలు. ఆ ప్రక్కనే పోకచెట్లు, మిరియ ముల కొమ్మల రెమ్మలను కొరుక్కుతినే లకుముకి పిట్టలు. ఆ కొమ్మలపై అటునుండి, ఇటువైపునకు దుమికే కోతుల గుంపులు. మత్తు కలిగించే మధుర పరిమళాన్ని వెదజల్లే, ఏలకుల తీవెలు. కొండలు, గుట్టలు, వాటిలో కుందేళ్ళు, జింకలు, ఎలుగులు ఎన్నో జంతు జాతులు. చమర మృగాలు, తోకలతో విసురుతుండగా, తిరిగే సింహాలు. ఆ సింహాలను వేటాడ్డానికి అక్కడక్కడ వేయబడే మాట్లు, మాటుల మధ్య విరహిణివలె పల్లవ మారుతంతో వీచితమౌతూ, సుగం ధాన్ని వ్యాపింపజేసే పూలచెట్లు. వాటిపై కోతుల కిచకిచలు! గుహాలలో సింహాల గర్జనలు. పొదలలోచిలుకల కేరింతాలు, కొమ్మలపై కోయిలలు. అక్కడక్కడ కోరాడు — అడవి పందులు — అదంతా ఒక భయంకరమైన విపినం. అందులో దండకారణ్యాం మరీనూ. వింధ్యారణ్యంలో దండకారణ్యాం ఒక భాగం. ఇది క్రూర మృగ నివాస భూయిష్టం. ఇక్కడే అగస్త్యాశ్రమముంది. అగస్త్యుడు ధర్మమూర్తి. ఇంద్రుడు కోరినంత మాత్రాన సముద్రాన్నే, త్రాగివేసాడు. సూర్యుని దారి కడ్డం వచ్చిన వింధ్య పర్వతాన్నే అణగి ద్రొక్కివేసాడు. అందుకే అది సాగిపోయి, ఆవిశాలాంతం వ్యాపించివుంటుంది.

వాతాపిని జీర్ణం చేసుకున్ననాడు. ఒక గద్దింపుతో స్వర్గ లోకంలోనున్న నహుషుని పడద్రోసిన తపోసంపన్నుడాయన.

ఆయన భార్య లోపాముద్ర. ఆమె నీరుపోసి పెంచిన చెట్లతో ఆ ఆశ్రమం కళకళలాడుతూంటుంది. వారి పుత్రుడు—ధృఢధస్యుడు. కావలసినన్ని సమిధలను ఏరుకొస్తూ ఉండటంవల్ల, ఇధ్మవాహుడన్న రెండవ పేరునుకూడా ఆయనతండ్రి పెట్టాడు.

ఆ ఆశ్రమంచుట్టూనే గోదావరినది ప్రవహిస్తూ ఉంటుంది. ఇక్కడే పూర్వం పితృవాక్పరిపాలన కోసం, రాజ్యాన్ని త్యజించి వచ్చిన రాముడు అగస్త్యుని చూచి, పంచవటిలో పర్ణశాల వేసుకొని, సీతా లక్ష్మణులతో నివాసమున్నాడు.

అక్కడ చెట్ల చిగుళ్లు ఎర్రగా ఉంటాయ్. పూజ కోసం పూలు కోసినప్పుడు సీతాదేవి, చేతి రక్తిమ వీటికి అంటుకుందేమో? లేక రాము డనేక రాక్షసులను ఇక్కడ చంపినందువల్ల, వారి రక్తంతో తడిసిన మొదళ్ళవడంవల్ల, చివుళ్లు ఎర్రగా ఉన్నాయేమో?

ఇప్పటికీ వర్షాకాలమొచ్చి మబ్బులు ఉరమగానే అక్కడి మృగాలకు ఆ రాముడే గుర్తుకొస్తాడు. ఆయన వింటినారి మ్రోతలు మేఘ గర్జనల్లా ఉండేవి కాబట్టి.

ఇక్కడే బంగారు లేడి, సీతావియోగం కల్పించి, రామచంద్రుని సుదూరంగా తీసుకుపోయింది. ఇక్కడే పర్ణశాలముంగు రాముడానాడు, విరహంలో సీతాదేవి చిత్తరువు లిఖించాడు.

మళ్ళీ సీతమ్మ భూమిలోంచి పుట్టుకొచ్చి రాముని కోసం చూస్తున్నదా అన్నట్టు ఆ చిత్తరువును, ఆ విపిన వాసులు ఇప్పటికీ చూస్తుంటారు.

ఈ గుర్తులతో నిండి అగస్త్యాశ్రమానికి సమీపంలోనే ఒక కొలను ఉంది. దాని పేరు పంపాసరోవరం. అగస్త్యుడు సముద్రాన్ని త్రాగి వేసాడన్న కోపంతో బ్రహ్మ మరో సముద్రాన్ని సృష్టించాడన్నట్లుగా ఉంటుందా సరోవరం. ఈ సరోవరంలో శబర భామినులు, వక్కువగా జలక్రీడ లాడుతారు. తామరపూలపై తుమ్మెదలు ఝూంకారాలు చేస్తుంటాయ్. తామరతూళ్ళు తిని మత్తెక్కిన కలహంసలగానాలు, అతి రమ్యంగా ఉంటాయ్. సరోవరం తెల్లగా ఉంటుంది. శబరాంగనలు కుచపాళికి రాసుకున్న గంధపుపొడి అందులో కలియడంవల్ల నేమో? దాని గట్టున మొగలి పుప్పొడులు పడి పెరిగినందున, ఇసుక తిన్నెలా ఉంటుంది. చుట్టూ ఉన్న వృక్షాలకు పండ్లుండవ్. బహుశా, వాలిచే ఋష్యమూకం నుండి తరుమబడ్డ సుగ్రీవుడు, ఈ పండ్లనే కోసుకుని భుజించి కాలం గడపడం వల్లనేమో? అందుకే మునులు, పండ్లులేని ఆ వృక్షాల పూవులను మాత్రమే కోసుకొని, పూజలు గావిస్తుంటారు.

అనంతమైన ఆసరోవరానికి పడమరి గట్టున ఓ పెద్దబూరుగు చెట్టు ఉంది. ఆ చెట్టు రాముని తూపులకు తుత్తునియలైవున్న

వనంలోనే ఉంది. ప్రళయ నాట్యం చేసే నటరాజు చాచిన వేయి చేతుల్లా దాని కొమ్మలు కనబడతాయ్. ఆ కొమ్మలకు పాములు విడిచిన కుబుసాలు చిక్కి. దేవకాంతలు విడిచి వెళ్ళిన వస్త్రాల్లా గాలికి రెప రెపలాడుతుంటాయ్.

అది ఎత్తైన చెట్టు కావడంవల్ల, ఆ కొమ్మలపైనుండే సూర్యుని రథం వెడుతుంది. అలా వెళుతున్నప్పుడు ఆ రథా శ్వాలు అలసటలో విడిచిన నురుగలేమో, ఆ బూరుగు దూది పింజలు అనిపిస్తుంది.

అన్ని చెట్లలాగాక యీ చెట్టు, జీవమున్న దానిలా ఉంటుంది. కారణం ఆ చెటు తొర్రలలోనే తుమ్మెదలూ, చిలుకలూ, కాపురముండి నిత్యం ఏదో శబ్దం చేస్తుంటాయ్.

దాని కొమ్మలు, ఆ విపినాన్ని ఆలింగనం చేసుకుంటు న్నంత విశాలాలు, దాని ఎత్తును చూస్తే, ఆ వన సౌంద ర్యాన్ని తిలకించడానికి, అదంతా ఎత్తుగా పెరుగుతోందా? అనిపిస్తుంది. చిలుకల గుంపులతో ఆ చెట్టు ఎప్పుడూ పచ్చ గానే ఉంటుంది. దాని తొర్రలోనే ఒక చిలుకలజంట కాపుర ముంటోంది.

ఆ జంటే నా తల్లిదండ్రులు. మా నాన్నకు బాగా వృద్ధా ప్యం వచ్చాక నేను పుట్టాను. నన్ను కని యీ భూమిపై పడ వేయగానే నా తల్లి గతించింది. నా తండ్రి, దుఃఖాబ్ధిలో మునిగిపోయాడు. ఆ దుఃఖంతో నన్ను సాకుతూ వచ్చాడు. మిగతా పక్షులు తెచ్చుకొని తినగా, క్రిందపడ గింజలనూ

వాటినీ పోగుచేసి, నాకు పెట్టేవాడు. ఎగురుదామంటే ఓపిక లేదు మరి!

ఒకనాడు ఆకాశం ఎర్రబడింది. తామర తేనెపడి ఎర్ర బడిన రెక్కలతో మందాకినీ తీరంనుంచి వచ్చిన వృద్ధహంస వలె చంద్రుడు పడమటి కొండల్లోకి దిగిపోయాడు. ఏనుగు రక్తంతో తడిసిన సింహ కేసరాల్లో సూర్యకిరణాలు విజృం భిస్తున్నాయ్. మంచు బిందువులు కురుస్తున్నాయ్. నెమళ్లు పురివిప్పి ఆడుతున్నాయ్. సింహాలు చెలగుతున్నాయ్. ఏను గులు ఘీంకరిస్తున్నాయ్. చల్లచల్లని పిల్లగాలులు వీస్తు న్నాయ్. రాత్రల్లా రతి క్రీడలలో మునిగి తేలి, చిరుచెమట్లు పట్టిన శబరాంగనలకు ఆహ్లాదాన్ని కలుగచేస్తున్నాయ్. చెట్ల ఆకులకు, తీగలకు ఆ చల్లగాలి నృత్యం నేర్పుతోంది.

అంతలోనే తెల్లవారింది. బాగా పొద్దెక్కింది. బూరుగు చెట్టుపైనున్న చిలుకలన్నీ ఎగిరిపోయాయ్. చెటు శూన్యమై పోయింది. కదలలేని మా బాబు మాత్రం తొర్రలోనే ఉండి పోయాడు. నేనూ నాన్నతోనే ఉండిపోయాను.

ఇంతలో అకస్మాత్తుగా మహా భయంకరమైన వేట అట్ట హాసం వినబడింది. అక్కడక్కడున్న పక్షులన్నీ భీతావహంతో నక్షత్రాల్లా ఆకసంలోకి ఎగిరిపోయాయ్. కొండగుహాల్లో మేల్కొని ఉన్న సింహాలు గర్జిస్తున్నాయ్. భగీరథుడు భూమి పైకి గంగను దింపుతున్నప్పుడు, దాని ప్రవాహానికి భీతిల్లిన భూమాతలా వనలక్ష్మి భయపడిపోయింది.

అంతశబ్దం నేను పుట్టాక ఎన్నడూ విని ఉండలేదు. నా చెవులు హోరెత్తిపోయాయ్. కంపించిపోయి మా నాన్న రెక్కలసందులో వాక్కున్నాను.

వేట అట్టహాసం మరీ బిగ్గరగా వినబడింది. పెద్ద పెద్ద కేకలు డప్పుల చప్పుడు, పెట్టిన మంటలు, మృగజాలమంతా తమలో తామే కోరాడుకుంటున్నాయ్. ఎటు చూచినా పెంధూళి, ఆలజడి, అరుపులు, పరుగెడుతున్న జింకల గుంపులు, పారి పోతున్న అడవి పందుల సమూహాలు.

ఆ వేటగాళ్ళ మాటలు నాకు వినబడుతున్నాయ్.

"ఇవిగో? ఎండుటాకులపై పడ్డ నెత్తురు చుక్కలు. ఈ దారినే మృగాలు పారిపోయి ఉంటాయ్. ఇవిగో ఏనుగుల కాళ్ళ క్రిందపడి నలిగిన డొంకలు, ఈ దారిచే మృగరాజు పరుగెత్తి ఉంటాడు..."

అందులో ఇంకొకని మాటలు—

"ఊ! వెంబడించండి - ఆ చమరీమృగాల్ని. కుక్కల నటు ఉసికొల్పండి? జింకల అడుగుజాడ లివిగో! ఇటే, ముందుకు పదండి!

మళ్ళీ ఒకే కేకలు!

ఆ కేకలకు అడవి అదరిపోతోంది.

ఆ శబ్దం విని నేనూ అదిరిపోయాను మహారాజా!

ఆ వేటగాళ్ల గుంపు తమ తమ నిశితాయుధాలను ప్రయోగించ సాగారు. వాడి వాడి బల్లెములు, దూసుకువచ్చే బాకులు, త్రిశూలాల్లాంటి అమ్ములు, చిమ్మచీకట్లు విరజిమ్మెనట్లు చొచ్చుకు వస్తున్నాయ్.

మృగాల్లో ఒకటే కల్లోలం. తల్లులను పోగొట్టుకుని విలపిస్తున్న గున్న ఏనుగుల గుంపులు, మగడు పోయిన దిగులుతో, దుఃఖిస్తున్న లేళ్ళు. పచ్చిబాలెంతలైన గండకీ మృగాలు, ఆ చెరలాటల్లో చిమ్మచీకట్లలో తప్పిపోయిన తమ పిల్లలను వెదుక్కుంటూ, ఆ వాడిబాణాలను తప్పించుకుంటూ, ఒకటే ఏడుపు.

త్రుటిలో ప్రశాంత విపినమంతా అల్లకల్లోలమైపోయింది చిలికి చిలికి జడివాన కురిసినట్టయింది. కెరటాలతో కలచిన సముద్రంగా మారిపోయింది.

ధైర్యం తెచ్చుకొని మా నాన్న రెక్కల సందులోంచి, చెట్టు తొర్రపైకి శిరస్సు నిగిడ్చి చూసాను.

అబ్బో శబర కిరాతకులు, ఒకళ్ళా, ఇద్దరా! పదులా, వందలా! వేనకువేలు సైన్యం, విరుచుకు పడుతున్నారు. కాళరాత్రులన్నీ కప్పివేయ వస్తున్నాయా? కాటుక కొండలన్నీ పడగెత్తుకు వస్తున్నాయా? సూర్యకిరణాల తాకిడితో, విచ్చిపారిపోయి వస్తున్న, చీకటి గుంపులా?

వాళ్ళు కిరాతకులే కాదు. యమకింకరుల్లా కనబడ్డారు. రసాతలం పగులుగొట్టుకొని పైకి వస్తున్న రాక్షసి మూకలా

వుందా సైన్యం, రామబాణాలకు బలై పోయిన పిశాచాలుగా మారిన ఖరదూషణాదుల కర్కశ సైన్యంలా వుందది.

ఆ సైన్యంమధ్య గున్నఏనుగు పిల్లలా వాళ్ళ సేనాధిపతి వున్నాడు. గురువు లేకుండా గురువును మించిపోయిన ఏకలవ్యుణ్ణి గుర్తుకు తెస్తున్నాడు - వాడు. కోరమీసం, మెలిదిరిగిన పిక్కలు. చింతగింజలాంటి గట్టి శరీరం. జడలుగట్టిన వాడి తలపై తుమ్మెదలు తిరుగుతున్నాయ్. అవును మరి! చంపిన ఏనుగుల మదజలాన్ని తలకు రాసుకున్నట్లున్నాడు. కళ్లు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయ్. చేతులు, తెగిపడిన ఏనుగుతొండాల్లా వ్రేలాడుతున్నాయ్. వింధ్య శిలలాంటి విశాలమైన వక్షం. ఆ వక్షంపై ఎఱ్ఱగురివిందల దండ!

మహాకాళీ భక్తునిలా త్రిశూలం త్రిప్పుకుంటూ వస్తున్నాడు. వాడిచుట్టూ వేటకుక్కల గుంపు. వాటి కోరలనుండి వెల్లుబుకుతున్న కాంతులు, వాటి కోరలసందు చిక్కుకున్న సింహ కేసరాల్లా మెరుస్తున్నాయ్. జింకపిల్లల నెత్తురును చప్పరించడంవల్ల ననుకుంటా — వాటి నాలుకలు ఎఱ్ఱగా వ్రేలబడి వున్నాయ్. వాటి శరీరాలపై ఖడ్గమృగాల పోట్లు, అడవి పందుల గాట్లు కనబడుతున్నాయ్. చూపుకు సింహపుపిల్లల్లా ఉన్నవవి.

వీటి వెనుక శబరులు వస్తున్నారు. వారి భుజస్కంధాలపై వేటాడబడ్డ, దుప్పికొమ్ములు, ఏనుగు దంతాలు, సింహపు కొనగోళ్ళ గుత్తులూ గలవు. వాళ్ళ శిరస్సులపై కొందరికి,

నెమళ్ళ పురులు, కొందరకు కాకి యీకలు వున్నాయ్.
కొందరు పులిచర్మం ధరించారు.

వారందరిమధ్య ఆ సేనాపతి సింహంబలునిలా అగపడు తున్నాడు. ఆతడి ఆకారం ఎంత భయంకరంగా వున్నా, కందమూలాలనే భుజిస్తూ, దుర్గాదేవినే భజిస్తూ శుద్ధ సాత్త్విక జీవితాన్ని గడుపుతాడతడు. తరువాత తెలిసింది అతడి పేరు మాతంగుడని.

ఏమైతేనేం! వాడు పాపానికి తోబుట్టువు. మూర్ఖు ఎందుకు అంతమంది వాడిని అనుసరిస్తున్నారో నాకర్థం కాలేదు. మంచివాని కెవడికీ అనుచరులుండరు. ఇతడి అను చరుల్లో రక్తం వారి పానం. మాంసం వారి భోజనం. పర కాంతలు వారి భార్యలు. ఛీ! ఛీ! తలచుకుంటే అసహ్య మనిపిస్తుంది.

ఉండుండి ఆ సేనాపతీ, ఆ పరివారమంతా, మా బూరుగు చెట్టు క్రిందనే వచ్చి కూర్చున్నారు. ఒక కిరాతకుడు గబగబా సరస్సులోకి దిగి, తామరదొప్పతో, మంచినీళ్ళు పట్టి తమ ప్రభువు కిచ్చాడు. తరువాతంతా తలకో దోసిలి నీళ్ళా త్రాగారు. అలసట తీర్చుకున్నారు. అటుపిమ్మట మరల కారు మేఘంలా కదలిపోయిందాదండు.

కానియింకొకడుమాత్రం మాచెట్టుక్రింద నిలిచిపోయాడు. వాడికి వాటా కిట్టలేదనుకుంటాను. మా చెట్టు వైపు, చిలుక గూళ్ళను లెక్కపెడుతున్న వాడిలా చూసాడు.

పడింది వాడి కన్ను. పాపాత్ముని కన్నుపడిన వస్తువేది బాగుపడుతుంది? అంతటి ఎత్తైన చెట్టును, గబగబా ఎక్కాడు. గూళ్ళలోనున్న వచ్చీరాని రెక్కలుగల చిలుకపిల్లలన్నీ హడలిపోతున్నాయ్. వాటి భయానికి తగ్గట్టుగానే, ఆ కిరాతకుడు చెట్లపిందెలు కోస్తున్నట్టు, ఒక్కొక్క చిలుక తలనుపట్టి చిదిమి, చెట్టు క్రిందకు పడవేస్తున్నాడు.

ఘోరకలి! హఠాత్తుగా వచ్చిన ఈ హంతకుడ్నిగాంచి, మా నాన్న కంపించిపోతున్నాడు. బేల చూపులు చూస్తున్నాడు. రక్షించే నాథునికోసం అతడి చూపులు వెదకున్నాడు. రక్షించే నాథునికోసం అతడి చూపులు వెదకుతున్నాయ్. నన్ను రెక్కలతో హృదయానికి అదుముకున్నాడు. పితృమమతతో విలవిలా కొట్టుకున్నాడు. కొమ్మకొమ్మకూ గాలించిన ఆ కిరాతకుడు కట్టకడపటికి మా తొర్రవద్దకూ వచ్చాడు. చేతిని తొర్రలోకి దూర్చాడు. ఆ చేయి, నానా రకాల పచ్చిమాంసం వాసన కొడుతూంది. యమదండంలా ఉన్న ఎడమచేతితో, ఆ కఠినుడు మా నాన్న తలను పట్టుకున్నాడు. మా నాన్న రక్షణకోసమని, వాడి చేతిని అనేకసార్లు ముక్కుతో పొడిచాడు. కెవ్వు కెవ్వున అరిచాడు. కాని ప్రయోజనం శూన్యమైంది. గొంతునొక్కి మా నాన్నను క్రిందికి విసిరేసాడు.

నా కింకా ఈ నేలపై నూకలున్నాయి కాబోలు. మా నాన్న రెక్కల సందునున్న నన్నతడు చూడలేదు. మా

నాన్నతోపాటు నేనూ క్రిందపడ్డాను. తృటున ఎగిరిపోదా మనిపించింది. ఇంకా నాకు సరిగ్గా రెక్కలు రాలేదు. నా ప్రాణంపై తీపికొలదీ, నెమ్మదిగా క్రిందనున్న ఎండుటాకుల సందునుండి. ఆ కిరాతకుడు క్రిందకు దిగడానికి ముందే తప్పించుకుపోయాను. తరువాతా కిరాతకుడు క్రిందికి దిగి, ఆ చిలుకలనన్నీ ఏరుకొని భుజాన గుత్తులుగుత్తులుగా వ్రేలాడ వేసుకొని, శబరసైన్యం పోయిన త్రోవనే వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళిపోయాక, అంతవరకూ నాలో అణగివున్న దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది. మా నాన్నకోసం ఏడ్చి ఏడ్చి గొంతుక పొడారిపోయింది. దాహంకోసమని నెమ్మదిగా, ప్రాకుకుంటూ కొలను చెంతకు చేరుకున్నాను. అప్పుడు నా అవస్థ నెవ్వరూ అర్థం చేసుకోలేరు. ప్రాణభీతి! అలసట! పసికందును కావడంవల్ల ఓపిక లేకపోవడం! అందులోనూ విపరీతమైన దాహం! అయినా బ్రతుకుకోసం తాపత్రయం!

జీవితాశ ఎంత చెడ్డది! ఇంత అవస్థలోనూ బ్రతుకుకై ఆరాట పడుతున్నానే! చనిపోయిన తండ్రినికూడా మరపించివేసిందే—ఈ దాహం! ఇంకా కొలను చాలా దూరముంది.

అదిగో! కొలనులోని కెరటాలపై తేలియాడు పిల్లగాలుల మెల్లనిరాగం వినబడుతోంది. తామర పద్మాల సుగంధం గుభాళిస్తున్నది. నడినెత్తిన పొద్దు పొడుస్తోంది. దాహం అధికమవుతోంది. నేల కాలిపోతున్న ఈ మండు ఎండలో ఆ కొలను చేరుకోగలనా?

ఛీ! ఛీ! మళ్ళీ బ్రతుకుపై ఆశ! దురాలోచన! స్వార్థ తలంపులు! అమ్మో శరీరం స్వాధీనం తప్పుతోందే? వొడలు సడలిపోతోందే! కళ్ళముందే చిమ్మచీకట్లు! చావుగాని ఆసన్న మౌతోందా?

అమ్మయ్య! అడుగో మునికుమారుడు! జాబాలి పుత్రుడు! సకల విద్యా విశారదుడు. హారీత నామధేయుడు — మరో కొందరు సమవయస్కులైన ముని కుమారులతో ఇటే వస్తున్నాడు.

అతడి శరీరం బంగారు నీరుపూసినట్టుంది. ఎర్రని జడలు. శ్రీకారం చుట్టినట్టున్న కుడి చెవిపై జపమాల, నుదుటిపై విభూతి, చేత కమండలం, చంకలో జింక చర్మం, భుజంపై తెల్లని యజ్ఞోపవీతం.

బ్రహ్మ వర్చస్సు తొణికిసలాడుతోంది. ఆయన వెనుక పెంపుడు జింకపిల్ల, స్వహస్తాలతో, గడ్డిగింజలను పెట్టి మేపినట్టున్నాడు. ఎంతో చనువుగా, దృష్టిని, పూల తీవెలపైనా రెల్లు పరకలపైనా ప్రసరిస్తూ, మువ్వలా నడుస్తోంది.

నార గుడ్డలు కట్టుకున్న ఆ ముని కుమారుని చూడగానే అతడు సత్వగుణ సంపన్నుడని బోధపడక పోదు. అంతే సత్పురుషులు. వారి హృదయాలు కూడా అనురాగ రాగ రంజితమై ఉంటాయ్. జాలిగా. తన ప్రక్క నడుస్తున్న ముని కుమారునితో నన్ను చూపిస్తూ అంటున్నాడు—

'పాపం! ఆ చిలుక కూన రెక్కలు రాకముందే, గూడు నుండి కింగకు పడిపోయి ఉంటుంది. నడవలేక, నడవలేక పడుతూ లేస్తూ ప్రాకుతున్నది. తనతల బరువునే తాను మోయలేక పోతున్నది. చనిపోకముందే దాన్ని తటాకం చెంతకు చేరుద్దాం' అని.

దగ్గరకొచ్చి నన్ను మెల్లగా పట్టుకొని, సరస్సు చెంతకు తీసుకెళ్ళాడు. రెండు నీటి చుక్కల్ని నా గొంతులో పోసాడు. నా ప్రాణాలు లేచి వచ్చాయ్. అతడూ తన జప తపాదులను పూర్తి చేసుకొని, తడిసిన నార వల్కలను ధరించి నన్ను తనతో పాటు తపోవనానికి తీసుకు పోయాడు.

దూరంగా జాబాలి ఆశ్రమం కనబడింది.

ఆహా! ఏమి ప్రశాంత జీవనం? అచ్చట పూల మెత్తదనానికి ముని కుమారుల ముఖారవింద మృదుత్వానికి తేడా లేదు. నెమళ్ళు, పావురాలు అన్నీ అధ్యయనం చేస్తున్న శిష్యగణం శిరస్సులపై నుండి ఎగురుతూ కేరింతలు కొడుతున్నాయ్.

ఆశ్రమంలో నడబావు లున్నాయ్. ఆ నడబావుల్లో సప్తర్షి మండలం రాత్రులందు ప్రకాశిస్తూ, ఆ మునులదర్శనం చేసుకోడానికి వచ్చారా అనిపిస్తుంది. బావులనిండా, పై వరకూ పచ్చని లతలు, ఆ లతలలో పూవులు! ఆ పూవులలో రంగు రంగుల రేకులు, ఆహా!

ఆ సద్ధర్మ పరులైన తపోనిష్ఠులైన, మునిలోకానికి చుట్టూ తలలు వాల్చిన చెట్లు, వ్రేలాడే ఫలాలు, అన్నీ వొంగి నమస్కరిస్తున్నట్టుగానే ఉన్నాయ్.

అక్కడ చిలుకలు, మునులు ఉచ్చరించే మంత్రాలను పునశ్చరణ చేస్తున్నాయ్. వాళ్ళు కల్లాపులు చల్లి ముగ్గులు పెట్టబడి రంగవల్లులుగా కనబడుతున్నయ్. మునుల కోసం, జింకలే తమ కొమ్ములతో నేలను కోరాడి కంద మూలాలను తెచ్చి పెడుతున్నాయ్. ఏనుగులే తమ తొండాలతో జలాన్ని పీల్చి తెచ్చి వొదులుతున్నాయ్. హోమాగ్నులను మునులకు శ్రమ లేకుండా, నెమళ్ళే తమ రెక్కలతో రాజేస్తున్నాయ్.

అక్కడక్కడ ముని కుమారులు, రాటలు పాతి కొత్త ఆశ్రమాలను నిర్మిస్తున్నారు. కొందరు పాదులు పెడుతున్నారు కొందరు చెట్ల చుట్టూ నిర్మించిన గట్లపై కూర్చొని, శాస్త్ర సమాలోచనలు గావిస్తున్నారు. కొందరు పరివ్రాజకులను సత్కరిస్తున్నారు. ఆనందాల పాలవెల్లి అది. సంతోషాల కల్పవల్లి. కలియుగంలో అటువంటి తపోవనమే కానరాదు. అబద్ధాలక్కడ ఉండవ్. అసూయలకు, వంచనలకూ అక్కడ తావు లేదు. ప్రకృతి రమణీయంతో తేజస్సుతో ప్రకాశించే సత్యలోకమది.

ఆ సత్య లోకంలో సాక్షాత్తు బ్రహ్మ దేవునిలా, నాకు జాబాలిమహర్షి కనుపించాడు. జాబాలంటే ఎవరనుకున్నావ్?

రామునికి శాస్త్రతత్త్వబోధ గావించినవాడు. ఆయన చుట్టూ ఉగ్ర తపస్వులైన మునులు కూర్చుని ఉన్నారు. ఆయనో, ముడతలు పడిన శరీరంతో వొణుకుతూ తెల్లగా తెల్ల కలువలా ముడుచుకుపోయి కూర్చున్నాడు.

తత్త్వ శాస్త్రంలో రాజులను, తపస్సులో, మునులనూ జయించి ఎగరవేసిన పతాకమా అన్నట్టు-అతడి తలపై జడలు ప్రకాశిస్తున్నాయ్. ఆయన నుదుటిపై మూడు విభూతి రేఖలు. హిమతలంపై నుండి అడ్డంగా పారే మూడు నదులవలె గోచరిస్తున్నాయ్.

ఆయన చెక్కిళ్లు చిక్కిపోయాయ్. శరీరం శుష్కించి, ఎముకలు బయటకు కనబడుతున్నాయ్. కను రెప్పలు వాలిపోయాయ్. నాభిదాకా గడ్డం పెరిగింది. గాలికి ఇట్టే కదలిపోయే అరటాకులా ఆయన శరీరం కదులుతోంది.

సముద్రంలోని గాంభీర్యం, కొండల్లోని నిబ్బరం, సూర్యునిలోని తేజస్సు, చంద్రునిలోని చల్లదనం. ఆయన ముఖారవిందంలో గోచరిస్తున్నాయ్.

ఆయన దీనజన బాంధవుడు. శరణాగత రక్షకుడు. ఆహా! ఆయన ఎంత సన్నగా ఉంటే ఏం? మహా తపో సంపన్నుడు. ఆయన ముఖ కాంతి, సూర్యకాంతినే ధిక్కరిస్తున్నదే! చూడ్డానికి ఈ కన్నులే సరిపోవడం లేదే!

మునులను స్మరిస్తేనే పుణ్యమన్నారు—ఇటువంటి మునులను చూసే కాబోలు! ఆహా, ఈ మునికుమారులు, ఈ

ఆశ్రమం, యీ పక్షులూ, వృక్షాలూ, పూవులూ, ఎంత పుణ్యం చేసుకొని పుట్టాయ్. కడకు యీయన జిహ్వాపై నిలచిన ఆ సరస్వతికూడా ధన్యతనే చెందింది.

సాధుత్వం, యీయనలోంచే పుట్టి సర్వ మానవ లోకానికీ సరఫరా అయివుంటుంది. అవమానాల్నీ, అభిమానాల్నీ, రోషాల్నీ, ఆవేశాల్నీ అసలు దాపుకే రానీయని మహాత్మాని. ఈ మహాని ప్రభావం వలన ఆ తపో వనంలోని వైరి జాతులన్నీ వైరాలు మానుకొన్నవి. జింక పిల్లలు, సింహాల పాలు త్రాగుతున్నాయ్. నెమలిపురి నీడలో పాములు పవ్వళిస్తున్నవి. మార్జాల మూషికములు కలసి ఆడుకుంటున్నాయి. ఏనుగు పిల్లలు, సింహ కేసరాలను దువ్వుతున్నాయ్. కోతులు మునికుమారులకు ఫలాలు తెచ్చి అందిస్తున్నాయ్.

అంతటి అరమరకలు లేనిదా ఆశ్రమం.

హరీతుడు ప్రశాంతంగా వెళ్ళి, అశోక వృక్షం క్రింద జప మాలికను త్రిప్పుతూ కూర్చున్న తన తండ్రి పాదాలకు నమస్కరించి ఆ పక్కనే కూర్చున్నాడు. ఆయనకూడా వెళ్ళిన నన్ను చూసి, మునులంతా ఆయనను ప్రశ్నించారు — యీ చిలుకెక్కడ దొరికిందని.

'నేను స్నానానికి వెడుతుండగా, ముందు కొండలో కొన ఊపిరితో కొట్టుకుంటున్నది. తిరిగి చెట్టుపై బెట్టినా బ్రతకడం కష్టమని ఆశ్రమానికి తీసుకొచ్చాను. దిక్కులేని పక్షులను

కాపాడ్డమేకదా మన ధర్మం. మన ఆశ్రమంలోని ఏ చెట్టు తొర్రలోనో పండ్లరసాన్ని త్రాగుతూ రెక్కలు వచ్చేవరకూ ఉంటుంది. తరువాత తన యిచ్ఛవచ్చిన చోటికి వెడితే వెడు తుంది. లేక ఉండిపోతే యిక్కడనే ఉండిపోతుంది,' అన్నాడు.

ఆ మాటలకు జాబాలి మహర్షి నాపై పుణ్య జలం చల్లు తున్నవానిలా నావైపు చూశాడు. ప్రశాంతంగా వీక్షించి సాలోచనగా అన్నాడు—

'అందుకే పాపఫలం అనుభవిస్తున్నది' అని.

త్రికాలజ్ఞుడైన మహర్షి ఆయన. ఆయన పూర్వ జన్మల దివ్యజ్ఞానమేగాక, వర్తమాన జీవితాల ఆయుఃపరిణామాన్ని కూడా యిట్టే చెప్పగల మహాతపస్వి. ఆ పలుకులను విన్నాక, మిగిలిన మానులందరికీ ఆ పాపఫల మేమిటో వినాలనిపించి అడిగారు—

'ఇది చేసిన తప్పిదమేమిటి? ఎందుకు చేసింది? దీని పూర్వ జన్మ ఏమిటి?' అని.

జాబాలి దూరాలోచనతో అన్నాడు—

'ఇది చాలా పెద్దకథ. ఇప్పుడు పొద్దు అట్టేలేదు. స్నానా దికములు ముగించుకొని ఫలహారంచేసి విశ్రమించు సమ యంలో ఆ కథంతా చెబుతాను. వీడెవరు? పూర్వ జన్మలో వీడు చేసిన పాపమేమిటి? ఈ లోకంలో ఎందుకు పుట్టాడు? అన్నీ చెప్తాను. అందాకా దీనికేమైనా ఆహారమిచ్చి సేద

దీర్చండి! వస్తే, నేను చెబుతున్న సమయంలో దీనికి ఒక లీలగా పూర్వజన్మ స్మరణ కలుగవచ్చు.' అంటూ జాబాలి లేచి పోయాడు.

# 3

పొద్దు వాలింది. సూర్యుడు పడమటి సముద్రంలో పడ్డాడు. అతడు పడినప్పుడు త్రుళ్ళిన తుంపరలో అన్నట్టు ఆకాశంపై నక్షత్రాలు వెలసాయి. మరొక్క క్షణంలో మునులు ఉన్ముఖులై ప్రణామాంజలులను పైకి వెదజల్లారు. సాంధ్యారాగం కడిగి వేసినట్టయింది.

సంధ్య పోయెనే అన్న చింతతో దిశాకాంత, చీకటి జింక చర్మం కట్టుకొంది. ముని హృదయాలు తప్ప, సర్వలోకమూ చీకటి మయమైపోయింది.

రవి అస్తమించాడన్న వార్త తెలియగానే, చంద్రుడు విరాగై బయలుదేరాడు. చంద్రాలంకృతమె తారకలన్న కపాలములను ధరించిన ఆకసం నుంచి శివుని శిరస్సుపైనుండి గంగ దుముకుతూ. సాగరములను నింపివేసినట్లు వెన్నెల వెల్లడలా అలముకొంది. విరిసిన తెల్ల తామరలావున్న చంద్ర సరస్సులో వెన్నెల నీటిని త్రాగుదామని వచ్చి, ఆ అమృత పంకంలో చిక్కిపోయినదా అన్నట్టు, జింక చిహ్నం కష్ట బడుతోంది.

క్రమంగా చంద్రుడు గగన మధ్యానికి వొచ్చాడు. లోక మంతా ధవళమైపోయింది. పుచ్చపువ్వు విరిసినట్టుగా మారి పోయింది. ఆశ్రమ మృగాలు ఆ చల్లదనంలో, చిరుగాలిలో హాయిగా నిద్రిస్తున్నాయ్.

స్నానాదికములు తీర్చుకొని ఫలహారం ముగించుకొని వేత్రాసనంపై కూర్చున్నాడు. జాలపాదుడనే శిష్యుడొకడు ఆ చెంతనే కూర్చొని దర్భతో విసురుతున్నాడు. నెమ్మదిగా అంతా చుట్టూ చేరారు.

సాయం సమయంలో చెబుతానని వాగ్దానం చేసిన చిలుక కథను చెప్పమని, మునులందరి పక్షాన, హారీతుడు తండ్రిని ప్రార్థించాడు.

కుతూహలంతోనున్న మునులనుగాంచి, జాబాలి ఆ కథను ఇలా చెప్పసాగాడు.

'నాయనలారా! నవ్య యుగానికి నీరాజనా లెత్తుతున్న ఉజ్జయినీ అనే పట్టణ మొకటుంది.

దానిచుట్టూ ఎత్తైన ప్రాకారముంది. ఆప్రాకారం చుట్టూ లోతైన అగడ్త ఉంది. పట్టణ మెప్పుడూ కళకళ లాడుతూ ఉంటుంది. అందులోని రాజవీధి అంగళ్ళన్నీ రత్నాలతో, పగడాలతో, వజ్రాలతో నిండి ఉంటాయ్. ఆరుబయటే బంగారు చూర్ణం రాసులు అమ్ముతారు. ఆదృశ్యం చూస్తే అగస్త్యుడు సముద్రం పానం చేసిన పిదప మిగిలిన ఇసుక తిన్నెల్లా ఉంటాయి ఆ వీధులు.

ఆ నగర చిత్రశాలల్లో దేవదానవ, గంధర్వ యక్షకిన్నెర కాంత లనేకులుంటారు. దేవలోకంనుండి చూడవచ్చి నిలచి పోయిన దివ్య విమానాల్లా కనబడతాయి- ఆ చిత్రశాలలు. నాలుగు మొగలు కలసిన కూడళ్లు ఆ నగరంలో చాలా ఉన్నాయ్. ఆయా చోటుల్లో దేవళాలు సగర్వంగా నిలచి ఉన్నాయ్. ఆ దేవళాల శిఖరాలపై నుండే స్వర్ణకలశాలూ, ధవళ పతాకాలూ, హిమగిరి శిఖరాలనుంచి దూకుతున్న గంగను పోలి ఉంటాయ్. నగరులో ఒక్కొక్క ప్రదేశం చుట్టూ పచ్చిక బయళ్ళున్నాయ్. వాటి పచ్చికను జల యంత్రాలు నిరంతరం, పచ్చతనాన్ని కోల్పోకుండా తడుపు తుంటాయ్. ఇక వనాలంటారా? రంగు రంగుల పూలతో; ఆ పూలపై తుమ్మెదల ఝూంకారాలతో. మలయ మారుత అలల నాట్యాలతో చూడ ముచ్చటగా హృదయోల్లాసంగా ఉంటాయ్.

ఎన్నెన్నో స్వర్ణ భవంతులున్నాయ్, ఆ భవంతులపై సూర్య కిరణాలు పడి, ఇంద్ర ధనువులోని ఏడు వన్నెలనూ మరిపిస్తాయ్. ఇంద్రుడికున్న వేయి నేత్రాల్లా ఆ నగరంలో వేయి సరస్సు లున్నాయ్. ఆసరస్సులలో తామరపద్మాలు, రాజ హంసలు, కలకలారావం చేసే తుమ్మెదలు, జలక్రీడ లాడే సౌందర్యవతులు, నిత్యం అగపడు తుంటారు.

ఆ నగరంలో విలాస పురుషులకు. కోటికి పడగ లెత్తిన వారికి, వేదాధ్యయనం చేసే విప్రకోటికి, ధర్మాత్ములకు,

వీరులకూ, నాట్యగత్తెలకూ కొదువ లేదు. ఆ నగరానికి ముల్లోకాల్లోనూ ఖ్యాతి దెచ్చిన ఉపజ్ఞులు వారే. చిరునవ్వు నవ్వికాని ఎదుట వారిని పలుకరించని హాస్య ప్రియులు. సామనస్కులు! వారికి కుల మత బేధాలు లేవు. సర్వసములైన శాంత చిత్తులు వారు. తరతరాల స్వర్ణ చరిత్రలను మేళవించుకొని, కారుణ్యతను సంతరించుకుని స్నిగ్ధ బౌద్ధారామాలతో కన్నుల పండువుగా నుండే ఆ ఉజ్జయినిపట్టణం-ఆవంతీ దేశానికి రాజధానై ఉంది.

ఆ రాజధాని అందమైన కాంతలకు ప్రసిద్ధి. చీకటి భవనాల్లో కూడా వారున్నంత మాత్రాన దీపమే అక్కరలేదు. వారి శరీర కాంతే, వారు ధరించిన ఆభరణాల తేజస్సే ఆ భవనానికి వెలుతురు. ఆకాంతలను గాంచిన చంద్రుడే మదన పీడితుడై, తన తాపాన్ని చల్లార్చుకోడానికి. ఆ నగర భవనాల చంద్రకాంత శిలా ఫలకాలపై దొర్లుతుంటాడు. అనగా చంద్రుడు ప్రతిబింబించ గలిగినంతటి నున్నని చలువరాళ్ళచే ఆ భవనాలు నిర్మించారు.

ఇటువంటి వుజ్జయినీ నగరానికి రాజు - తారాపీడుడు. సంపన్నుడాయన. షట్చక్రవర్తులకున్నంత కీర్తి ఆయనకుంది. భుజబలంతో సమస్త ధరామండలాన్ని జయించిన ప్రభువాయన. వాణిసైతం, బ్రహ్మాసు విడిచి ఇక్కడ తిష్ట వేసింది. విష్ణు వక్షసల సుఖాన్ని కూడా త్యజించి, లక్ష్మీదేవి, యీ

యనను ఆశ్రయించింది. అతడజాతశత్రువు. ప్రజాపాలనంలో పొగడ్తలు గన్నవాడు. అనేక పాపాలతో నిండిన కలికాలం, రావణుడు కైలాసాన్ని కదిలించినట్లు ధర్మాన్ని ధ్వంసం చేయ సమకట్టగా దాన్ని పునరుద్ధరించిన ధీరుడాయన. అందానికి మన్మథుడీయన. రతీదేవి మొరవిని జాలిపడ్డ శివుడు, తిరిగి మన్మథుణ్ని బ్రతికించాడా? అని యీాయన్ను చూచినవారు భ్రమిస్తారు. ఆసేతు హిమాచల పర్యంతం, పరాజితులైన రాజరాజన్యులంతా యీాయనకు నిత్యం మ్రొక్కుతుంటారు. రాజులే కాదు. రత్న ఖచిత సింహాసన మలంకరించగానే దిక్కులే తలలు వాల్చి వినమ్రమవాతాయ్. ఆయన ప్రతాపాగ్నిని భరించలేక రాజ్యలక్ష్మి ఆయన ఛత్రచ్ఛాయల క్రిందనే తల దాచుకొంటుంది. ఆయన చరితే తను చరితగా భావించుకొని జనులు ఉప్పొంగిపోతారు. ఆయన రాజ్యంలో, దొంగలు, జారులు. లోభులు, కుత్సితులూ, వంచకులూ లేరు. ఖైదీలు లేరు. దండన లేదు. దండన భటులు లేరు. భయం! మారణ హోమం! ఆత్మ హత్యలూ, ఆపదలూ, అసలు కనబడనే కనబడవు.

ఆయనకో మంత్రి ఉన్నాడు, అతడిపేరు - శుకనాసుడు. రాజుకుతగ్గ మంత్రి ఆయన. ఎటువంటి విధినిర్వహణలోనైనా తొణకడు. జంకడు! చిక్కు సమస్యలను విప్పడంలోనైనా చలించడు. అన్ని నిగ్రహాలు సొంత సొత్తుగా చేసుకున్న వాడాయన.

ఇంద్రునికి బృహస్పతిలా, బలిచక్రవర్తికి శుక్రునిలా, దశరథునికి వశిష్టునిలా, రామునికి విశ్వామిత్రునిలా ధర్మరాజునికి ధౌమ్యునిలా, తారాపీడునికి ఆలోచనలో పాలనలో రాజ్యతంత్రంలో ఇతడు తీసిపోనివాడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. అపార పారావార పరీతమైన యీ భూమండలంలో ఎచట చీమ చిటుక్కుమన్నా. ఇట్టే కనిపెట్టగల వాడతడు. అందుకే తారాపీడుడు, రాజ్యమంతా, శుకనాసుని చేతిలో పెట్టి, ఇక తనకు శత్రువులే లేరుగనుక నిర్భీతితో యౌవ్వన సుఖాన్ని అనుభవించసాగాడు.

కామినీ లోలుడై కులుకుతుంటాడు. వారిపాటలలోనే, నృత్యంలోనే, సంగీతంలోనే, చిత్రలేఖనంలోనే మనస్సు చొప్పించి, సంతోషంతో పొంగిపోతూ ఉంటాడు. వారితోనే ఆడుకుంటాడు. మదనుని బంగారు బాణాలవలె ఆ కామినుల హస్తాలనుండి స్రవించు కుంకుమ జలధారలకు ఒక్కొక్కప్పుడు ఆయన బట్టలు ఎర్రబడిపోతాయ్. ఒక్కొక్కప్పుడు అంతఃపుర కాంతలతో అతడు జలక్రీడ లాడుతాడు. వారి చనుగవపై అలదుకున్న చందన చూర్ణం, కలసి తెల్లబడ్డ ఆ నీళ్ళలో మునిగి తేలుతాడు. ఒక్కొక్కప్పుడు మన్మథ క్రీడాసంకేత స్థలానికి వారిని రమ్మంటాడు. తను వెళ్ళడు. అప్పుడు వారలు ఆయనను తమ శిగలో తురిమిన పూదండలతో కొట్టి కొట్టి వోదులుతారు. ఒక్కొక్కప్పుడు అంతఃపురంలో కళాకేళిలో మునిగి తేలుతాడు.

జీవితంలో రమణీయమైనదాని నల్లా అనుభవిస్తాడు. అలా అని విషయ లోలుడు కాదు. అందులోనే లీనమైపోడు. అవసరమైన రాచ కార్యాలనన్నీ చూస్తాడు. అందరికీ దర్శనమిస్తాడు. ఆయన చూడకపోయినా సమర్థించుకు పోగలిగిన మహామంత్రి ఉన్నాడుగా!

మంత్రైతే మాత్రం, రాజశ్రీలో తారాపీడునికి యెంత మాత్రం తీసిపోడు. అతడు కదిలెనా, ఆతని వెంట గజ, తురగ, సైనిక పంక్తులన్నీ కదలవలసిందే. భువనాంతరాళం దద్దరిల వలసిందే. దిక్కులు అదరవలసిందే. ఆ పదఘట్టనలకు రేగిన ధూళికి, సూర్యుడైనా కప్పడవలసిందే. వేల కొలదీ ఛత్ర చామరాలు, పరిచారికలు వీస్తూనే ఉంటారు. వందలకొలదీ వంధిమాగధులు స్తోత్రపాఠాలు చదువుతూనే ఉంటారు.

ఇలాతలం తల క్రిందులౌతూనే ఉంటుంది. అయితే అంతటి మహామంత్రికీ ఒకమనోవేదన మాత్రం మిగిలిపోయి ఉండేది. తారాపీడునికి సంతానంలేదు. అంతఃపుర భవనం కళావిహీనమై ఉండేది. తారాపీడుని భార్య విలాసవతి. ఆమె నిజానికి అంతఃపురంలో చంద్రునికి చంద్రికలా, సరస్సుకు తామర పద్మంలా, గగనానికి నక్షత్ర పంక్తిలా, మలయపర్వతానికి చందన వనరాణిలా ఆ మహారాజుకు భూషణ ప్రాయంగా ఉండేది. అద్భుతరూప లావణ్యవతి. సౌందర్యఖని!

కాని, ప్రయోజన మేముంది ? సంతానంలేదు. పుత్రులు లేని వారికి గతులుండవు గదా ! ఆ చింతతోనే ఒక రోజు, తారాపీడుడు విలాసవతి అంతఃపురంలో అడుగు పెట్టాడు. అదే చింతతో అంతఃపురంలో విలాసవతి శోకతప్తయై ఉంది. ఆమె కన్నీటితో హంసతూలికాతల్పమంతా తడిసి పోయింది. చెలికత్తెలు ఆమెను ఊరడిస్తున్నారు, మహారాజును చూచి, అంతా ప్రక్కకు తొలగిపోయారు. విలాసవతి, దిగ్గున లేచి నిలిచింది. మహారాజు ఆతృతగా ముందుకొచ్చి, ఆమెను హంసతూలికంపైనే కూర్చుండనిచ్చి, కన్నిటిని తుడుస్తూ అన్నాడు—

"దేవీ ! ఏమిటీ వాలకం ? పాదాలకు పారాణైనా పెట్టుకోలేదు. కళ్ళకు కాటుక లేదు. మెడలో భూషణాలు లేవు. నడుముకు వడ్డాణం లేదు. సిగలో పూవులను తురుమలేదు. నిరలంకారివై ఎందుకిలా దుఃఖిస్తావు ? వక్షస్థలంపై మకరికా పత్రాలనైనా రచించుకోలేదేం ? ఎందుకిలా చంద్రలేఖ లేని బహుళపక్ష రాత్రివలె, పూవులులేని కబరీ భారంతో కుమిలిపోతావ్ ! నీ దుఃఖకారణ మేమిటో నాతోనే చెప్పవా ! పెనవేసుకు పోయిన హృదయాలుగదా మనవి ?"

ఆమె నోట జవాబు రాలేదు. ప్రక్కనున్న పరిచారికలను అడిగాడు - మహారాజు. దేవి అంతరంగిక చెలికత్తె 'మకరిక' రాజుతో అంది——

"మహారాజా! ఈ రోజు చతుర్దశి కావడంవల్ల దేవి మహాకాళుని పూజకు వెళ్ళింది. అక్కడ మహాభారత పఠనం విన్నది. అందులో పుత్రులు లేనివారికి పుణ్యలోకాలు రావనీ, పున్నామ నరకంనుండి రక్షించేవాడు - పుత్రుడేనని చెప్పగా విన్నదట! పూజనుండి వచ్చినప్పటినుండీ ఇలా కుమిలి కుమిలి దుఃఖిస్తోంది ప్రభూ!"

మహారాజు ఓ గాఢ నిట్టూర్పును విడిచాడు.

"దేవీ! మన దురదృష్టానికి విలపించి, ప్రయోజన మేముంది? పూర్వజన్మలో మనమేం పాపం చేసుకున్నామో నేడు అనుభవిస్తున్నాం. ఈ జన్మలోనైనా పుణ్యం చేసు కుంటే, మళ్ళీ జన్మలో సంతాన ప్రాప్తయినా కలుగుతుంది. మునిలోకాన్ని పూజించు! దేవునికంటే మునులు దుర్లభ మైనమన కోర్కెలను తీర్చగలరు. పూర్వం కృష్ణునే జయించ గలిగిన జరాసంధునవంటి పుత్రుణ్ని బృహద్రథుడు పొందినది మునియైన చండకౌశికుని ప్రభావం వల్లనేకదా! ముని సేవ వ్యర్థం కాదు దేవీ! నీవు గర్భందాల్చి నన్నెప్పుడు ఆనంద పరుస్తావోనని ఎదురు చూస్తున్నాను. పుత్రుడుదయించి, మంగళ దీపంవలె, నా శోకాంధ కారాన్ని ఎప్పుడు దూరం చేస్తాడోనని వువ్విళ్ళూరుతున్నాను. ఒళ్ళంతా కళ్ళు చేసు కుని, వాడెప్పుడు నా కన్నుల ముందు తారాడునోకదా అని కళ్లు కాయలు కాసేలా చూస్తున్నాను. నడవడం నేర్చుకుని

సింహంపిల్లలా జింకపిల్లలను పట్టుకొని ఎప్పుడు నా కన్నుల ముందు కనబడతాడో! అగరు గంధంతో చెక్కిళ్ళపై చిత్రరువులు రాయించుకుని సుగంధం పూసిన తన చిట్టిచేతులతో నా తలను పట్టి, ఎప్పుడు లాగుతాడో! నీ కాళ్ళకు రాసుకున్న పారాణిని వృద్ధ సేవికుల ముఖాలకు రాసి ఎప్పుడు ఏడిపిస్తాడో! రాజరాజన్య పరివేష్టితుడనై నేను సింహాసన మలంకరించి నప్పుడు కళ్లు జిగేలు మనిపించేలా చంద్రహాసం ధరించి, నా బిడ్డ డెప్పుడు నా ముందు ప్రత్యక్ష మౌతాడో! ఇలా కోరికలతో, కలలతో నిద్ర లేని రోజుల్ని లెక్కిస్తున్నాను దేవీ! కాని విధి మన యెడల మౌనం వహించింది. అయినా శోకంతో ఏమిసాధించగలం! ధర్మవర్తినివై, పూజావ్రతవై కాలం గడుపు! ఏ నాటికైనా మనకు సంతాన ప్రాప్తికలుగుతుందేమో!' అని పలు విధాల పలికి, ఆమెను ఓదార్చి తారాపీడుడు అక్కడనుండి వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిపోయాక నిగ్రహాన్ని కోల్పోని విలాసవతి సర్వాలంకార సంశోభితురాలై, నాడు మొదలు నిత్యదేవతారాధనతో గురుజన పూజలతో కాలం గడుపుతోంది. ధవళ వస్త్రాలు ధరించి, పచ్చని గరికపైనా, రోకళ్ళపైనా శయనిస్తుంది. తీర్థోదకాలు నింపి, బంగారుపాత్రలతో పుణ్యగోవుల క్రింద కూర్చుని జలకమాడుతుంది. నిత్యం సద్బ్రాహ్మణులకు నవరత్న దానం చేస్తుంది. బహుళ చతుర్దశి రాత్రులలో

వీధి మొగలలో దిగ్దేవతలకు రక్తబలులను సమర్పిస్తోంది. అనేక మ్రొక్కులు మ్రొక్కుకుంటోంది. ఆమె చేయని పుణ్యకార్యం, ఆమె చేయని పూజా ఇక మిగిలిలేదు. వనమూలికలను, రక్షరేఖలను దండలకు ముంజేతులకు కట్టుకొని, నిష్ఠాగరిష్ఠురాలై నిద్రిస్తూఉంది.

ఇలా కొంత కాలం గడిచింది.

ఒకరోజు తెల్లవారు ఝామున. తారకలు తెల తెల్లగా మిణుకు మిణుకు మంటున్నాయ్. ఆకసం ధూమ్ర రంజితమై ఉంది. నిద్రిస్తున్న మహారాజుకు ఒక కలవచ్చింది.

మహారాణి విలాసవతి, ధవళగిరి శిఖరంపై నిలుచున్నదట. కరిణి నోటిలోనికి వెలగపండు వెళ్ళినట్టుగా, పరిపూర్ణ చంద్రబింబం ఆమె నోట ప్రవేశించిందట!

వికసితనేత్రుడై ఉబ్బితబ్బిబ్బై, సకలశాస్త్రపారంగతుడైన మహామంత్రివద్దకు పరుగెత్తుకు వెళ్ళాడు మహారాజు. తనకు వచ్చిన కలను వివరించాడు.

'ఆహా! మహారాజా! చిరకాలానికి మనకోర్కె యీడేరింది. కొద్ది రోజుల్లోనే తమకు పుత్రముఖ సందర్శనం లభిస్తుంది. రానున్న శుభోత్సవానికి చిహ్నం-ఈ కల! అందులోనూ, తెల్లవారుఝామున వచ్చినకల సఫలంకాక తప్పదు. మాంధాత వంటి ధీ తముడైన పుత్రుడుదయించ గలడు! అనతి కాలంలోనే దేవి గర్భందాల్చి ప్రసవించగలదు. ఇక కొత్త

మొగ్గల్ని తొడిగిన శరత్కాల పద్మాన్ని, మదగజాన్ని ఆనందింప జేసినటు మిమ్మల్ని మహారాణి ఆనంద వారాశిలో ముంచెత్తగలదు ప్రభూ....'

ఆ ఆనందంలో ఇక మహామంత్రికి నోట మాట రాలేదు. అంతఃపురంలో పండు వెన్నెల విరిసింది. మహారాణికి వార్త అమృత కలశంలా అందింది. విలాసవతి, ఆనందానికి మేర లేదు. ఆ ఆనందంలోనే కొద్దిరోజులకు ఆమె గర్భందాల్చింది. నందన వనంలోని పారిజాతంలా, పురుషోత్తముని వక్షస్థల కౌస్తుభంలా దేవి ప్రకాశించ సాగింది.

ఆమెనడక మందగించింది. పాలిండ్లునల్లబడ్డాయ్. సముద్ర జలపానం చేసిన మేఘంలా ఆమె నడయాడుతోంది. వేవిళ్ళు ఉద్భవించాయ్. తీరని కోర్కెలు జనించాయ్.

దేవి, అంతఃపుర దాసీలలో 'కులవర్ధన' అతి సన్నిహితురాలు. సరాసరి, మహారాజుతో మాట్లాడేయగలదు.

మహారాజు సభను చాలించి, అంతఃపురంలోని ఆస్థాన మండపంలోనికి వచ్చి కూర్చున్న తరుణంలో 'కులవర్ధన' దేవి గర్భందాల్చిన వార్తనుమెల్లిగా ఆయన చెవుల్లో వేసింది.

అప్పుడు మహారాజు సుగంధ తైలంతో వెలిగించిన వేయి దీపాలమధ్య, వేయి తలల నాగేంద్రంలా కూర్చొని ప్రకాశిస్తున్నాడు. చుట్టూ రాకుమారు లనేకులున్నారు, మరో రజితాసనంపై మహామంత్రి ఉన్నాడు.

అప్పుడీ వార్త చేరింది.

అందరిలో అనూహ్యమైన ఆనందం. మహారాజు కనుకొల కుల నుండి, ఆయనకు తెలియకుండావే బొటాబొటా ఆనంద భాష్పాలు రాలాయి. తడబాటుతో, ఆ వర్తను అక్కడున్న వారికి చెప్పాలనుకోడం చెప్పలేకపోవడం. అనేక ఆశ్చర్య సంఘటనలు ఒకదానిపై ఒకటి జరిగాయ్.

మహారాజుయొక్క ఆ విచిత్ర పరిణామానికి హేతువేమిటో తెలుసుకోవాలన్న ఆతృత అందరిలో పొటమరించింది. మహా మంత్రీ ఆతృత పడ్డాడు. తన ఆసనాన్ని మహారాజు చెంతకు జరుపుకొని అడిగాడు—

'మహారాజా! స్వప్నం ఫలించిందా? లేకపోతే, తెగిన ముత్యాల సరుల్లా ఈ ఆనంద భాష్పాలేమిటి? చెప్పి, నా ఆతృతను తీర్చండి మహారాజా?'

'ఏమో మహామంత్రీ! కులవర్ధన చెప్పినదే నిజమైతే, కల ఫలించినట్టే'

'కులవర్ధన అబద్ధం చెప్పే మనిషి కాదే!

'ఏమో నాకు నమ్మకం చాలడం లేదు. స్వయంగా దేవినే అడిగి తెల్సుకోవడం మంచిది.'

'అలాగే చేయండి ప్రభూ!'

మహారాజు, రాకుమారులందర్నీ పంపించివేసాడు. కులవర్ధనకు ముప్పేట ముత్యాలహారాన్ని బహూకరించాడు, రాజ దుస్తులన్నీ విడనాడి, నిరాడంబర భూషితుడై అంతఃపురంలోకి ప్రవేశించాడు.

అది విలాసవతి భవనం.

చుట్టూ విచ్చుకత్తుల పహరావుంది. వెల్లలు వేసి రంగులు దిద్దిన కారణంగా ఆభవనం కలకలలాడుతూ ఉంది. వాకిలిలో పూర్ణకుంభాలున్నాయ్. ముత్యాల ముగ్గులున్నాయ్. మణి దీపాలు వెలుగుతున్నాయ్.

తెల్లటి దువ్వలువలు పరచిన పర్యంకంపై మహారాణి పడుకొని ఉంది. ఆ మంచంచుట్టూ, విభూతిరేకల రక్షా వలయం ఉంది. పైన చుట్టూ, మూలికల రక్షలను కట్టారు. అక్కడక్కడ ఆవగింజలు, వేప ఆకులు రావి ఆకులూ పరిచి వున్నాయ్. కొందరు పరిచారికలు ఆమెకు దిష్టి తీస్తున్నారు. కొందరు హారతు లెత్తుతున్నారు. ఎత్తైన ప్రదేశంలో విలాస వతిఉంది. ఆమె కులశైలాన్ని కడుపున దాచుకున్న భూదేవిలా, ఐరావతం దాగిన గంగానదిలా, సింహం దాగిన గుహలా, వుదయాద్రి వెనుక దాగిన చంద్రమండలంలా, బ్రహ్మ ప్రభా వానికి మూలమైన కమలంగల విష్ణునాభిలా, అగస్త్యోదయం కానున్న దక్షిణదిశలా, అమృతకలశంలా కానవస్తున్నది.

మహారాజు లోని కడుగు పెట్టగానే ఆమె లేవబోయింది, పరిచారికలు, తటాలునవచ్చి ఆమెను లేవనీయలేదు. మహా రాజుకూడా తొందరగా ముందుకొచ్చి, ఆమెను లేవకుండా వారింప జేసాడు. ఆమె శిరోజాలను దువ్వి ఆ ప్రక్కనేఉన్న ఒక బంగారు పీఠంపై ఆశీనుడయ్యాడు. అతడితో వచ్చిన శుకనాసుడుకూడా ఆ ప్రక్క నే కూర్చున్నాడు.

మహారాజుకు నమ్మకం కలిగింది—

'దేవీ! కులవర్ధన చెప్పినది నిజమేనన్నమాట' ప్రశ్నించాడు

ఆ ప్రశ్నకు జవాబు సిగ్గు.

చెక్కిళ్ళూ, అధరమూ, కనుబొమలూ, కంపించగా, కనీ కనిపించని చిరునవ్వు మొలకలెత్తగా చెప్పలేక సిగ్గుతో ఆమె తలను వంచేసింది.

'దేవీ! నీవు చెప్పకపోయినా, నీ కుంకుమ రాగాన్ని కూడా ధవళం చేస్తున్న ఈ పాండురతే చెప్తోందిలే.' సన్నాన్ని వొదిలి వేస్తున్న నీ నడుమే చెబుతోందిలే.'

ఆమె మరీ సిగ్గుతో కుంచించుకు పోతోంది.

'మహారాజా! దేవిని ఇక సిగ్గుతో ఆయాస పెట్టకండి!' అని నవ్వు నాపుకుంటూ అన్నాడు-శుకనాసుడు.

మహారాజు ఆ రాత్రల్లా, దేవి చెంతనే ఉండిపోయారు. ఆమె కోర్కె ఈడేరే శుభ సమయం ఆసన్నమౌతోంది. అష్టమినాటి చంద్రునిలా ఆమె గర్భం తేజరిల్లోంది.

# 4

వచ్చింది – శుభ దినం!

తెచ్చింది మహారాణి ప్రసవాన్ని! విద్యుత్కాంతిని కన్న మేఘంవలె విలాసవతి ప్రసవించింది. బయట జ్యోతి

షుల్కలు, లగ్న నిర్ణయం కోసం ఆకాశంపై నక్షత్రాలను లెఖ్ఖిస్తున్నారు.

సుకుమారోదయమైంది.

వృద్ధ పరిచారకులు కూడా, లేళ్ళలా గెంతుతూ మహారాజు వద్దకు పరుగెత్తుకెళ్ళి ఈ శుభ వార్తను చెవిని వేసారు. ఆనందోత్సాహంతో కోట బురుజులపై భేరీ నాదాలు పిక్కటిల్లాయ్. పుత్రోత్సాహంతో ప్రభువు, ఖజానాలను తెరవించి సువర్ణదానం చేస్తున్నాడు. శంఖాలు, కాహళులూ దుందుభులూ. మంగళతూర్యనాదాలు దిగ్దిక్కులకూ ప్రసరింపజేస్తున్నాయ్.

రాజభవనమంతా, కోలాహలంచేసే జనసందోహంతో చంద్రోదయంతో పొంగిన పాల సముద్రంలా పోటెత్తుతోంది.

మహారాజు కుమార దర్శనం చేసుకోడానికి లగ్నాన్ని నిర్ణయించారు. ఆ సమయానికి లోనికి వెళ్ళాడు ప్రభువు. ద్వారం ముందు రెండు మణివిరాజితములైన మంగళ స్వర్ణ కలశాలను వ్రేలాడ దీశారు. మందిరంలో బహుపుత్రికలున్న స్త్రీల చిత్తరువులను గోడలనిండా అలంకరించారు. అగరు చందన ధూమం వెల్లెడలా ఆక్రమించిఉంది. ఓప్రక్క రోకలిని జేర వేశారు. తెల్లటి పూలను లేతగరిక పోచలతో గుచ్చి, తోరణ తోరణాలుగా వ్రేలాడదీశారు. శ్రోత్రియబ్రాహ్మణులు వేద మంత్రాలను వల్లిస్తూ గంగోదకాన్ని చలువ

రాళ్ళపై చల్లుతున్నారు. బిడ్డల తల్లులను వరుసగా నిలబెట్టి, వారి పాదాలను కడిగి కొందరు పారాణి పూస్తున్నారు. మహారాజు లోనికి ప్రవేసించగానే ఒక దూతిక వచ్చి, ఆయనచే అగ్నిని ముట్టించి, లోనికి రావించింది. ప్రసవంలో చిక్కి-ధవళ శరీరంతోనున్న విలాసవతి ఒడి లోని పసిగందును మహారాజు కనులార గాంచేడు. మణిదీప కాంతిలా ప్రకాశిస్తున్నాడు—తనయుడు. అపరసంధ్యలోనున్న చందమామలా వెలుగొందుతున్నాడు. వికసించిన ఎఱ్ఱ తామరలా, పగడపు వన్నె చిన్నెలతో దేవతా స్త్రీల ఒడినుండి జారిపోయిన ఇంద్రనందనుడు జయంతునికి మల్లె బంగారు కాంతులతో ఆ బిడ్డడు భవనాన్ని నింపివేస్తున్నాడు.

సహజాలంకారాలతో, సౌందర్యంతో, మహాపురుషుల లక్షణాలతో విలసిల్లుతున్న పుత్రుని, కనులారచూస్తూ తారాపీడుడు, బొటబొటా ఆనంద భాష్పాలను రాలుస్తున్నాడు. తన బ్రతుకే ధన్యమైనట్టు తన జీవితమే పునీతమైనట్టు పరవశం చెందుతున్నాడు—ప్రభువు.

ప్రక్క శుకనాసుడూ అదే అవస్థలో నున్నాడు.

'మహారాజా! బిడ్డనిలో చక్రవర్తి చిహ్నాలు కనబడుతున్నాయ్. సంధ్యకాల శశిరేఖల్లా మెరిసే ఆ కనుబొమల మధ్య సుడి కనబడుతున్నది - చూసారా? అవి ఆ చిహ్నాలు కాక ఏమిటి ప్రభూ!

'వీని చేతులు, విష్ణుహస్తద్వయంలా శంఖుచక్ర లిఖితమై ఉన్నాయి. రారాజులు సైతం చుంబించ నర్హములైన చేతు లవి. చూడండి! వీని ఏడుపు! అందులోంచొచ్చే ధ్వని దుందుభుల సముజ్వల శబ్దాన్ని మరపిస్తోంది ప్రభూ!' అన్నాడు మహామంత్రి.

ఇంతలో ద్వారంవద్ద 'జయము! జయము! మహారాజా!' అన్న జయధ్వానం. అంతా అటు చూసారు. మంగళకుడనే రాజపురుషుడు లోనికి ప్రవేశించాడు. ప్రవేశించగానే మహా రాజుపాదాలకు ప్రణమిల్లి మరోశుభవార్తను చెబుతున్నాడు-

'మహారాజా! శుకనాసుల వారికి కూడా సంతానం కలి గింది. వారి పెద్దభార్య మనోరమ, పరశురాముని లాంటి పుత్రుని కన్నది.'

నిజంగా అక్కడ అమృతవర్షం కురిసింది.

'ఆహా! శుభం, ఒకదాని వెంట ఒకటి దానికదే వస్తుం దంటారు ఇదే కాబోలు! జీవిత సుఖ దుఃఖాలలో సమాన భాగ స్వాములమైన మాకు పరమాత్ముడు ఆనందాన్నికూడా సమానంగానే పంచిపెట్టాడు. ఆహా! జగన్నాథుని లీల లతి విచిత్రములు గదా!' అంటూ మహామంత్రిని కౌగలించు కున్నాడు - మహారాజు.

ఆవార్త తెచ్చిన కంచుకికి, వజ్రాలహారం బహూకరించి నిలుచున్న పలంగానే శుకనాసునితో, ఆయన మందిరానికి బయలు దేరాడు.

ఆయన వెంట అందెల రవళ్ళతో పరిచారికలు, దాసదాసీ పరివారం ఇష్టమొచ్చినట్టు గానం చేస్తూ, నృత్యాం చేస్తూ, మృదంగ నాదాలు చేసుకుంటూ పరివ్రాజక జనమంతా కదలి పోయింది. వారి ముంజేతి గాజుల గలగలలు, కంఠా రావాలు, మధుర స్వనాలు, మంగళ వాయిద్యాలు అన్నీ విని, దేవతలూ, దిక్కులూ ఫక్కున తెల్లబోయి నటుగా కనబడ్డాయ్. వారి అడుగుల చప్పుడుకు నేల జలదరిస్తోంది.

అలా కోలాహలంగా వెళ్ళి మహారాజు మహామంత్రికి కన్నుల పండువను చేసాడు.

ఆరు రోజులు జాగరాలతో గడిచింది. ఈ ఆరురోజులూ సువర్ణ, రజిత దానాలతో మహారాజు, మహామంత్రి గడిపి వేసారు. ఏడవరోజు వచ్చింది. ఆనాడే మహారాజుకు రాణి నోట పూర్ణ చంద్రుడు ప్రవేశించినట్లు కలవచ్చింది. ఆ రోజునే, అందుకు చిహ్నంగా తన పుత్రునికి 'చంద్రా పీడుడు' అని నామకరణం చేయించాడు.

దినదిన ప్రవర్ధమానమౌతూ చంద్రాపీడుడు పెరుగు తున్నాడు. వెన్నెలలో అన్నం తినిపించే తల్లిని మింటనున్న చంద్రుణ్ణి తనకు తెచ్చి పెట్టమని పేచీలు పెటాడు. ఆతల్లి అద్దంలో చంద్రుణ్ణి చూపి లాలించేది. ఎన్నెన్నో ఆగడాలు చేసేవాడు.

ఈఆగడాలతో ఎలానో బాల్యం గడచిపోయింది వెంటనే బాలుని విద్యాభ్యాసానికి అప్పగించారు. నగరానికి బయట

సిప్రానదీతీరంలో ఒక బ్రహ్మాండమైన భవనాన్ని నిర్మించాడు. అది అర్ధక్రోసు విస్తీర్ణం గలది. అందులో గుర్రపు స్వారికి, వ్యాయామానికి, కత్తి సాముకు, సకలవిద్యాశిక్షణకు వేర్వేరు ప్రదేశాలూ, గదులూ చూడ ముచ్చటగా నిర్మించాడు. చంద్రాపీడునికి విద్యను గరపడానికి నేల నాలుగు చెరగుల నుండీ సిద్ధహస్తులైన పండితుల్ని రావించాడు. ఒక శుభ ముహూర్తాన, బోనులో సింహాన్ని పెట్టినట్టుగా, ఆ బాలుని విద్యామందిరంలో ప్రవేశపెట్టాడు. అతడు బయటకు రావడానికివీలు లేదు. అతడితో పాటు ఆచార్యులూ, కులపుత్రులూ కొందరు మాత్రమే ఉంటారు. మహామంత్రి కుమారుడు కూడా రాకుమారునితో సమానంగానే పెరుగుతున్నాడుగదా! మంత్రి తన కుమారునికి 'వైశంపాయనుడు' అని పేరుపెట్టాడు. రాకుమారునితో ఆ విద్యామందిరంలో ఉండదగు వారిలో వైశంపాయనుడుకూడా ఒకడు.

దినము కొకసారి మహారాజు, విలాసవతితో ఆవిద్యాభవనానికి వెళ్ళి, తనబిడ్డడ్నిచూచుకొని వస్తుంటాడు. చంద్రాపీడునికి మొదటనుండీ ఏకాగ్రత అలవడిది. ఏకాగ్రత సహాయంతో, చదువులో గురువుల్ని మించిపోతున్నాడు. సర్వ కళలూ, కరతలామలకంగా వెన్నతో పెట్టిన విద్యలా వచ్చేసాయ్. అనంతరం, ధర్మశాస్త్రాలూ, మీమాంసలు, షడ్దర్శనాలూ నేర్చుకున్నాడు. ఆ పైని కత్తిసాములోనికి దిగాడు. అప్పటికే

చంద్రాపీడునికి యౌవ్వనం పొటమరించింది. ఆ యౌవ్వనంలో క్షత్రిసామేకాదు. రథసారథ్యం, ఏనుగుల్ని నడపడం, గుర్రపుస్వారి సమస్తం యిట్టే వచ్చేసాయ్. మిగిలిన శాస్త్రాలు అనగా, గణితం, రత్నపరీక్ష, వాస్తు, ఆయుర్వేదం. విష వైద్యం, మంత్ర ప్రయోగం కూడా అనతి కాలంలోనే పట్టుబడిపోయాయ్.

ఇప్పుతడతడు-సర్వశాస్త్రశోభితుడు. సకలవిద్యాప్రవీణుడు. సాహసంలో భీముడు. ఆడుకుంటున్నప్పుడు ఏనుగుపిల్లల్ని చెవులుపట్టి లాగాడా? అవి గిజగిజ గింజుకు పోయే వంటే నమ్మండి! ఒక్క వ్రేటుతో తాటిచెట్లను నరకగలిగాడు. అతడు బాణం విసిరాడా, కొండలైనా చీల్చుకుపోవలసిందే.

ఈవిద్య లన్నింటా వైశంపాయనుడు కూడా ఉత్తీర్ణుడయ్యాడు. ఏక శయ్య, ఏక పంక్తి భోజనంవల్ల వైశంపాయనుడు, చంద్రాపీడునికి విశ్వాసపాత్రమైన స్నేహితునిగా కూడా తయారయ్యాడు. ఒకరిని వొదలి మరొకరు ఒక్క క్షణమైనా నిలువలేని స్థితిగా, వారి అన్యోన్యత వికసించింది.

చంద్రాపీడుడు-యౌవ్వన ప్రాంగణంలో అడుగుపెట్టాక దినమొక తీరుగా పెరుగజొచ్చాడు. ప్రదోషంలో కన్నుల పండువైన చంద్రోదయంలా, వర్షాకాలంలో విరిసిన ఇంద్ర ధనస్సులోని వన్నెచిన్నెల్లా, పూలవనానికి నవనవోజ్వల శక్తిని ప్రసాదించే సూర్యోదయంలా ప్రకాశిస్తున్నాడు.

ఇకాయన రూపమా ?

కాముడే బానిసై చేతులు మొగిడ్చి ఆయన ముందు నిలిచాడు. రూపంతో అతడి వక్షం విశాలమైంది. శోర్యంతో అతడి తొడలు బలిసాయ్. శత్రువులతో అతడి నడుం సన్నమైంది. వైరాంగనల అలకలతో ఆయన బాహువ్యాయం పొడగైనది. ప్రవర్తనతో కన్నులు తెల్లనయ్యాయ్. వాని హృదయం లోతైనసాగర గంభీరం! గుండె—కొండల విస్తారానికి దీటురాయి.

ఇలా పెరిగి సంపూర్ణుడైన తన కుమారుని, రాజభవనానికి రప్పించడానికి మహారాజు ఒక శుభముహూర్తాన్ని నిర్ణయించాడు. అతన్ని తీసుకురావడానికి, బలాహకుడనే ఒక సేనాని నాయకత్వాన, గజ, తురగ, పదాతి సేనలనిచ్చి విద్యాభవనానికి పంపించాడు.

బలాహకుడు భవనాన్ని జేరి, ద్వారపాలకుల చే, లోనికి పంపించ బడ్డాడు. రాకుమారుడు వానికి ఉచితాసన మిచ్చి గౌరవించాడు. బలాహకు డప్పుడు 'రాజాజ్ఞ'ను రాకుమారునికి విన్నవించాడు—

'రాకుమారా ! నీవిక సర్వ విద్యా విశారదుడ వయ్యావని, రాజభవనానికి తీసుకుని వెళ్ళవచ్చునని గురువులు ఆనతిచ్చారు. గంధగజంవలె పూర్ణ చంద్రునివలె ఇక నగరులో ప్రవేశించు. నీ రాకకోసం ఎదురుచూసే నీ తల్లులను ఆనం

దింపచెయ్. ఆరవ ఏట యీ విద్యాభవనంలో ప్రవేశించి, నీవు పదేండ్లు విద్య నభ్యసించావ్. పదహారేండ్ల యౌవనుడ వయ్యావ్. ఇక నీవు రాజ్యపాలనం చేసి, ప్రజలను కాపాడు. సర్వరాజ్య సుఖాల్నీ పొందు. అదిగో బయట 'ఇంద్రాయుధ' మనే అశ్వముంది. దాని నెక్కి నగరులో ప్రవేశించమని రాజాజ్ఞ! ఆ అశ్వం - 'అయోనిజ' అనీ, సముద్ర గర్భం నుండి ప్రభవించినదని ఒక పారసీకరాజు మన మహారాజుకు సమర్పించాడు. ఇది ముల్లోకాలకూ భూషణం వంటిది. ఇంద్రుని 'ఉచ్చైశ్రవం'తో సమానమైనది. వేగంలో, వాయు గరుడ తుల్యం. ఈ 'ఇంద్రాయుధం' పై నీవు ఎక్కి, మీ నాన్నగారు పంపిన, ఉత్తమ వంశంలో పుట్టిన, బయట వేచి వున్న ఆ వేయిమంది వీరులూ, విద్యావేత్తలూ అయిన రాకుమారులతో రావలెనని రాజాజ్ఞ !'

బలాహకుని విన్నపాన్ని వినగానే చంద్రాపీడుడు, ఆత్రుతతో 'ఇంద్రాయుధాన్ని' లోనికి రావించమన్నాడు. ఇద్దరు ప్రవీణులైన రౌతులు ఎంతో కష్టంపై దాని జీను పట్టుకొని లోనికి తెచ్చారు. ఆజానుబాహుడైన వ్యక్తి చేతులెత్తినప్పటికీ, అందనంత ఎత్తైనదా గుర్రం. గరుడుని గర్వాన్ని ధిక్కరిస్తున్నట్టుగా ఒక్కసారిగా అది సకిలించింది. తల పైకెత్తి, ముందు కాళ్ళు దువ్వి, ముల్లోకాలనూ ఒక్క అంగలో దూకివద్దామా అన్నట్లు చూస్తోంది.

ఇంద్రధనస్సులోని ఏడు రంగులూ, దాని ఒంటిపై వున్నాయ్. రత్నకంబళి పరచిన ఏనుగుపిల్లలా మెరుస్తోంది. అరుణారుణమైన కేసరాలతో, పార్వతి అధిష్ఠించే సింహ వాహనాన్ని పోలి ఉంది. సముద్రంలోని అమృతాన్ని తాగి పుక్కిలిస్తోందా అన్నట్టు, అది నురుగులు గక్కుతోంది. ఎర్రతామరల్లా మెరుస్తూ దాని నుదుటను కెంపులు దాపిన పావడా ఉంది. మిలమిలలాడుతున్న బంగారు జీను ఉంది, గలగల మనే రత్నహార మొకటి దాని మెడలో వేశారు. ఆ హారం, ఒక బంగారు రేకుపై వేయడంవల్ల ఆ శబ్దం వస్తోంది. సర్వాలంకారాలతో తానే ఒక నక్షత్రమాలను దాల్చినట్టు కనబడుతోంది. ఆ అలంకార కాంతులు పడి, దాని శరీరం మెరుస్తూ సూర్యుని, ఇంద్రుని, అశ్వాల్నికూడా మరపిస్తోంది.

ఒక మహోజ్జ్వల అశ్వ శిల్పం చెక్కినట్టున్న; ఆ 'ఇంద్రాయుధం' ఉచ్చైశ్రవానికీ, వరుణుని హంసకూ, జగల్లంఘనంలో హరిచరణంకూ, ప్రతిరూపంలా కనబడుతుంది.

దాన్ని చూడగానే చంద్రాపీడుని మనస్సు ఆశ్చర్యచకితమైపోయింది.

'ఆహా! దీన్ని అధిరోహించని, ఆ ఇంద్రుని త్రైలోక్యాధిపత్యం ఎంతటిది? శ్రీమన్నారాయణుని కంట ఇది పడివుంటే, ఆయన, గరుడుని కోరుకుంటాడా? ఆహా! దీన్ని పొందిన మా నాన్నగారు దేవరాజ్యాన్ని మించిన రాజ్యసంపన్నులే.'

'దీనిరూపం గాంచితే, దీన్నధిరోహించడానికి ఏదో జంకు మనస్సును లాగుతున్నదే! ఇది బలాహకు డన్నట్టు, మహిమాన్వితమైన మహాసత్వంగల అశ్వమనుటకు సందేహంలేదు. ఏ ముని శాపంవల్లనో, ఇదిలా అవతారం దాల్చివుండొచ్చు, పూర్వం స్థూలశిర మహాముని రంభను శపించాడని, ఆ రంభ గుర్రమై భూలోకంలో శతధ్వనుడనే రాజును సేవిస్తూ వుండి పోయిందని విన్నాను. అలాగే అనేకులు శాపగతులై పోయారు. దీని ఆకారం చూడగా, శాపగతులైన ఆ మహా పురుషుల వర్చస్సే పొడగడుతోంది.' అని లోలోన అనుకున్నాడు.

నెమ్మదిగా లేచి, ముందు అశ్వానికి నమస్కరించాడు.

'మహాత్మా! నీ వెవరవో దేవతాసంభూతుడవుగావొచ్చు.. క్షమించు, నిన్నధిరోహిస్తున్నందుకు!' అని విన్నవించుకున్నాగు.

అతడి విన్నపాన్ని ఆలించినట్టుగా గుర్రం ముంగాళ్ళతో మూడుమార్లు నేలను దువ్వి సకిలించింది.

తన్నధిరోహించడానికి, ఆ గుర్రం అనుమతించినట్టుగా భావించి. చెంగున చంద్రాపీడుడు దానిపైకి గెంతాడు. ముల్లోకాల్ని మూడుజానల నేలగా భావించి, దానిపై విద్యాభవనాన్ని దాటి బయటకొచ్చాడు.

దాన్ని చూచి అశ్వ సేనంతా సకిలించింది, రసాతలాన్ని తుత్తునియలు చేయబోతున్నట్టు, కాళ్లు సాచి గిట్టలు నేలకు

తాకించింది. చెవులు గళ్ళుపెట్టే శబ్దం అక్కడ జనించింది. అశ్వికులు ఖడ్గాలు దూసారు. రివ్వున ఎగిరిపోయారు. తళతళ లాడుతూ ఆకాశం మెరిసింది. వేయి 'ఇంద్రాయుధాలు' గగన మార్గాన లంఘించాయ్. ఆ అశ్వాల నధిరోహించిన కొందరు మయూరపింఛ వింజామరలు పట్టుకున్నారు. వాటి వల్ల పట్టపగలే చీకటిగా మారిపోయింది. ప్రళయకాల కల్లోల మహాసముద్రంలా, భీకర అగ్నిజ్వాలలకు, ఎగసే ధూమ రాశిలా ఆ సైన్యం పొడగట్టింది.

ఇంద్రాయుధాన్ని ఎక్కిన చంద్రాపీడుని చూడగానే చంద్రుని చూసిన సాగరంలా, ఆ అశ్విక సేనంతా పొంగి పరవళ్లు త్రొక్కింది. ఒకరికొకరు రాపాడుకుంటూ తప్పు కుంటూ, చంద్రాపీడుని పరివేష్టిస్తూ గుర్రాలను నడుపు తున్నారు. చంద్రాపీడునికి కుడిభుజంలా, మరో తేజస్వియైన గుర్రాన్ని వైశంపాయనుడు అధిరోహించాడు.

మొత్తం అధిరోహకులంతా, దిక్కులు పిక్కటిల్లే నాదా లతో నగరాభిముఖులై సాగిపోయారు. ఆయనపై ఎండ పడ కుండా కొందరు చామరములు పట్టారు. మరికొందరు వెనుక నుండి 'జయ చిరంజీవ!' అని జయధ్వానాలు సలుపుతున్నారు. ఆయన కర్ణపూరాలు ఊగులాడుతున్నాయ్, భువనమోహితు డైన ఆయన సౌందర్యానికి, దిక్కులు మూర్ఛపోతున్నాయ్. మిన్నుముట్టే మంగళ ఘోషల మధ్య చంద్రాపీడుడు ఎట్ట కేలకు నగరంలో ప్రవేశించాడు.

# 5

చంద్రాపీడుడు నగరంలో ప్రవేశించాడన్న వార్త విన గానే చంద్రోదయం కాగానే వొళ్ళు విరుచుకొంటూ లేచిన కలువల్లా జనం గుంపులు గుంపులుగా లేచారు. ఎందరో తరుణులు, రాకుమారుని రూపం చూడ్డానికి ఎగబడ్డారు. సిగలో తురుముకుంటున్న జాజులను వొదిలివచ్చే దొకతె, మొలనూలు జారిపోతుండగా అది కాళ్ళకు తగుల్కొని సంకెల బంధం వేసిన ఏనుగులా కుంటుకుంటూ వచ్చేదొకతె, పరుగులో రొమ్ముల కొనలకు చిక్కుకున్న ముత్యాలహారాలు చిక్కునైనా విప్పుకోకుండా వస్తున్న చిరుబోడి ఒకతె. వాళ్ళ కనురెప్పల కాంతితోనే నగరం అంధకారమైందా! వాళ్ళు ధరించిన భూషణ కాంతులే, సూర్యుడు విసురుతున్న కాంతి పుంజములా! అని చెప్పలేనంతటి సమూహం. మేడలపై మిద్దెలపై, ఎటుచూచినా కాంతలు! ఎగబడుతున్న వారిలో ఒకరి నొకరు రాసుకుంటూ పడిపోయినవారు కొందరు.

ఆ పడిపోయినప్పుడు కుంభి కుంభములవలెనున్న చనుగవ పైని పైట జారిపోగా విరగబడి నవ్వుతున్నవారు కొందరు, ముంగురులు సర్దుకోనివారు, చీర సరిచేసుకోనివారు, చూస్తూ చూస్తూ బొమ్మల్లా నిలచిపోయినవారు, నిలిచిపోయి మనస్సు లను పాడుచేసుకున్నవారు అనేకులున్నారు.

'అదుగో - వస్తున్నాడు రాకుమారుడు! రతీదేవి లేని సాక్షాత్తు మన్మథునిగా కనబడుతున్నాడు' అన్న దొకగొంతు.

ఇందొక యువతి_పతివ్రత అని వేనోళ్ళ పొగడబడ్డ వేరొక లతాంగితో అంటోంది—

'ఎందుకే అంతసేపు చూచి, పాతివ్రత్యాన్ని భంగపరచుకుంటావ్? చూచిన కళ్ళు ఊరకే వుంటాయటే! మదన స్వప్నాలు కనవూ! లే, తప్పుకో. నన్ను చూడనియ్!'

'ఆ! అదుగో! ఆయన హారంలోని కెంపులపతాకం అరుణ కాంతులను వెదజల్లుతూ, హృదయంలో ప్రవేశిస్తున్న యౌవన రాగంలా వుంది కదటే!'

నిజంగా ఆ దృశ్యం చూడ ముచ్చటైనది. చంద్రాపీడుడు తన నేత్ర కిరణకాంతులచే అందరినీ వశం చేసుకుంటున్నాడు. చూపుల మన్మథ తూపులతోనే అందరినీ సమ్మోహితం చేస్తున్నాడు.

అదుగో! వెనుక వస్తున్న వైశంపాయనునితో దంతకాంతి మిరుమిట్లు గొలుపగా, ఏదో అని నవ్వుతున్నాడు.

ఆయనను చూడ్డానికి ప్రతీ భవంతి, గవాక్షాలూ తెరచి వుండడంవల్ల నగరే కళ్ళు చేసుకొని చూస్తున్నట్టుగా తోస్తున్నది. అటువంటి కోలాహల హేలితో తులతూగుతున్న నగరులోంచి వస్తూ రాకుమారుడు రాజభవనం ముందు నిలిచాడు.

అక్కడ ఇరు కెలంకుల మద ధారలను కురిపిస్తూ కాటుక కొండల్లావున్న రెండు ఏనుగులు నిలచి వున్నాయ్. వేనకు

వేలు దాస దాసీ పరివారం ధవళ ఛత్రాలను పట్టుకొని సిద్ధంగా వున్నారు. ఇంద్రాయుధాన్ని దిగాడు రాకుమారుడు. వైశంపాయనుని చేయి పట్టుకొని, బలాహకుడు దారి చూపుతుండగా రాజభవనంలో ప్రవేశించాడు.

అది విశాలమైన భవనం. భవనంలో అనేక ప్రాకారాలున్నాయ్. ప్రాకారాల మధ్య ఉద్యానవనాలు, వాటి మధ్య అనేక స్ఫటిక భవనాలు రజితకాంతులను వెదజల్లుతూ మెరుస్తున్నాయ్. అందులో చతుశ్శాలలు, చంద్రశాలలు కూడా వున్నాయ్. వాటి నేల మాళిగలలో ఆయుధాగారాలున్నాయ్. కృత్రిమంగా నిర్మించిన క్రీడాశైలాలున్నాయ్. వాటిపై 'తదిగిణతోం' అంటూ నెమళ్లు నాట్యం చేస్తున్నాయ్.

అదిగో విశాల ప్రాకారంలో ఒక జలయంత్రంవద్ద పట్టపు ఏనుగు-'గంధమాదనం'. దాని మావటీడు చలువ రాతి ఆ జలయంత్రం అంచున కూర్చొని, వీణారావం వాలికిస్తుండగా చేటలంత చెవులను తాళాల్లా వేస్తూ, అర్ధ నిమీలిత నేత్రాలతో తొండాన్ని ఎడమదంతంపై వుంచుకొని వీనులవిందుగా రసాస్వాదన గావిస్తోంది. దానికో చెవి చెంత స్వర్ణాంకుశం వ్రేలబడి వుంది. మరో చెవి చెంత మదజల బిందువులే మరో కర్ణభూషణంగా మెరుస్తున్నాయ్.

ఇక అక్కడ పట్టు కంబళ్ళు కప్పిన గుర్రాలున్నాయ్. వాటి మెడల్లో యజ్ఞాశ్వాలను అలంకరించినట్టు సువర్ణ ఫల

కాలు కట్టివున్నాయ్. వాటిపై ముద్వాలు, అవి ఆ సంగీతా నికి సకిలిస్తున్నప్పుడు మధుర ధ్వనులు బయల్వెడలు తున్నాయ్.

లోనభవనాల్లో రాచకార్యాలను చూసే కొలువు కూటా లనేకమున్నాయ్. అ పా ర పా రా వా ర ప రీ త మైన, రాజ్యపాలనా యంత్రాన్ని చుక్కానిపట్టి త్రిప్పే నౌకలా, యిక్కడే వేలాది లేఖకులు కలాలుపట్టి నడిపిస్తూంటారు.

కొన్ని భవనాల్లో గోష్టులు జరుగుతున్నాయ్. అనేక మంది రాకుమారులు, వివిధ కవుల గుణగణాలను వితర్కి స్తున్నా రక్కడ, కొందరు పత్ర రచనలు, మరికొందరుకావ్య రచనలు సాగిస్తున్నారు. అద్దాల్లాంటి ముఖాలతో, స్ఫటిక నేలపై, కమలాల్లా ప్రతిబింబాలు పడుతుండగా, అందెల రవళులు, మొలనూళ్ళ గంటలు గళ్ళుగళ్ళున మ్రోగు తుండగా, బంగారుకాడల చామరాలను పట్టుకొని, అటూ యిటూహడావిడిగా తిరుగుతున్నారుపరిచారికలు. మరోభవన శాలలో అనేక వేట కుక్కలున్నాయ్. వాటి మెడలకు కట్టిన బంగారు గొలుసులను పట్టుకొని, శబరులు, వామనులూ, అడవి మనుష్యులూ ఉన్నారు.

ఇంకొక శాలలో, సహజ సౌందర్య నిర్మితములైన, ఎల మావి చిగుళ్ళపై కోయిలలు సొన్నాయిలు పాడుతున్నాయ్. చిలుకలు, రత్న పంజరాల్లో 'క్రిష్ణా క్రిష్ణా' అని పసిడి పలుకు లను చిలకరిస్తున్నాయ్. బంగారునీరు పోసిన భవనాల కాంతిని

చూచి, కారుచిచ్చేనని భయపడి, చంచల దృక్కులతో పారి పోతున్న జింక లక్కడ ఉన్నాయ్.

ఆ రాచనగరులోనే ఒక భాగంలో అంతఃపురమున్నది. అందులో భవనాలు, మహేంద్రుని వైజయంత మందిరాలను మరపిస్తాయ్. ముత్యాల హారాలు మెడలో బంతులాడగా, పూలచెండుల్లా, పసిబాలురు గంతుతూ ఆడుకుంటున్నారు. సౌధ శిఖరాలనుండి దిగివచ్చిన పావురాలు వారి శిరస్సుపై ఉల్లాసంగా ఎగురుతున్నాయ్.

పడకటిండ్లలో తమ సరసాలను ఛలోక్తులను విన్న గోరు వంకలూ, రామచిలుకలూ, గేలుచేస్తుంటే, అంతఃపుర భామి నులు కొందరు సిగ్గుపడుతూ అదే త్రోవను రాయంచల్లా వస్తున్నారు.

అంతఃపురం అగరు ధూపాలతో. కర్పూర దీపాలతో, మబ్బులు క్రమ్మి మెరుస్తున్నట్లు కనబడుతోంది. కావలి ఏనుగుల మదధారలతో, మంచు కురుస్తున్నట్లుంది. చీకటి చెట్ల గుంపులతో ఆ అంతఃపురం, రాత్రివలెనూ, ఎర్రని అశోకవృక్షాలతో నీరెండ సోకినట్లూ, ముత్యాల సరులతో చుక్కలు మొలిచినట్లూ, ధారాగృహాలలో వర్షాలు కురుస్తు న్నట్లూ ఉంది. అక్కడక్కడ బంగారు, స్ఫటిక విగ్రహాలు, అంతఃపుర దేవతల్లా, బంగారు బెత్తాలు పట్టుకుని నిలిచి నట్టున్నాయ్.

అటువంటి రత్న, మణి మయకాంతులతో, పచ్చల తోర ణంగా కళకళలాడుతూ వెలుగొందే అంతఃపురంలో చంద్రా

పీడుడు ప్రవేశించగానే, ప్రతీహారులు, కంచుకిలు, ఎదురువచ్చి నమస్కరించి, సుస్వాగత మిచ్చారు. దాసదాసీ పరిజనులు రెండు బారులై చీలిపోగా, ఆ మధ్యనుండి రా కుమారుడు వంధిమాగదుల స్తోత్రపాఠాల మధ్య, రత్నకిరీటం పెట్టుకుని అప్పుడప్పుడే తూరుపు కొండలపై ప్రత్యక్షమై పయనించే, భానుబింబంలా అగపడ్డాడు.

అడుగడుగునా అభినందనలందుకుంటూ అంతఃపురంలోని ఏడు లోకాలవలె కన్నుల పండువుగా ఉన్న ఏడు ప్రాకారాలను దాటి అభ్యంతర మందిరంలో ప్రవేశించి, తండ్రిని కలుసుకున్నాడు,

మహారాజు చుట్టూ అంగరక్షకులు దంతపు పిడులతో మెరిసే కత్తులతో నిలిచి వున్నారు. రెండు వైపులా వార కాంతలు, వింజామరలు వీస్తున్నారు. కుమారుని చూడగానే తండ్రికి వొడలల్లా పులకరింతలు పుట్టాయ్. ఆనందబాష్పాలు జలజలా ప్రవహించాయ్. తనే లేచి రెండు చేతులూ చాచి బిడ్డని, తన హృదయానికి గాఢ గా హత్తుకున్నాడు.

రాకుమారుడు, దిగ్గున తండ్రి పాదపద్మాల ప్రణమిల్లాడు. అతనితో పాటే, వైశంపాయనుడుకూడా మహారాజును తండ్రిగానేభావించి,శిరస్సుతో, ఆయనపాదాలపై పూవులావాలాడు. ఒక్క క్షణకాలం, భవనమంతా, వింజామరలు వీచే వార కాంతలతో సహా స్థంభించిపోయింది. కాస్త ద్రవించాక మహారాజు అన్నాడు—

'నాయనా! నీ తల్లులు పదేండ్లనుండి, కనులు కాయలు చేసుకొని నీ కోసం కలువరిస్తున్నారు. వారికి ముందు వెళ్ళి నేత్రానందం కలిగించు బాబూ!' అని నుదుటిని చుంబించి, పంపివేసాడు.

కొందరు ప్రతిహారులతో చంద్రాపీడుడు. రాణివాసానికి పయనమై వెళ్ళాడు. వెండికొండలా స్ఫురించే భవనంలో ప్రవేశించాడు. అదే విద్యుత్కాంతులు విలసిల్లు రాణి విలాసవతి భవనం. కాషాయంబరాలు ధరించిన వృద్ధదాసీలుఆమెను వినోదింప జేస్తున్నారు. పుణ్యకథలను మహారాణికి వినిపించి వీనులవిందు కూరుస్తున్నారు. వింజామరలు వీస్తున్నారు త్రిభువనైక మోహినుల్లావున్న కొందరు అందమైన చెలికత్తెలు వలయాకారంగా ఆమె చుట్టూ కూర్చుని సంగీతమాలపిస్తున్నారు. వారిమధ్య మహారాణీ చనుకట్టు మధ్య ముత్యాలహారం కొలువు తీర్చగా కొండలనడుమ ప్రవహించే గంగాదేవిలా ఉంది. దగ్గరేఉన్న అద్దంలో ఆమె ముఖబింబం పడి, సూర్యబింబంలోకి చంద్ర బింబం ప్రవేశించినట్లు కనబడుతోంది.

చంద్రాపీడుడు తల్లిని చూడగానే చేతులు చాపుకుంటూ 'అమ్మా!' అని కౌగలించుకొని కాళ్ళ పైకి జారాడు. తల్లి విలాసవతికూడా పుత్రునిచూడగానే విశృంఖలానంద పరవశురాలై ఎదురేగి, గాఢంగా ఆలింగనం చేసుకుంది. చేయడానికి అనేకమంది దాసీలువున్నా, తనే స్వయంగా బిడ్డనికి దిష్టి

తీసింది. వైశంపాయనుని శిరస్సునుకూడా మూర్కొంది. చంద్రాపీడుణ్ణి దగ్గరకు తీసుకొని, తనో ఆసనంపై కూర్చొని. తొడపై బిడ్డణ్ణి కూర్చొబెట్టుకుంది. ఆ ప్రక్కనే వైశంపాయనుడు కూర్చున్నాడు. బిడ్డనిరూపు రేఖా విలాసాన్ని, యౌవ్వన చిద్విలాసాన్ని గాంచి, ఆ తల్లి మురిసిపోయి అంది—

'నాయనా! ఇంతటి సౌకుమారుడవైన నిన్ను ఇన్ని సంవత్సరాలు కష్టపెట్టాం. అయినా చలించక, అసమాన పండితునివై తిరిగి వచ్చావ్. ఇక చక్కని కన్యలకు కూర్చి పెట్టడమే తరువాయి.'

ఆమాటకు సిగ్గుతో తలవంచిన బిడ్డను ముద్దు పెట్టుకొంది-మహారాణి.

మహారాణి ముద్దునందుకొని చంద్రాపీడుడు వరుసగా తల్లులందర్నీ చూచి ఆనందపరిచాడు.

ఇక మిగిలింది శుకనాసుని మందిరం. ఆ మందిరంలోనూ తమ కాంతుల్ని నింపాలి. బయల్దేరాడు—వైశంపాయనునితో.

శుకనాసు భవన ప్రాంగణంలో మదకరీంద్రాలు, పవన తురంగాలూ అనేకం నిల్చి వున్నాయ్. అనేక కార్యాలపై మహామంత్రి దర్శనానికి వచ్చిన పురప్రముఖులు పడిగాపులు పడి కూర్చున్నారు. ఆ లోపలే శాస్త్రమీమాంసలూ, ధర్మశాస్త్రాలూ తిరగవేసి, ఆ సారాన్ని పిండుతున్న వేద, శాస్త్ర పండితు లనేకమంది వున్నారు. బౌద్ధ ధర్మ నిష్ణాతులైన బ్రహ్మోవిదులు శిల్పులూ, కవులూ, వేదాంత కళాతర్కాలలో మునిగి తేలుతున్నారు.

రాకుమారుడు గుర్రం దిగాడు. గుమ్మంలో నిలిచాడు. రాచనగరులో జరిగినట్టుగానే యిక్కడా ప్రతీహారులు చంద్రాపీడునికి ప్రబహారథం పట్టారు. బారులు తీరివున్న కాంతల మధ్యగా రాకుమారుడు వైశంపాయనుని దక్షిణ హస్తం పట్టుకొని బయలు దేరాడు—లోనికి. అనేక మంది సామంతులు శిరస్సులు వొంచి నమస్కరిస్తున్నారు. వారకాంతలు పూలు కురిపిస్తున్నారు.

మంత్రాంగ మందిరంలో కూర్చున్న శుకనాస మహామంత్రివద్దకు వెళ్ళి చంద్రాపీడుడు సాష్టాంగపడ్డాడు. శుకనాసుడు ఆ ఇరువురినీ తన తనయులుగానే భావించి మూర్కొన్నాడు. లలాటాన్ని, చెక్కిళ్ళనూ ముద్దాడాడు. అతడి హృదయం పులకరించింది. సంతోషం తుషారాల్లా త్రుళ్ళింది.

చంద్రాపీడుని తల నిమురుతూ మహామంత్రి అన్నాడు—

'ఆహా, నాయనా! ఇప్పుడు కదా తారాపీడ మహారాజు ధన్యుడయ్యాడు! గురుదేవుల దీవనలు ఫలించాయ్. కులదేవతలు ప్రసన్నులయ్యారు. దిక్కులు తేజరిల్లాయ్. ఎన్ని పుణ్యాలు చేసుకోపోతే నీవంటి సౌందర్య, సాహసకుమారులు పుడతారు! నీలాంటి వాని జననంతో ప్రజలు ధన్యులయ్యారు. నీ వయస్సెక్కడ? ఈఅమానుష శక్తి ఎక్కడ! నిన్ను పతిగా పొందుటకు ఈ భూదేవి ఎంత అదృష్టం చేసుకుంది? లక్ష్మి అవివేకురాలు కాబట్టే ఇంకనూ ఆ హరి వక్షస్థలాన్ని పట్టు

కుని దీవెస్తున్నాడుతోంది. ఇక ఈ రాజ్య భారం నీవే వహించాలి నాయనా!' అంటూ పలికి రాజకుమారునికి నూతన వస్త్రాలూ, అధ్యయన శాస్త్రాలు, వెండి బంగారాలూ, పూలు, మీరగంధం కానుకలుగా యిచ్చి సాగనంపాడు. అక్కడనుండి శుకనాసుని భార్యాతిలకం మనోరమను కలుసుకొని ఆమె దీవనలు కూడా బడసి, రాజనగరులోని తన కుమార భవనానికి విచ్చేసాడు.

ఆ భవనానికి ముందు స్వర్ణ పూర్ణ కలశం ఒకటుంది. పచ్చని తోరణాలు, ముత్యాల ముగ్గుల రంగవల్లులు. తెల్లని పతాకాలు కట్టారు. మంగళ తూర్య నాదాలు మార్మోగుతున్నాయ్. గృహ ప్రవేశ ముహూర్తంలో, రాకుమారుడు ఆభవనంలో అడుగుపెట్టాడు. ఇంద్రాయుధాన్ని అశ్వశాలలో కట్టివేసినాడు. లోపల వసంత మండపంలో కాస్సేపు విశ్రమించాక, స్నాన భోజనాదులను ముగించుకుని. రాకుమాలతో ఇష్టా గోష్టి నెరపాడు.

ఇంతలో సాయం సమయమైంది. సూర్యుని రథంతో పాటు ఆ రథ చాలులో, వెంటాడి వస్తున్న దినకాంతి, పడమర సముద్రంలో తాపాన్ని చల్లార్చుకోడానికి వాలిపోయింది. సంజ కెంజాయలు అలుముకున్నాయ్. పూల వనాలన్నీ అరుణారుణమయ మయ్యాయ్. నెమ్మదిగా దిక్కులను చీకటి ఆవరించింది. రక్తపూల వనాలన్నీ తుమ్మెదలు వాలి నల్లబడ్డ కమల వనాలుగా మారిపోయాయ్. పగలు కాంతినంతా

కొగ త్రాగిన పూలలోని వెలుతురును పైకి లాగడానికి చీకటి చాపిన చేతుల్లా తుమ్మెదలు పూల గర్భాల్లో దూరి పోయాయ్. పావురాళ్ళు తమ గూళ్ళలోకి పోయాయ్. చిలుకల గొంతులు మూగవోయాయ్. కుమార భవనం ప్రశాంత సాగరంలా మౌనం వహించింది. అంతఃపురంలోని చిరుగంటల ఊయలలన్నీ నిశ్చలంగా ఉండిపోయాయ్. పురోహితులు స్వస్తి వాచకాలూ వంధిమాగధులు స్తోత్రపాఠాలు మానివేసి ఇళ్ళకు వెళ్ళిపోయారు. అందరూ అంతఃపురంలోంచి వెళ్ళిపోగా ఆ అంతఃపుర భవన ప్రాకారాలు నాగి వెడల్పైనట్టుగా కనబడ్డాయ్.

ఇకా చీకటిలో నక్షత్రాల్లా వేలకొద్దీ దీపాలు వెలిగించబడ్డాయ్. ఆ దీప కాంతులు స్ఫటిక నేలపై ప్రతిఫలించి విరిసిన సంపంగి కుసుమాలు చల్లినట్టుగా కనబడ్డాయ్. సూర్య విరహంతో తపిస్తున్న పద్మినీ లతల వినోదార్థంచల్లిన పూలలా ఉన్నవవి. ముక్తాంగనల హృదయాలు సెగ లెగసాయ్. చంద్రాపీడుడు రత్నప్రభలు చిందు హంసతూలికా తల్పంపై పవ్వళించాడు.

ఉదయం లేవగానే, తండ్రి యాజ్ఞను పొంది, ఇంద్రాయుధాన్ని అధిరోహించి వేటకు బయలుదేరాడు. ముందు వేట కుక్కలు నడుస్తున్నాయి, వాటి మెడల బంగారు గొలుసులను పట్టి పులి చర్మాలు ధరించిన బోయవాళ్లున్నారు. వారి

భుజాలకు ధనస్సులు వ్రేలాడి ఉన్నాయ్. విపరీతంగా కేకలు వేసుకుంటూ దిక్కులను అదరగొడుతూ, నేలంతా ధూళి దూసరం చేస్తూ అట్టహాసంతో రాకుమారునితో అడవిలో ప్రవేశించారు. చంద్రాపీడుడు, తనయావ్వన భుజశక్తినంతా ప్రదర్శించాడు. చంద్రహాసం ధరించి, అతడు తెగనరికిన ఏనుగు తొండాలు కుప్ప తిప్పలుగా పడ్డాయ్. విల్లమ్ములు పట్టి, చంగుచంగున పరుగులు పెట్టి పోతున్న జింకలనెన్నో అతడు నేల కూల్చాడు. అడవిపందులను వేటాడాడు. సింహాలను తరిమి వధించాడు. చమర మృగాలను సంహరించాడు. ప్రొద్దు నడినెత్తి కెక్కింది. ఒళ్ళంతా చెమట ముద్దయిపోయింది. ఇంద్రాయుధం, కళ్ళెన్ని కటకట కొరుకుతూ నురుగులు గ్రక్కుతోంది. ఆయన ధరించిన కంచుకం నెత్తుటి మరకలతో నిండిపోయింది. అతని శరీర కాంతి, రక్తత ప్తంతో మరంత ఎర్రబడింది. ఆ ఎర్రబడిన శరీరానికి, దూసరదళితమైన పూల రేఖలన్నీ అంటుకొని అతడు వసంతునిలా ప్రకాశిస్తూ ఊరి మొగమయ్యాడు. అతడి వేగాన్ని అతడి కాల్బలం అందుకో లేక వెనుకబడిపోయింది. కొందరు రాకుమారులు మాత్రం అతనిని వెంబడించగలుగుతున్నారు. వారితో, వేట ముచ్చ ట్లు మాట్లాడుకుంటూ, కుమార భవనంలో ప్రవేశించాడు.

అతడు భవనంలో అడుగు పెట్టగానే, ఇంద్రాయుధాన్ని రౌతులు పుచ్చుకుని, అశ్వశాలలో కట్టారు. రాకుమారుడు

తిన్నగా విశ్రాంతి మండపానికి వెళ్ళి, కాస్సేపు విశ్రమించాడు. దాసీలు, కొలనుకు దారి చూపించగా, అక్కడ స్నానమాచరించాడు. చందన పొడిని అలంది, పన్నీటితో తలను రుద్ది, బంగారు చెంబులతో నీళ్ళుపోసి, పరిచారికలు ఆయనకు సన్నని పట్టువస్త్రాలు కట్టబెట్టారు. మహారాజు పంపిన, అమూల్యములైన మణిభూషణాలను 'కులవర్ధన' రాకుమారునికి అలంకరింపజేసింది. అనంతరం రాకుమారుడు ఆ వస్త్రాలనూ, భూషణాలనూ స్వహస్తాలతో వైశంపాయనునికి అలంకరింపజేశాడు. తరువాత శరత్కాల గగనంవలె, తారావిరాజితమైన ఆహార మండలంలోకి ప్రవేశించి, భోజనాన్ని ముగించుకుని రాచనగరుకు వెళ్ళి, తల్లిదండ్రులను కలుసుకొని వారివద్ద సెలవు తీసుకొని, ఆ రాత్రిని హాయిగా, ఆనందంగా తన భవనంలో గడిపాడు.

మరునాటి సూర్యోదయమైంది.

మహారాజుకు అభిమానుడు, అంతఃపురానికి సర్వాధికారియైన ప్రధాన కంచుకి కైలాసుడు తలవని తలంపుగా వచ్చి రాకుమారుని ముందు ప్రత్యక్షమయ్యాడు.

అతని వెంట ఓ జవ్వని ఉంది.

ఆ జవ్వనికి బాల్యం యింకా దాటలేదు. అప్పుడప్పుడే యౌవ్వన మందాకురాలు పొటమరిస్తున్నాయ్. మేలి ముసుగుధరించి, ప్రకాశవంతమైన ఇంద్రనీలంలా మెరుస్తోంది.

రాహువు మ్రింగబోగా భయపడి భూదేవిపై పడ్డ చంద్రికలా కళకళ లాడుతోంది. ఆమె అక్కడ నిలిచినప్పుడు అందెలు గళ్ళుమన్నాయ్. ఆమె పాదాలు ఎందుచేతనో కంపిస్తున్నాయ్. హంసల కలకలారావంతో కదలాడే తామర పూవులుగల తీగెలా వొణికిపోతోంది.

నడుమునకు విలువైన వడ్డాణం వుంది. చనుద్వయంపై హారాలు వూగులాడుతుండగా, తన తామరతూండ్ల లాంటి హస్తాలతో వాటిని సరిచేసుకుంటూ, వొయ్యారం వొలకబోస్తూ వస్తోంటే సాక్షాత్తు పాలసముద్రం నుండి నెమ్మది నెమ్మదిగా ప్రభవిస్తున్న లక్ష్మీదేవిలా వుంది.

తాంబూలం వేసినందువల్ల ఆమె పెదవులు ఎర్రగా వున్నాయ్. విచ్చిన కలువపూవుల్లా కన్నులు దరహాసచంద్రికలను ప్రసరిస్తున్నాయ్. చెక్కిళ్ళపై మకరికా పత్రాలు దిద్దబడ్డాయ్. తీర్చిదిద్దిన అంగసౌష్టవం, లావణ్యం వెల్లుబుకుతోంది—కన్యలో.

ఆ కన్యను చూపించి కంచుకి అన్నాడు—

"రాకుమారా! ఈమె కులూతరాజు కూతురు. మీ నాన్నగారు ఆ దేశాన్ని జయించినపుడు యీ కన్యను తెచ్చి మన అంతఃపురంలో వొదిలారు. ఈ కన్య నీకు తగిన తాంబూల కరండవాహిని అని మీ అమ్మగారు పంపించారు. ఈ కన్యను దాసీగా చూడకూడదు. బాలికవలె, శిష్యురాలి

వలె చూచుకోవాలి గాని, యౌవ్వన చిత్తచాపల్యానికి చెదిరి పోనివ్వకూడదు. ఈమెకు అత్యంత రహస్యమైన దేదైనా చెప్పవచ్చు. అంతకాలంనుండీ మహారాణీవారు ఈ కన్యను తన కూతురుగా చూచుకున్నారు. ఈ కన్య మీకు చిరకాలం పరిచారికగా ఉండాలని మహారాణివారి ఉద్దేశం-స్వీకరించు!"

ఆ మాట లయ్యాక ఆ కన్య చంద్రాపీడునికి నమస్కరించింది. కైలాసుడ్ని చూచి రాకుమారుడు 'అలాగే!' అని తలూపాడు.

ఆ కన్య పేరు పత్రలేఖ.

అతి తక్కువ రోజుల్లోనే ఆమె చంద్రాపీడునికి అతి వినమ్రమైన పరిచారికగా తయారై పోయింది. అన్ని విషయాల్లోను చంద్రాపీడుని మనస్తత్వానికి పూసల్లో దారంలా అతికిపోయింది. అతడు కోరకుండానే ఆయనకు కావలసిన పదార్థాలను, పరికరాలను అందించుతోంది.

రోజులు దొర్లిపోతున్నాయ్.

ఎదుగుతున్న రాకుమారుని ఎంతకాలం అలా ఎదగనిస్తాడు-ఏ తండ్రైనా? ఎంతకాలం ఆ రాజ్యభారాన్ని వహించ గలడు? ఆ భారాన్ని రాకుమారునిపై పెట్టాలని నిశ్చయించుకున్నాడు.

# 6

మంత్రులతో, ఇతర రాకుమారులతో, సదస్యులతో సమాలోచించిన పిదప, మహారాజు రాకుమారునికి పట్టాభిషేక ముహూర్తం నిశ్చయించాడు.

పట్టాభిషేకం కానుండగా ముందు శుకనాసుని ఆశీర్వచనాలను పొందడానికి చంద్రాపీడుడు, మహామంత్రి భవనానికి వెళ్ళాడు. అక్కడ రాకుమారుని కూర్చోబెట్టి, శుకనాసుడు ఉపదేశించాడు—

"నాయనా! సర్వశాస్త్రాలనూ తెలుసుకున్నవాడివి. నీకు వేరే చెప్పవలసిన నీతులేవీ ఉండకపోవచ్చు. అయినా సదా గుర్తెరుగవలసిన విషయాలున్నాయ్. యౌవనమన్నది ఒక అంధకారం. సూర్యకిరణాలు కూడ చొరశక్యంకాని చిమ్మచీకటి. ధనమదం కూడా ఒక చీకటే. వేయిదీపాల కాంతైనా ఆ చీకటిని తొలగించలేదు. గర్వం— మరీను. ఈ తాపం పుట్టకనే పోవాలి. పుట్టిందా? ఎన్ని శీతలోపచారాలు చేసినా తగ్గదు. ఇక విషయసుఖాపేక్ష అంటావా! అది కాలకూట విషం. ఈ విష మెక్కినవాని కిక మంత్రాలు కూడా పని చెయ్యవ్. నాయనా! యౌవనం గాలిదుమారం లాంటిది. ఎంతటి శక్తివంతమైన మనిషినైనా అది పండుటాకులా విసరివేస్తుంది. స్వేచ్ఛానువర్తన ప్రకోపిస్తుంది. అది ప్రకోపించినప్పుడు దారి తప్పిన బాటసారిలా, చిక్కుల్లో పడిపోతాడు — మానవుడు.

"నీ బుద్ధి ఇప్పుడు వికసించి ఉంది. నిర్మలమైన స్ఫటిక ఫలకంపై చంద్రకిరణాలు ప్రతిఫలించినట్టు నీకేం చెప్పినా ఇప్పుడు బుర్రలోకి ఎక్కుతాయి. అందుకే చెపుతున్నా. నీ వింకా విషయలోలుడవు కాలేదు. విషయలోలుడైన

మనిషికి ఎన్ని చెప్పినా ఆ చిల్లులు పడిన హృదయంనుండి, ఉపదేశాలు, నీళ్ళలా కారిపోతాయ్.

"విను నాయనా! శుభం కోరేవా డెవడైనా ముందు కలిమికి బానిస కాకూడదు. కత్తుల కలువతోటలో తిరిగే తుమ్మెదలాంటిది కలిమి. పాలకడలి నుండి పుట్టేటప్పుడే, అందులోంచి పుట్టిన పారిజాతపు చిగుళ్ళలోని రాగాన్ని, నెలవంకలోని వక్రతనూ, ఉచ్చైశ్రవం నుండి చంచలతనూ, కాలకూటంలోంచి తెలివిని గోలచేసే శక్తినీ, మదిరలోని మదాన్ని, కౌస్తుభంలోని కాఠిన్యాన్ని తనలో మేళవింప జేసుకుంది — లక్ష్మి. అందుకే దీనంత చెడ్డదే లోకంలోనూ లేదన్నది — కళ్ళు మూసుకున్నా కనబడే సత్యం. ఇది దొరికినా కాపాడుకోడం కష్టమే. దొరక్కపోయినా దీని గురించి తపించిపోవడం సహజమే. ఇది దొరికాక పోగొట్టుకున్నవాడు పడే బాధ ఆ పరమాత్ముడైనా వివరించి చెప్పలేడు. ఇది కులాన్ని, వంశాన్నీ, మంచినీ, నీతినీ, శీలాన్నీ దేన్నీ లక్ష్యం చేయదు. కళ్లను కప్పివేస్తుంది. మనిషిని మూర్ఖునిగా మార్చివేస్తుంది.

"గంధర్వులు సృష్టించే నగరంలా ఈ క్షణంలో కనబడి మరు క్షణంలో మాయమైపోతుంది. మందరం చిలుకుతున్నప్పుడు ఆ సుడిలోపడి గిరగిర తిరిగిన అలవాటు, దాన్ని పట్టి విడిచిపెట్టలేదు. దాని కాలు ఒకచోట నిలువదు. ఎంత లోభినైనా అది శ్రీమంతుణ్ణే వలస్తుంది. వాణ్ణి పిశాచిగా మార్చి

వేస్తుంది. తమోగుణాన్ని వానిలో ప్రవేశపెట్టి, పశులచే అసహ్యించుకునే పాపిలా చేసేస్తుంది. ఇది పైకి మనిషిని ఉన్నతునిగా చూపుతుంది — నీచత్వాన్ని లోపల ప్రవేశపెడుతుంది, జలనిధిలో పుట్టినా, దాహాన్ని పెంచుతుంది. బలవంతుడైనా తేలికను చేస్తుంది. నిర్మలునిలా కనబడేలా చేసి, వాడి హృదయానికి మాలిన్యాన్ని పూస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, మానవపిశాచానికి పాడుకొంప! క్రోధమకరాలకు మడుగు. విమ్రకీయలకు యిది పానశాల! కోప సర్పాలకు ఇది పుట్ట! శాస్త్రజ్ఞానానికి ఒట్టి చీకటి కుఠారం! ఇది రాజుల్నే ఎక్కువగా వరిస్తుంది. ఆ రాజులకు పట్టాభిషేక కాలంలో విడిచే జలధారలో అది ప్రవేశించి, రాజుల దాక్షిణ్యాన్ని, కరుణను, కొట్టుకు తీసుకుపోతుంది. ఇక ఆ మహారాజుకు, ఉపదేశాలు గిట్టవ్. సన్మార్గులుకిట్టరు, ఎంత పతితులైపోతున్నా పునీతులౌతున్నట్టుగానే భావిస్తారు. వాళ్ళవద్ద కొలువుచేసే మహనీయులను బుద్ధిశాలురను వెడలగొడతారు. అబద్ధాలు! వంచన! ఆత్మస్తుతి, పరనింద, కుట్రలు, అన్నీ అధికమౌతాయ్. పతనానికి ఇక పునాదులు త్రవ్వుకుంటారు.

'దేవుళ్ళను పూజించరు. దేవతలకు నమస్కరించరు. ద్విజులను అసహ్యించుకుంటారు. వంధిమాగధుల కైవారాల్లో వుబ్బిపోతారు. వేశ్యాలోలత్వం, ఉత్తమ శృంగార మను

కుంటారు. త్రాగి మత్తెక్కి రాజ్యపాలనను ప్రక్కకు నెడతారు. నిజమాడితే వాడికి నిష్ఠూరం, కోపం! అబద్ధమాడి కీర్తిస్తే వాడు కులికిపోతాడు. ఇక వీనికి చేతబడులు చేసే మాంత్రికులు గురువులు. మోసాలను నేర్పే వంచకులే మంత్రులు వేలాది రాజులు అనుభవించి పారవేసిన యీ క్షుద్రమైన లక్ష్మికోసమే వాడి ఆరాటం! అన్న తమ్ముడూ, తల్లీ, తండ్రీ, బంధువులూ, స్నేహితులూ అనే చింతనే వాడు మరచిపోతాడు ....' అంటూ శుకనాసుడు వుద్రేకంతో మాట్లాడుకుపోతూ, కాస్త నిగ్రహం తెచ్చుకొని మరల అన్నాడు—

'నాయనా! నా స్వీయానుభవంతో, తెలుసుకున్న విషయాలు, నా కళ్ళతో చూసిన విషయాలు నీకు చెబుతున్నాను. నీవు మాత్రం యీ పాడు కలిమికి ఆశించకు! నలుగురు నవ్వకుండా, మంచివారు నిందించకుండా, పండితులు అసహ్యించుకోకుండా, గురువులు ఛీ అనకుండా, వేశ్యల పొత్తు కలవకుండా, వంచకులకు మోసపోకుండా, మదంతో మత్తెక్కకుండా, సుఖం మరగకుండా, బతికున్నంత కాలం నీకోసం గాక పరుల సుఖంకోసం నీ కాలాన్ని వెచ్చించి, ఆదర్శ ప్రభువుగా అతి మెలకువతో రాజ్యపాలనం చేయాలి నాయనా!

పట్టాభిషేకం నాడే నీ తలపై ఒక కొత్తభారం పడినట్టుగా భావించు! పట్టాభిషేకం కాగానే, మీ నాన్న జయించిన

ఋా సప్తద్వీపాలనూ మరొకసారి జయించి, విజయుడ వని పేర్గాంచు.'

అని శుకనాసుడు ప్రేమాదరాలతో చంద్రాపీడునికి ఉప దేశంచేసి సెలవిచ్చాడు. రాకుమారునిలో మాలిన్యం అంట కుండా హృదయాన్ని పరిశుభ్రంగా కడిగివేశాడు. కళ్ళు నిత్యం సత్యాన్ని చూడగల ప్రకాశాన్ని కోల్పోకుండా, తేజస్సుకు ఆయన ప్రసాదించాడు. రాకుమారునిలో యిప్పు డెంతో గంభీరత, ఉదాత్తత, పవిత్రత, తొలకరించింది. తొలకరుల ఆనందంతో, చంద్రాపీడుడు గృహోన్ముఖు డయ్యాడు.

పట్టాభిషేక మహోత్సవానికి మహారాజు సన్నాహం ప్రారంభించాడు. అన్ని సముద్రాలనుండి పవిత్రోదకాలను తెప్పించాడు. నానారకాల రత్నాలను, మణులను వాటిలో కలిపాడు. ఆసేతు హిమాచల పర్యంతం, భూనాథుల నందరికి ఆహ్వానాలు పంపాడు. ఆకాశమంత పందిరి. భూదేవంతటి పీనె వేశారు.

మరునాడే పట్టాభిషేకమనగా, నగరమంతా పచ్చని పంది ళ్ళతో నిండిపోయింది. ప్రజలంతా నూతన వస్త్రాలను ధరించి, సుగంధం పూసుకొని, నవ నవలాడుతూ తిరుగుతున్నారు. ఆ రేయల్లా రాకుమారునిచే జాగారం చేయించారు.

శుభోదయాన్నే మహారాణి విలాసవతి అంతఃపురంలో కుమారుని, ధవళ నూతన వస్త్రములతో అలంకరించింది.

మల్లెల మాలలను మెడలో వేసింది. ప్రేమార్ద్ర హృదయంతో కౌగలించుకొని దిక్కులు పిక్కటిల్లే జయనాదాల మధ్య సభాస్థానానికి సాగనంపింది.

చంద్రాపీడుడు సభలో ప్రవేశించగానే, ఆ సభా మండపంలో చంద్రోదయ మైనట్టయింది. మహారాజు తన గారాబు బిడ్డడ్ని చేయి పట్టుకొని సింహాసనం వద్దకు తీసుకు వచ్చాడు. మేరు శిఖరంపై ఎక్కిన చంద్రునివలె రాకుమారుడు, సింహాసనాన్ని అధిష్టించాడు.

ఓషధులూ, ఫలములూ, పుష్పాలూ, రత్నాలూ కలిపిన నానా సముద్ర జలాలలో తన ఆనంద భాష్పాలను కూడా కలిపి, పురోహితుల వేదమంత్ర పఠనంతో పట్టాభిషేక మహోత్సవం మహా కోలాహలంగా జరిపించాడు. మంగళ కలశాన్ని మహారాజు స్వయంగా ఎత్తి పట్టుకొని ధార విడుస్తుండగా, శుకనాసుడు ఆయనకు చేయి కలుపగా అభిషేకం పూర్తయింది.

ఆ కలువనుండి యీ కలువకు వెళ్ళేనాడిలా, రాజ్యాధికారం, మహారాజు చేతిపైనుండి, యువరాజుకు దఖలుపడింది.

దుంధుభులు మ్రోగాయి. కోట తూర్పు ద్వారం బురుజుపైనున్న కంచునగారా ఫెళ్ళున మ్రోగింది. యువరాజు దిగ్విజయ యాత్రకు సన్నాహపడుతున్న శుభ చిహ్నాలివి. ప్రళయకాల మేఘగర్జనలవలె, మందర పర్వత తాకిడికి చెలరేగిన సముద్రఘోషలా ఆ నగారాలు మ్రోగాయి.

ఆఘోషలతో లోకాలు భళ్ళున తెల్లవారినట్లు, దిక్కుల కీళ్ళు సడలిపోయినట్లు ముజ్జగమూ బొంగరంలా తిరిగిపోయినట్లు, ఆది శేషుడు కంపించిపోయి, భూతలాన్ని కౌగలించుకున్నట్లు, సూర్యుని రథచక్రాలు చాలుతప్పి భువిపైకి పడిపోయి దొర్లిపోయినట్లు, కైలాస శిఖరంపై నందికేశుడు రంకె వేసినట్లు, ఐరావతం ఘీంకరించినట్లు, ప్రళయఘోషలు బయల్దేరాయి. ఆ ఘోషల మధ్య చంద్రాపీడుడు సింహాసనం దిగి, జనం పాయలై జే నాదాలు చేస్తుండగా బయటికి వచ్చాడు.

బయట మత్తమద కరీంద్రం నిలచి వుంది. దానికి వెనుకవైపు రాకుమారునిఅంతరంగిక చెలికత్తె 'పత్రలేఖ' కూర్చొని వుంది. యాత్రోచితంగా ఆ ఏనుగును అలంకరించారు. అంబారీపై చంద్రాపీడుడు అధిరోహించాడు.

ఏనుగు మెల్లగా నడుస్తోంది. కోట ప్రాకారములపై ఎక్కి రాజులు రాకుమారుని వీక్షిస్తున్నారు. వారి కిరీటాల్లోనున్న మణులు అరుణ కిరణాల్లా మెరుస్తున్నాయ్. యువరాజు పట్టాభిషేకంతో రగిలిన ప్రతాపాగ్నితో దిక్కులన్ని అరుణారుణమై వెలుగొందుతున్నాయ్. ఆ ఏనుగు పక్కనే పట్టపుటేనుగు 'గంధమాదనం' నడుస్తోంది. రాజులు శిరస్సులువంచి యువరాజుకు నమస్కరిస్తున్నారు. ముందు ఇంద్రాయుధాన్ని కొందరు రౌతులు నడిపిస్తున్నారు. దాని అవయవాల కన్నిం

టికి బంగారు కవచాలు ధరింపజేసారు. సింధూరాన్ని దాని వెన్నుపై కొట్టారు.

తూర్పు దిక్కుగా మొదటి దిగ్విజయ యాత్ర బయలు దేరింది. మహీతలాన్ని కప్పివేస్తున్నట్టుగా ఆయన వెనుక చతురంగ బలాలు బయలుదేరాయ్. వైశంపాయనుడుకూడా పట్టుబట్టలు కట్టుకొని, ఖడ్గం ధరించి, తళతళ మెరుస్తున్న కుండలాల కాంతితో కొంత సైన్యాన్ని తీసుకొని బయలు దేరి రాకుమారుని సేనలో రెండవ చంద్రాపీడునిలా కలిశాడు.

యువరాజు దండయాత్రకు బయలుదేరాడన్న వార్త వినగానే అనేకమంది రాజులొచ్చి సాష్టాంగపడ్డారు. వారి కిరీటాల కాంతులు పికిలిపిట్టల వెంట్రుకలు వెదజల్లినట్టు, పైకెగసిన నెమిలిపురి కన్నులన్నట్టు, కల్పవృక్షం చిగిర్చినట్లు, ఇంద్ర ధనస్సులు పూచినట్టు, దిక్కులు మెరసినట్టు గోచరించాయ్.

ఒక క్షణంలో పుప్పొంగిన సాగర కెరటాలతో చొచ్చుకు పోతున్నట్టు నేలల్లా ఏనుగుల, గుర్రాల మయమై పోయింది. ఆ వెనుక కాల్బలాలు, ఆ వెనుక జనప్రవాహం. జయ శబ్దాలు నిజంగా భూనభోంతరాళాలు బద్దలై పోతున్నట్టుగా వుంది. ఎటు చూచినా కులశైలాల్లా ఏనుగులు, ప్రళయకాల మేఘ గర్జనలవలె దుందుభుల మ్రోతలు — చుక్కలను రాలుస్తున్నట్టు ఘోషించాయ్.

ఆ కోలాహలానికి భయపడిపోయి పది దిక్కులూ తెల్లని పతాకాల వెనుక దాగినట్టు సైనిక పంక్తుల పదఘట్టనలకు

రేగి, మింటికెగస్తున్న ధూళిపైన పడుతుందేమోనని ఆకాశమే మదగజ కర్ణ భూషణాల చాటున దాగినట్టు అగుపించింది. గుర్రాల నోటి నురుగులు, ఏనుగుల మదజల ధారలు క్రిందపడి కాల్వలై పారుతుండగా, వాటిలోనుండి నడుస్తున్న సైనికులు కాళ్ళు జారిపడుతున్నారు. కాహళుల మ్రోతలు, ఏనుగులఘీంకారాలు, గుర్రాల సకిలింపులు, శంఖారావాలు, రథచక్ర ఘోషలు - అన్నీ చెవులు దిబ్బడ పడేలా చేస్తున్నాయ్. క్రమంగా సైన్య పదధూళికి మేఘాలు కూడా కప్పడిపోయాయ్. దిక్కులు మూసుకు పోయాయ్. సైన్య భారంతో మూర్ఛిల్లిన భూదేవి కండ్లకు క్రమ్మిన చీకటిలా, ఆకసాన్నీ - భూమినీ ఎత్తుకుపోయే ప్రళయ జలధి ప్రవాహంలా, త్రిభువనలక్ష్మి మేలి ముసుగులా, వరాహ కేసరములా, ప్రళయాగ్ని ధూమరాసిలా, ఆధూళి ముల్లోకాలనూ ముంచివేసింది.

ఆ మహాసైన్యం ఒక దృష్టికి ప్రళయ సాగర జలంలా, మరో దృష్టికి బ్రహ్మాండ భాండంలా, ఇంకొక దృష్టికి కాల జఠరంలా కనబడి రజోగర్భానికి భూఖండాన్ని లాగివేసుకొంది. ఆకసం ధూళిమయం! భూమి చీకటిమయం! ఒక్క మాటలో చెప్పాలంటే, పంచభూతాలన్నీ ఏకమైపోయి, ఏకభూతంగా మారిపోయాయ్.

సముద్రంలోంచి ఉద్భవిస్తున్న, అక్షర లక్షలుగా సాగు తున్న అపార సైనిక బలాన్నంతనూ గాంచి వైశంపాయనుడు, చంద్రాపీడునితో అన్నాడు—

'యువరాజా! మహారాజు తారాపీడులవారు జయించని దేశాలేమున్నవని, నీవు జయించుటకు? నీవు వశం చేసుకో డానికి ఆయనకు వశంకాని దేశాలేమున్నాయి? ఆయనకు భుక్తంగాని, సంపాదించని దీవులుగాని, రత్నాలుగాని ఏము న్నాయ్ నీవు సంపాదించడానికి?

'ఆయనకు లొంగని రాజులు లేరే? చేతులు జోడించని, శిరస్సులు మొగిడ్చని వీరులే లేరే? ఇప్పుడు మన వెంట నడుస్తున్న ఈ సైన్యాలలో మనకు లొంగిపోయిన దశరథ, భాగీరథ, భారత, దిలీప, మాంధాతలకు సమానులైన రాజుల, మహారాజుల సైన్యాలన్నీ వున్నాయ్.

'ఇన్ని సేనలను వెనకేసుకొని బయలుదేరడం ఏమి సాధిం చడానికని? చూశావా, భూగర్భంపై పగుళ్ళు! నేల యీని నట్టుగా, దిక్కులు క్రక్కినట్టుగా ఈ సైన్యాలు! ఈ అశేష సేనావాహినిని గాంచి, భూదేవి మహాభారత యుద్ధాన్ని గుర్తుకు తెచ్చుకొని విలపిస్తున్నదా అనిపిస్తోంది. సూర్యుడు కూడా దారితప్పి మన ధ్వజాలను లెక్కపెట్టుకుంటూ తిరుగు తున్నాడు. ఈ సేనాభారంతో కలగిపోతా మేమోనని భయ పడి నదులు కూడా గగనానికి పారిపోయినట్టున్నాయే?

కులపర్వతాల నరాలు పట్లు తప్పిపోయాయే! ఇంకా నయం- సైన్యభారంతో భూమి ప్రక్కలు కాలేదు? భారంతో కృంగి పోతున్న ఆదిశేషుడు ఇక భారాన్ని భరించలేక భూగోళాన్ని క్రిందకు పడవేయలేదు!' అని వైశంపాయనుడంటూండగానే మొదటి మజిలీకి చేరుకున్నారు. చంద్రాపీడుడూ, సేనా, రాకుమారులూ అంతా అక్కడ విడిసారు.

చీకటి పడింది. తన తల్పం ప్రక్కనే వైశంపాయనుడూ తల్పం వేసుకున్నాడు. ప్రక్కనే కంబళిపై పత్రలేఖ పడుకుంది. చుట్టూ రాజులూ, మంత్రులూ పడుకున్నారు. వారితో ఆ కథా, ఈ కథా చెప్పుకుంటూ దిగ్విజయయాత్రా మనోభిలాషతో నిద్ర పట్టక ఎలాగో ఆ రాత్రి గడిపివేసారు.

ఉదయం లేచీ లేవగానే మరల దిగ్విజయ యాత్రను కొనసాగించాడు. కోటలను బాటలను దాటుతూ తలెత్తిన వానిని దించుతూ, దించిన వాని తలను ఎత్తుతూ భీతులకు ధైర్యాన్ని పోస్తూ శరణన్న వారిని కాపాడుతూ, అక్కడక్కడ రాకుమారులకు పట్టంకడుతూ, కప్పాలను, రత్నాలను పొందుతూ దేశ వ్యవస్థలను ఆజ్ఞాపిస్తూ, తన చిహ్నాలను పునః స్థాపితం చేస్తూ, జనానురాగాన్ని పొందుతూ, తన కీర్తిని వేనోళ్ళ చాటుతూ, సముద్రాలను ధూళిధూసరం చేస్తూ, తిరుగు లేని దిగ్విజయ యాత్రలతో మండలం అంతా చుట్టివేసాడు. మొదట తూర్పునూ, తర్వాత దక్షిణాన్ని, అటు పిమ్మట

పశ్చిమాన్ని తుదకు ఉత్తరాన్ని కైవసం చేసుకుంటూ, మూడవ ఏటికి కైలాసం చేరుకున్నాడు.

అక్కడ హేమకూట వాసులైన కిరాతులు నివసించేస్వర్ణ పురాన్ని పట్టుకున్నాడు. దేశదేశాలూ తిరిగి అలసిపోయిన రాకుమారుడు, ఈ శీతశైల ప్రాంతంలో కొన్ని రోజులుండి పోయాడు. ఇక్కడే ఒకనాడు ఇంద్రాయుధా న్నెక్కి వేటకు బయలుదేరాడు. ఒకచోట కొండ నెక్కుతుంటే ఆ కొండను దిగుతూ ఇరువురు కిన్నర దంపతులు కనబడ్డారు.

వారు రాకుమారుని చూడగానే పరుగు లంకించుకున్నారు. వారి పరుగు చంద్రాపీడునికి ఆశ్చర్యం కలిగించింది. ఏమైనా సరే వారిని తరిమి పట్టుకోవాలని ఇంద్రాయుధాన్ని అదిలించాడు. వారూ పరుగెడుతున్నారు. ఇంద్రాయుధమూ పరుగిడుతోంది. పరుగెత్తి పరుగెత్తి గుర్రం అలసిపోయింది. తనూ అలసిపోయాడు. ఆ కిన్నరజంట అందుబాటులోనే ఉంటూ ఉండి అదృశ్యమై పోతున్నారు. కడకు విసిగి వేసారి అనుకున్నాడు —

'ఏమిటీ కుర్రతనం! ఎందుకీ జంట కోసం ఇంత శ్రమ పడ్డాను. నా కోసం సర్వం ఫణమొడ్డి వచ్చిన సైన్యానికి ఇంత దూరంగా వచ్చివేశానే! ఈ పొదలూ, గుట్టలూ తీగల సందున పడి వచ్చిన త్రోవనే మరచిపోయానే! ఎవరినైనా అడుగుదామంటే, అసలు మనిషన్నవాడే కనబడ్డం లేదే!

సువర్ణపురానికి ఉత్తరాన జననివాసయోగ్యమైన నేలకలదనీ, ఆ తర్వాత కారడవున్నదనీ ఆటుపై కైలాస పర్వతమున్నదనీ విన్నాను. ఇదంతా చూస్తే వెనుదిరిగి ఏలాగో వెళ్ళిపోవడమే మంచిదేమో!' అని ఆలోచించి ఇంద్రాయుధాన్ని వెనుకకు మళ్ళించాడు.

ప్రొద్దు బాగా ఎక్కింది. దినలక్ష్మి మొలనూలులోని పతాకంలా, సూర్యుడు ఆకాశం మీదికి వచ్చాడు. గుర్రం బాగా అలసిపోయింది కాస్త పచ్చికా నీరూ దొరికితే బాగుండునని పించింది యువరాజుకు.

గుర్రాన్ని నిలిపి తనూ నిలిచి, అటు ఇటూ ఏదైనా జలాశయం కనబడుతుందేమోనని చూడసాగాడు.

ఆ! దొరికింది! ఏవో జలసిక్తమైన ఏనుగుల గుంపొకటి వెళ్ళినజాడ కనబడింది. తూళ్ళతో పాటు లాగిన తామరలు అక్కడక్కడ పడివున్నాయ్. ఆ ఏనుగులు దారిపొడుగునా త్రుంచివేసిన పూల మొక్కలు కూడా కనబడుతున్నాయ్. తెగిపడ్డ తలనుండి తుమ్మెదలు యెగురుతున్న కోలాహలం వినబడింది. ఆ జాడనుబట్టి పోతే, జలాశయం దొరకగలదని నమ్మకం కలిగింది. అటు వెళ్ళసాగాడు.

ఆ మార్గం పొడుగునా సాలవృక్షాలున్నాయ్. వాటికి పొడవాటి కొమ్మలు. ఆ కొమ్మలకు వెడల్పాటి పత్రాలు, నోడుగుల్లా ఎండ తగులనీయడంలేదు. వెళ్ళగా వెళ్ళగా

గుట్టలు కనబడ్డాయ్. అవి గుర్రాల గిట్టల ఘట్టనలకు అక్క డక్కడ పొడిపైన ఉన్నాయ్. అక్కడ యిసుకలో, చమర, కస్తూరి మృగాల కాలి గుర్తులున్నాయ్. ఎత్తు పల్లాలుగా ఉన్న గుట్టలపై చకోర జంటలు కూర్చుని ఊసులాడుకుంటు న్నాయి, కొండ చరియలున్నచోట, అడవి మనుష్యులు కూర్చున్నట్టు కూడా రాకుమారుడు గాంచాడు. అక్కడ గంధకం ఘాటు వాసన కొడుతున్నది. అలా కొంత దూరం వెళ్ళాడు. కైలాస శిఖరంయొక్క ఈశాన్యమూల అది. ఆ మూలలో నిండుగా ఉన్న చెట్టొకటి కనిపించింది. నిండుగా నీరు త్రాగిన మబ్బులు కూడి ఉన్నట్టు, ఆ చెట్టు క్రింద ప్రాంతమంతా చిమ్మచీకటిగా ఉంది. కాస్త ముందుకెళ్ళ గానే, చల్లని గాలి ఆయనను అలింగనం చేసుకుంది. తామర తేనెలను త్రాగి మత్తెక్కి అరుస్తున్న రాయంచల కోలా హలం తనను పిలుస్తుందనుకున్నాడు.

ఆ నడుమ కాస్త దూరంలో ఒక సరస్సు కనబడింది. లక్ష్మీదేవికి మణిముకురంవలె ఉందా సరస్సు!

ఆహా! ఎంత ప్రశాంతం! కైలాస పర్వతంగాని ఇక్కడ కరిగి పోలేదుగదా? హిమవంతంగాని నీరుగా మారిపోలేదు గదా? వెన్నెలగాని యిక్కడ రసరూపం దాల్చలేదుగదా? శరత్కాల మేఘాలుగాని గుమికూడి యిచ్చట చల్లగాలికి, నీరుగా మారిపోయాయేమో? లేకపోతే, అంత స్వచ్ఛత

నిర్మలత, ఆ సరస్సుకెలా వచ్చింది ? మధ్య మధ్య వీచే చల్లగాలులకు, అందులోని కెరటాలు చల్లగా గట్టు వరకూ ప్రాకి, మరల వెనుకకు వెడుతూ ఆ సరస్సును రక్షిస్తు న్నట్టుగా ఉన్నయి.

అక్కడే కైలాసముంది. అందులో శివు డున్నాడు. రోజూ వచ్చి ఆయన స్నానంచేసే సరస్సదే. ఆ మునగడంలో ఆయన చూడామణిలోంచి, అమృతరసం అందులో ఒలుకు తుంది. అతడి ముఖం అందులో మునగడంలో, పార్వతీదేవి లావణ్యంకూడా అందులో కలసి ఉంది - అందుకే ఆ సరస్సు లోని నీరు అమృత లావణ్యంతో మెరసిపోతోంది. ఆ సరో వరం చుట్టూవున్న నీలికలువల తోటల్లో, పగలే రాత్రి అను కొని, చక్రవాక మిథునాలు జంటలు విడిపోతున్నాయ్.

ఆహా! అక్కడ సప్తర్షులువచ్చి ఎన్నిసార్లు స్నాన మాచ రించారో? బ్రహ్మదేవు డెన్నిసార్లు తన కమండలంలో నీరు నింపుకున్నాడో? కిన్నెరలు, ఎన్నిసార్లు ఈ సరస్సులో తమ దుస్తులను శుభ్రపరచుకున్నారో? జలక్రీడలాడ్డంకోసం యక్ష కన్య లెందరో ఇందులో దిగి ఉంటారు. మన్మథ చాపచక్రం లాంటి సుడి తిరిగిన వారి నాభి మండలాలలో, ఈ సరోవర జలం ఎన్నిసార్లు తానూ తిరిగిందో !

మీన, మకర, కూర్మ, చక్రవాక, క్రౌంచ పక్షులూ అనేకం అక్కడ కానవస్తాయ్. నెమళ్ళు ఆ సరస్సులోనే

నీరు త్రాగుతుంటయ్. గట్లపైని కడిమిచెట్లపై కోతులు చెట్టు కొమ్మెచ్చి ఆడుకుంటాయ్. చాలా అందమైన, ప్రకృతి రామణీయకమైన సరస్సది. చందన శీతలమైనది. ఆ మనోహరమైన సరస్సును చంద్రాపీడుడు కనులారా చూసాడు.

కిన్నర జంటను తరిమి రాకపోతే, ఆ సరస్సును చూచే భాగ్యానికి అతడు నోచుకొని ఉండేవాడు కాదు. బ్రహ్మ ఆ సరోవర జలాన్ని సృష్టించి, మరల అమృతాన్ని సృష్టించడం వృథాయే. రాయంచల రవళితో, తామర పద్మాల సువాసనలతో, చల్లని గాలితో హాయి గొల్పుతోందా సరస్సు. దాన్ని చూచి రాకుమారుడనుకున్నాడు—

"ఇందుకే శివుడు కైలాసాన్ని వొదిలిపెట్టడు. ఇటువంటి సరస్సును విడిచి, మహావిష్ణువు ఉప్పుసముద్రంలో పడుకోడం అవివేకం కాక ఏముంది? ఈ సరస్సు పూర్వం లేదేమో! ఉంటే వరాహ దంష్ట్రాఘాతానికి భీతి చెందిన భూమి, అగస్త్యునికి ఆపోశనమైపోయిన సముద్రగర్భంలో ఎందుకు దాగుంటుంది? గంభీరమైన ఈ సరస్సులోనే దాగొన వచ్చుగా?" అని ఆశ్చర్యపడుతూ, ఆ సరోవర వింతలను కనులార గాంచుతూ, దాని దక్షిణ తీరాన్ని చేరుకున్నాడు. విద్యాధరుడు, అనేక ఇసుక లింగాలను చేసి, అక్కడ పూజలు చేశాడు. అరుంధతీదేవి అర్ఘ్యంతో విడిచిన ఎర్రతామర లున్నాయక్కడ. కైలాసం దగ్గరే గనుక

స్నానం కోసమని, అక్కడకు వచ్చిన సప్త మాతృకల పద ముద్ర లున్నాయక్కడ. నీటిలో స్నానం చేసి, ప్రమథ గణాలు భస్మం రాచుకున్నందుకు చిహ్నంగా అక్కడ భస్మం పొడి కనబడింది. పెద్దపెద్ద పాదాల గుర్తులవల్ల, నీళ్లు త్రాగ డానికి పార్వతీదేవి వాహనం సింహం ఇక్కడకే వచ్చి ఉంటుందని కూడా అనుకోవచ్చు.

అక్కడ గుర్రాన్నివిప్పాడు. అది నీటిలో దుమికి అమృత తుల్యమైన ఆనీటిని కడుపారతాగి గట్టుకువచ్చింది. చేతి చంద్ర హాసంతో చంద్రాపీడుడు పచ్చికచిగుళ్ళను కోసిదాని ముందు పడవేసి, దాని కాళ్ళకు బంగారు బందం తగిలించి, తానూ దాహం తీర్చుకోడానికి సరస్సులోకి దిగాడు. చాతక పక్షిలా, నీటినే ఆహారంగా సేవించాడు. చక్రవాకంలా తామర తూళ్ళనే విరుచుకొని భుజించాడు. చంద్రునిలా పూలను, చేతి వ్రేళ్ళచే స్పృశించాడు. పాములా అలలపైనుండి వచ్చిన గాలిని పీల్చాడు. విరహునివలె తామరాకులను పైన కప్పు కున్నాడు. అడవి ఏనుగులా, పూవులను కోసుకొని పైకి వచ్చాడు.

ఒక పొదరింటి నీడలో ఉత్తరీయాన్ని పరచుకొని శయ నించాడు. ఇంతలో ఉత్తర తీరం వైపుగా శ్రావ్యమైన వీణాగానం, దానితో మేళవించిన మధుర కంఠారావం విని పించింది. మనుష్య సంచారమే లేని ఆ ప్రాంతంలో తలవని

తలంపుగా వస్తున్న ఆ మధుర ధ్వనిని విని ఆశ్చర్యపోయి. అటు చూచాడు. ఏమీ కనబడ లేదు. ఇంద్రాయుధాన్నెక్కి అటువైపు సాగాడు. వకుళలతల కుసుమ సౌరభం, గుబురుగా పెండిన తమాల వృక్షాల దారి వెంట వెడుతున్నాడు. కైలాస గిరినుండి, కుమారస్వామి నెమలి-పింఛాన్ని ముద్దు పెట్టుకొని, పార్వతీదేవి స్వర్ణాభరణాలను కదిల్చి వస్తున్న పిల్లగాలులలో ఉత్తర కురుకామినుల కర్ణోత్పలాలను తాకి వచ్చే పిచిక లతో అతడు హాయి ననుభవిస్తూ, ఆ గీతాపన వస్తున్న దిక్కుకే బయలుదేరాడు,

అతడికో రమ్యమైన తోట తగిలింది. మామిడి చెట్లపై నుండి పండ్లను కొరుకుతూ, క్రిందకు పడవేస్తూ ఆ కొమ్మపై నుండి ఈ కొమ్మకు దుమికే కోతుల గుంపులు. పావురాళ్ళ రెక్కలు తాకి రాలుతున్న పూవులు. ఆచెట్లనుచూచి, ఆగుబుర్ల సందుచీకట్లని మబ్బులని భ్రమించి,కోలాహలం చేస్తున్న చాతక పక్షులు, అక్కడక్కడ దానిమ్మ చెట్లు, మధ్యమధ్య సంపంగి కుసుమ వృక్షాలు. వాటిపై నెమళ్ళ నృత్యం, అక్కడక్కడ కైలాసం నుండి పారే సెలయేళ్ళ చాలుల్లా ఇసుక పొరలు ఆహా ! ఎంత రమ్యమైన సీమ.

ఆ సీమకు పడమట తట్టున 'చంద్రప్రభ' అనే గుట్టఉంది. ఆ గుట్టపై ఒక నిర్జనమైన శివాలయం.

దానిని దర్శించాలని చంద్రాపీడుడు లోనికి వెళ్ళాడు. అందులో ఒక శివలింగముంది. అప్పుడే కోసి తెచ్చిన

పుండరీకములతో అంతకు ముందే ఎవరో పూజించి వెళ్ళి నట్టు కనబడింది. ముజ్జగాలకూ మూల విరాట్టయిన పరమ శివుని దర్శించుకున్నాడు-చంద్రాపీడుడు.

ఆ శివమూర్తికి దక్షిణంగా !

ఎవరది ?

ఆశ్చర్యపోయాడు.

నిష్ఠలో – కూర్చుని ఉంది ఒక కన్య.

ఆ కన్య పేరు మహాశ్వేత. ఆమె వయస్సును మనం లెఖ్ఖించలేం గాని, ప్రాయాన్ని బట్టి నవహాయనిగా పోల్చుకోవచ్చు. పాశుపత వ్రతాన్ని చేబట్టి బ్రహ్మాసనాన్ని వేసుకునికూర్చుంది. ఆమె తపః ప్రభావమూ అన్నట్టు, ఆమె దేహకాంతిచే సర్వ దిశలూ కాంతి వంతంగా మెరుస్తున్నాయ్. ఆ కాంతి పడి కైలాసమూ, ఆ కాంతారమూ కూడా ధవళ దంతంతో చెక్కిన ప్రకృతి శిల్పంగా కనబడుతోంది. ఆకాంతిని చూచిన వారి మనస్సు కూడా నిర్మలమైపోతుంది. ఆ కాంతి రేఖల్లో ఆమె అవయవాలే కనబడ్డంలేదు. ఆ అవయవాలను కాంతి కప్పేసింది.

ఎవరీమె ?

శివుని శిగపూవైన చందమామపై మమకారంతో వచ్చిన క్షీరసముద్ర దేవతా! రాహుభయంతో శివుని శరణు జొచ్చిన చంద్రరేఖా ! లేక దక్షిణ దిక్కుగా కూర్చుని నవ్విన శివుని మందహాసపు మెరుపా !

ఆహా! ఏమి కాంతి!

రుద్రునికోసం రాశియైన విభూతిపొడిలా, శివుని కంఠ నీలి మను తుడిచివేయవచ్చిన వెన్నెలలా, గౌరి నిర్మల మనస్సు శరీరం దాల్చినట్టుగా ఉందామె.

ఆమె రావణుడు కదిలించగా జారిపడ్డ కైలాస శ్రీ అయి వుండొచ్చు. శరత్కాలాగమనం కోసం వేచి ఉన్న గడ్డిపూల కాంతి కావచ్చు. ఒకవేళ రసాతలంనుండి పైకి వచ్చిన ఆది శేషుని మేనుకాంతి యేమో!

ఆమె ముత్యాలనుండి నిండినట్లు దంతపు చెక్కడంలో మలిచిన ప్రతిమైనట్లు జాజి, విరజాజి, మల్లెల కాంతిలో మెరుగుపెట్టిన సౌందర్య ఖనైనట్టు స్నిగ్ధ ధవళిమకు మణి మకుటంలా వెలుగొందుతోంది.

లలాటఫలకంపై నక్షత్రాల పొడిలా మెరుస్తున్న విభూతి రేఖలు ధరించింది. ఆమె చూపులే ఆ శివలంగార్చనకు మరో పూలమాలలా కనబడుతోంది. మెడలో జిలుగు వెలుగులు చిందే వుసిరిక కాయలంత ముత్యాలుగల సరులు వ్రేలాడు తున్నాయ్. ఆ సరుల కాంతిలో ఆమె చంద్రునితో ఉన్న పున్నమి రేయిలా కనబడుతోంది. ఆమె వురోజాలు, మోక్ష ద్వారం ముందుంచే కలశాలలా ఉన్నాయ్. ఆమె శిరోజాలు సింహపు కేసరాల్లా మెరుస్తున్నాయ్. వింజామర కుచ్చువలె ఉన్న కల్పవృక్షవల్కలాన్ని స్తన మధ్యంలో ముడివేసుకుంది. మోకాళ్ళవరకూ వ్రేలాడుతున్న మరో పట్టువలువను నడు

ముకు బిగించుకుంది. అది తెల్లనిదే అయినా బ్రహ్మాసనంలో ఆమె కూర్చొనగా అది అరికాళ్ళపై బడి, అరుణారుణంగా కనబడుతోంది.

యౌవ్వనమే ఆమెకు దాసిపైపోయింది, లావణ్యం ఆమెను సేవిస్తున్నది. రూప సౌందర్యాలు ఆమెకు శిష్యరికం చేస్తున్నాయ్. తొడలపై దంతపువీణను పెట్టుకుని, చిగుళ్ళలా ఉన్న వ్రేళ్ళతో మ్రోయిస్తోంది.

ఆహా! ఆ మ్రోతకు భువనాలే పలుకుతున్నట్టుంది. ఆమె వీణారవమే. ఆమె గాత్రమధురిమే, చంద్రాపీడునికి విని పించింది. ఆమె అలా వీణ వాయిస్తుంటే ఆమె ప్రతిబింబం ఆ వీణధ్వని ప్రతిధ్వనులూ చుట్టూవున్న స్పటిక స్తంభాలలో ప్రతిఫలించి అనేకమంది గంధర్వ భామినులు అక్కడ కూర్చొని గానం చేస్తున్నట్టున్నది.

ఎదురుగున్న శివలింగంపై ఆమె రూపం ప్రతిఫలించి శివు నిలో తదాత్మ్యం చెందుతున్నట్టుగా ఉందామె. ఆ తదా త్మ్యంలో ఆ వీణ మ్రోగుతుంది. ఆరోహణావరోహణలతో గమకముల తో యమకములతో మధ్య మధ్య చక్కిలిగింతలు పెట్టు జిలుగులతో విరూపాక్షుని సంకీర్తనం చేస్తి తనలో కలుపు కుంటోంది. కాకపోతే, ఆమె శరీర కాంతిలో ఎదుట నున్న శివలింగం ప్రతిఫలించిం దెందుకు?

ఆ ఆలయం చుట్టూ వన్యమృగాలు చేరి, ఆమె సంగీతానికి తరించిపోతున్నాయ్. ఆకశంనుండి దిగివస్తున్న మందాకినిలా

ప్రకాశిస్తూ ఆమె ధ్వనిస్తోంది. సౌందర్యం రాగమయమైన చందమామవలె రాగస్పర్శలేనిదామె.

ఆమె మనస్సు విషయాసక్తంగానిది. నిర్మలమైనది. నిరహంకారాలు. పంచేంద్రియాలను ఆమె ఏనాడో జయంచింది. పంచభూతాలను కైవశం చేసుకున్నది.

పూర్ణకళా వికసితమైన ఆమె మనోహరాకారాన్ని గాంచి, చంద్రాపీడుడు, గుర్రాన్ని దిగి, దాన్ని ఓ చెట్టుకు కట్టివేసి, లోనికి వెళ్ళి త్రినేత్రునికి నమస్కరించాడు. ఆమెను చూడ్డానికి అతడి కళ్ళు ఎన్నివేల జన్మల పుణ్యం చేసుకున్నాయో! దగ్గరగా ఆ కన్యను గాంచి మిరుమిట్లు గొలిపి, ఆశ్చర్యాన్ని పట్టలేక అనుకున్నాడు—

'ఈ లోకంలో అనుకోకుండా ఎన్ని సంఘటనలు జరుగుతుంటై. వేటకు బయలుదేరిన నాకు, తద్విరుద్ధమైన సాత్విక స్వరూపం యిచ్చట సాక్షాత్కరించడం యాదృశ్చికంగదా! కిన్నరులు తిరిగే ప్రదేశాలను, మహర్షులు జలకమాడే సరస్సులను, దేవతలువిహరించే నేత్రానందమైన తోటలను, చతుర్లోకాల్లోనూ, గాంచలేని సుందర స్త్రీ స్వరూపాన్ని చూచాను. మనిషి చచ్చిపోయి, ఇంద్రలోకానికి వెళ్ళినా విన శక్యంగాని మధుర సంగీతాన్ని వినగలిగాను. ఎంత అద్భుత సంఘటనను గాంచాను. నే నెంత అదృష్టవంతుడిన్ని!'

అంటూ, అలా ఒక స్పటిక శిలా స్తంభానికి జేరబడ్డాడు. ఆపాట యెప్పుడు పూర్తవుతుందోనని ఎదురుచూస్తున్నాడు.

పాట ముగిసింది. వీణ మూగవోయింది. తుమ్మెదగల ఝూంకారం ఆగిపోయిన కలువ పూవులా ఆమె లేచి, శివ లింగానికి ప్రదక్షిణం చేసి, నమస్కరించింది.

వెనుదిరిగేసరికి ఎదుట చంద్రాపీడుడు.

అతడు ధన్యత చెందాడు. తన తపస్సంతా చూపుల లోనే రంగరించి, అతడికి దత్తం చేస్తున్నట్టుగా ఆమె అతడ్ని చూచింది. ఏదో వరాలొసగుతున్నట్టుగా అతడిని పలుకరించింది—

'మహానుభావా! నమస్కారం! యీ ప్రదేశానికి మీరెలా వచ్చారు? నాతో వచ్చి, నా ఆతిధ్యాన్ని స్వీకరించడానికి ఏమైనా అభ్యంతరమా?

అతడి కభ్యంతర మేముంటుంది? ఆమె దర్శన భాగ్యమే, ఆతడ్ని జన్మ తరించడానికి ఒక గంగానది అయితే?

'ఆ!' అంటూ ఆమె వెంట నడిచాడు.

అంతవరకూ ఆతడు గంధర్వులు, మనుష్యుల్ని చూస్తే మాయమైపోతారని విన్నాడు. కాని ఈమె మాయమై పోలేదు. దుర్లభమైన దివ్య రూపం కలదైనా, ఈమెలో ఎంత దాక్షిణ్యం! విచిత్రమైన ఈమె గాథ ఏమిటో?

ఆ గాథను తెలుసుకోవాలని అతడు ఆతృత చెందాడు. ఆమెను ఎలా అయినాసరే అడిగి తెలుసుకోవాలనే నిర్ణయా నికి వచ్చి ఆమెతో వెడుతున్నాడు.

అలా కొంతదూరం వెళ్ళగా, ఒక గుహ కనబడింది, ఆ గుహ పట్టపగలే చీకటిగా ఉంది. దాని చుట్టూ పూల పొదరిళ్ళు వున్నాయ్. వాటిపై వాలి తేనెలను గ్రోలుతున్న తుమ్మెదలు ఝుమ్మని పైకెగసి, వారికి దారి నిచ్చాయి. ఆ ప్రక్కనే తెల్లని రాళ్ళపైనుండి ఓ సెలయేరు ప్రవహిస్తోంది. దాని అలల తుంపరలు తుళ్ళి గుహ ముఖద్వారంపై పడుతున్నాయ్. అచ్చటే చల్లని సెలయేటి పిల్లగాలులలో, ఎదుటనున్న ఒక శిలావేదికపై చంద్రాపీడుడు కూర్చున్నాడు. ఆ ఎదుట మరో వేదికపై వీణ చేతబట్టి ఆ తాపసకన్య మహాశ్వేత కూర్చున్నది. ముందుగా అతిథిని వీణారావంతో ఉల్లాసపరచింది. ఆ తర్వాత తామరాకు దొప్పతో నీళ్ళు తెచ్చి అతడి పాదపద్మాలను కడుగుతోంది.

ఏలనో రాకుమారునికి సిగ్గనిపించింది.

'భగవతీ! నాకై ఇంత శ్రమ ఎందుకు! నీ దర్శనభాగ్యం చేతనే నేను పాపవిముక్తుడ నయ్యానే!'

'కాదు. ఇది అతిథి మర్యాద!' అంటూ తన సత్కృతులను ఆమె ఆపలేదు.

ఇతడు కాదనలేదు.

మర్యాదలయ్యాక, అతడిని కుశల ప్రశ్నలు వేసింది. వాటన్నిటికీ అతడు జవాబులు చెప్పాడు. ఆ జవాబులతో ఆమెకు అతడి చరిత్ర అర్థమైంది.

అతడు ఒక సామాన్య రాజకుమారుడని వినగానే, ఆ తాపస కన్య అతడి ఆకలిని తీర్చడానికి ఆ గృహ ప్రాంగణంలోకి భిక్షా పాత్ర పట్టుకుని వచ్చింది.

ఏమి ఆశ్చర్యం? ఆమె పాత్ర పట్టినంత మాత్రాన చెట్లు గిరు గిరున తిరిగి ఫలాలను రాల్చాయి — ఆ పాత్రలోకి. అదంతా గాంచి రాజకుమారుడు ఆశ్చర్యపోయాడు. అవును. తాపసులకు శక్యంగాని దేముంది?

ఆ ఫలాలన్నీ స్వీకరించాడు. తృప్తిగా ఆరగించి, స్వేచ్ఛా సెలయేటి జలాలను తాగాడు. మనస్సు హృదయం అన్నీ కుదుట పడ్డాయ్. అప్పుడా కన్యను అడిగాడు—

'అమ్మా! భగవతీ! మానవ సహజమైన దౌర్బల్యం, వొద్దన్నా నీ చరిత్ర తెలుసుకొమ్మని నన్ను తొందర పెడుతోంది. అభ్యంతరం లేకపోతే, నీ గాథ చెప్పి నన్ను అనుగ్రహించమని కోరుకుంటున్నాను.

'మీరు యక్షులా? సిద్ధులా? అప్సరసలా? ఏ వంశంలో మీరు జన్మించారు? ఏ వంశంలో జన్మించితే మీకీ లావణ్య కాంతులు సంక్రమించాయ్? కన్యవై వుండి, ఈ గాఢతపో నిష్ఠకు ఎందుకు ఉపక్రమించావ్? నిర్మానుష్యమైన, ఈ వనంలో మీ కెందుకుండవలసి వచ్చింది? పంచభూతాత్మకమయిన మీ దేహానికి ఇంత ధవళిమ ఎలా వచ్చింది. నా సందేహాలు తీర్చి నన్ననుగ్రహించండి!'

అతడి ఆశ్చర్యచకితమైన ప్రశ్నలు విని ఆమె గాఢంగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పులో ఆమె తపోతీవ్రత బయటికి

వెడలి వచ్చింది. ఆమె కలువ రేకులవంటి కనుకొలకులనుండి ఆమె మాలిన్యాన్ని కడిగి వేస్తున్నట్లుగా, కన్నీటి బిందువులు దొర్లాయ్. అవి ఆమె కుచపాళిపై బడి, చిట్టి తుంపరలై చెదరి పోతున్నాయ్. మౌనం వహించిన ముఖారవిందంతో కనులు మూసుకొని ఆ కన్నీటినీ, నిట్టూర్పునూ దిగమ్రింగి, విలపించసాగింది.

అంతవరకూ ఆమె మధుర కంఠమే విన్న చంద్రాపీడుడు ఆమె దుఃఖమయమైన కంఠం విని కరగి పోయాడు.

'ఆహా! మహా తపస్వులకు సైతం బ్రతుకుల వెనుక కన్నీటి గాధలు సుళ్లు తిరుగుతుంటాయన్న మాట! వసుంధరే కుమిలిపోయి రోదించగలిగిన ఈమె కన్నీటి గాధ ఎంత కరుణాపూరితమైనదో!' అనుకుంటూ, దోసిలితో సెలయేటి లోని జలాన్ని తెచ్చి ఆమె దోసిలిలో పోసి, కనులను కడుక్కోమన్నాడు.

ఆమె కాదనకుండా కన్నీరు కారగా ఎర్రబడిన కనులను కడుక్కొంది. నారచీర చెరగుతో ముఖాన్ని తుడుచుకొని—

'రాకుమారా! కఠినాత్మురాలనైన నా గాథే దొరికిందా, నీకువినడానికి? కుతూహల పడుతున్నావు కాబట్టి చెబుతున్నా విను నాయనా!' అంటూ మహాశ్వేత చెప్పసాగింది అతడు ఆశ్చర్యంతో వింటున్నాడా గాథను.

# 7

స్వర్గంలో అప్సరసలనే కన్యలున్నారు. వీరిలో పదునాలుగు తెగలున్నాయ్. ఈ పదునాలుగులో పది చంద్రకాంతిలో, అమృతంలో, నీటిలో, సూర్యకాంతిలో, బ్రహ్మమానసంలో, వేదంలో, నేలలో, మహత్తులో, మెరుపులో, మన్మథునిలో, అగ్నిలో. మృత్యువులో జన్మించాయ్. మిగిలినవి దక్షునికి పుట్టినవి. ఆ పుట్టిన వారిలో ముని, అరిష్ట అను వారిద్దరున్నారు. ఆ ముని కొడుకులు పదహారు మంది. ఆ పదహారుగురిలో అతిగుణ, బల సంపన్నుడు—దేవేంద్రునిచే 'మిత్రమా!' అని పిలిపించుకున్న వాడు - చిత్రరథుడు. అతడు తన బాహుబలంతో గంధర్వ రాజ్యాన్ని జయించి పాలిస్తున్నాడు.

ఇక్కడికి దగ్గరలోనే కింపురుష దేశం ఉన్నది. దానికి హద్దు హేమకూట పర్వతం. అందులోనే చిత్రరథుడు ఉంటాడు. దాని చుట్టూవున్న 'చైత్రరథం' అనే వనం ఆతడు వేసినదే. ఆచ్ఛోదమనే మనోహరసరస్సునూ, అతడే త్రవ్వించాడు. ఇప్పుడు మీరు మెట్టిన ఈశ్వరాలయాన్ని కట్టించింది కూడా ఆయనే—

అరిష్ట పుత్రుడైన హంసునికి కులపట్టం కట్టాడు — చిత్రరథుడు. అతడుకూడా యీ హేమకూట పర్వతంలోనే నివ

శిస్తున్నాడు. చంద్రకిరణాలలో పుట్టిన అప్సరస వంశంలోని 'గౌరి' అనే ధవళ వెలుగులు వెదజల్లే కన్యను అతడు వివాహం చేసుకున్నాడు. మన్మథునికి రతీదేవిలా, పద్మలతకు శరత్కాలంలా దొరికిన, హంసరాజు పొందుతో ఆమె మహానందభరితురాలై పట్టమహిషి అయింది.

ఆ దంపతులకు ఒకానొక దుష్ట నక్షత్రాన, శోకానలమై నేను పుట్టాను. లేక లేక కలిగిన నన్ను చూచి, కొడుకు కంటే ఘనంగా నన్ను నాతల్లిదండ్రులు ప్రేమించారు. నేను దుఃఖమంటే తెలియక, సుఖంగా బ్రతికాను—ఆ యింట.

క్రమంగా నాకు యౌవ్వనం అంకురించింది. నన్ను పెను పిశాచంలా పట్టి అది పీడించింది. ఇంతలో వసంతం వచ్చింది. తామర రేకులు పూశాయ్. మామిడి మొగ్గలు, కాముకుల తమకాన్ని రేపాయ్. మలయమారుతం, యౌవ్వన హృదయాన్ని రేపి, మదనుని ధ్వజపటాలను టపటప లాడించింది. వొడలు పులకించింది. మధుర మధురమైన, నిస్వనాలు వసంత ప్రకృతిలో ప్రభవించాయ్. నేలపై ఎటుచూచినా పుష్పాడి రాసులు, మత్తిల్లిన మధుకర బృందాలు, తీవెలపై ఊయల లూగుతున్నాయి. చివుళ్ళలో దాగిన కోయిలలు, గుట్టలపై వెలసిన నెమళ్ళు లేమావి తొర్రలలో తలలు పైకెత్తి వసంతాన్ని వీక్షించే చిలుకలు ఊరుకుంటాయా? మన్మథుడ్ని పిలిచాయ్. చెరకు విల్లునూ, పూతూపులనూ ధరించి ధనుష్ట

కారం చేశాడు. నా గుండెలు విచ్చిపోయాయ్. ఎడతెగకుండా వర్షిస్తున్న ఆ పుష్ప బాణాల శబ్దాలకు దిక్కులే అదిరిపోయాయ్.

శృంగార ఊయలలో లోకమే డోలలూగింది. తొలకరి జల్లులకు పొంగిన నేలలా, చంద్రకాంతికి పొంగిన సముద్రంలా హృదయాలు పొంగాయ్. అదే సమయంలో నేను నా తల్లితో కలసి, స్నానానికై సరస్సుకు వచ్చాను. ఆహా! నేత్రానందం! ఆ సరస్సు, వికసించిన తామర పద్మాలతో రాయంచలు కొరగ్గా, ముత్యాలలా ఆకులలో తారాడుతున్న నీటి బిందువులతో, వెడల్పాటి పచ్చని తామర పత్రాలతో అతి మనోహరంగా ఉంది.

అంతకుముందే స్నానార్థం అచటకు వచ్చిన పార్వతీదేవి శివుని చిత్రాల కొన్నింటిని, ఇసుకలో గీసి వెళ్ళిపోయింది. ఆ చిత్రాలకు మునులువచ్చి పూజలు జరిపి వెళ్ళిపోయినట్లు అడుగుల గుర్తులున్నాయ్. ఆ చిత్రాలకు నేనుకూడా నమస్కరించాను. అచ్చటి పొదరిళ్ళ తుమ్మెదల బరువుతో రాలిన పుష్పొడి ధూళిలో, కోకిలలు గోళ్ళతో చీరగా చిమ్ముతున్న మధు వర్షంలో, గున్నమామిడి పూతలతో ఆ ప్రకృతి రమణీయంలో అటూఇటూ మైమరచి తిరుగుతున్నాను.

ఒకచోట గుప్పున సుగంధం గుభాళించింది. అదే దిక్కుకు తుమ్మెదలు ఝుమ్మని సాగిపోతున్నాయ్. అటు వంటి

సుగంధాన్ని నే నెన్నడూ అనుభవించలేదు. అదో అనూహ్యమైన సుగంధ మనిపించింది. ఆ సుగంధం వచ్చిన వైపుకు తుమ్మెదలతో పాటు మణిమూపురాలుగల్లు గల్లుమన రాయంచలను తిలకిస్తూ కొంత దూరం వెళ్ళిపోయాను.

ఆ దారిలో స్నానార్థమై వస్తున్న ముని కుమారుడొకడు నాకు కనిపించాడు. అతడు ముక్కంటి కనుమంటలో దగ్ధమైన మన్మథునికోసం తపస్సు చేసుకునే వసంతునిలా ఉన్నాడు. మంటలెగుస్తున్న వహ్ని శిఖామధ్యంలా ఉన్నట్టు ఆ ముని కుమారుడు మహా ప్రకాశంతో వెలుగొందు తున్నాడు.

జడలు గోరోచనంతో తడిసిన సూత్రాలవలె కోమలంగా ఉన్నాయ్. సరస్వతీదేవికి స్వాగత మిస్తున్నట్టు, అతడి నుదుట విభూతి రేఖలు మెరుస్తున్నాయ్. శాపాలకు కారణభూతమైన కను బొమలు తోరణంలా విరిగి ఉన్నాయ్. హృదయంలో చోరశక్యంగాక, పెదవులపైనే యౌవ్వన రాగం నిలచిపోయింది. అందుకే ఆయన పెదవులు ఎర్రగా ఉన్నాయ్. ఒక చేతిలో కమండలం, మరో చేతిలో జపమాలిక, ఎడమనుంచి కుడికి తామర తూడులా వ్రేలాడుతున్న యజ్ఞోపవీతంతో, తేజస్సుతో సూర్యుణ్ణి జయించి, బ్రహ్మవర్చస్సుతో ఆకాశ గంగలో ఉతికి ముసలి చకోర పక్షి, కనుకొనవలె ఎర్రబడిన మందార వల్కలాన్ని' నడుముకు కట్టుకొని మహోగ్రుడై ఠీవిగా నడుస్తూ వస్తున్నాడు. మరొక

ముని కుమారుడు అతడి వెనకే పూజకై పూలు కోస్తూ వసుగకుతూ వస్తున్నాడు. మనోహరాకారుడైన మునిపుంగ వుని చెవిపై ఒక పూల గుత్తి కనబడింది. వనలక్ష్మి చిరు నవ్వులా అది వికసించి ఉంది. దక్షిణ పవనాలకు నివ్వాళు లెత్తే వసంతుని జలధారవలె అది స్వచ్ఛంగా ఉంది. కుసుమ లక్ష్మి యౌవ్వన విలాసంలా అది అమృత బిందువులను వర్షి స్తోంటే దానికై తుమ్మెదలు ఎడబడుతున్నాయ్.

ఆ పూలగుత్తి చూచి అప్పుడు నే ననుకున్నా– 'ఓహో! దీని సుగంధమే నన్నింత దూరం తీసుకొచ్చింది గదా?' అని.

అలాగే ఆ అనంతరూప లావణ్య విలాసుడైన ముని కుమారుని చూస్తూ నేను నిలిచిపోయాను. నవయౌవ్వన సులభుడైన మదనుడు నన్ను పరవశురాలిని చేసాడు. నాపై మన్మథుడు వాడి పిరితూపును విసిరాడు. నాకు తెలియకనే నాలో పులకరింతలు పుట్టాయ్. నిట్టూర్పులు వెడలాయ్. రెప్పలాడించడం మరచిపోయి ఓరచూపులతో నేను ఆయ నను చూస్తూ విగ్రహంలా ఉండిపోయాను. అలా ఉండి పోయే అతడి అందాన్ని, కాంతినీ అంతటినీ దోసిళ్ళతో పట్టి త్రాగేస్తున్నాను. అతడిని అతడి హృదయంలో కాస్త చోటివ్వమని మొరపెట్టుకుంటున్నా. కులకన్యలకు అనుచిత మైనదా పని. అయినా అపులేక పోయాను.

ఆ చూపులూ, వికారాన్నీ ఎవ్వరూ నాకు నేర్పలేదు. వాటంతటవే యౌవ్వన ప్రాదుర్భావంతో పుట్టుక వచ్చే వేమో !

అతికష్టంపై నాకు నేను తెలుసుకున్నాక ఎంతో సిగ్గని పించింది. మదనుడు నన్ను నవ్వులపాలు చేయడానికిలా చేసాడేమో ! అప్పటికే నా వొడలంతా పులకాంకితమై కందిపోయింది. పై నుండి క్రిందికి చెమట బిందువులు రాలి కాళ్ళకు వేసుకున్న లత్తుకను చెరపివేసి రసాతలాన్ని అరుణా రుణం చేసాయ్. తొలిచూపులోనే వలపు, అందులోనూ ఒక తాపసునికి స్వాధీనమై పోవడం ఎంత విచిత్రం !

నాలో ఉదయించిన సిగ్గంతా కాస్త నిగూఢంగా ఆలో చించాక చెదిరిపోయింది. నే నేంతప్పు చేసాను ? ఎందరు కన్యలు ఇలా తమకు తెలియని వారిని వరించలేదు ! ఎంత మందిని మన్మథుడిలా పిచ్చెత్తించలేదు ?

మళ్ళా భయం నన్నుఆవరించింది. తపోధనులైన మునులు కోపిష్టులు—చిత్తవికారంతో తన ముందున్న కన్యను గాంచి తమ చిత్తం ఎక్కడ చంచలమవుతుం దేమోనని శపించ వచ్చు అని వెనక్కి వెళ్ళిపోదామనుకున్నా.

కాని మునులు పూజనీయులు గదా! కాస్త నిగ్రహాన్ని తెచ్చుకుని ఆయనకు నమస్కరించాను.

మన్మథునిఆజ్ఞను ధిక్కరించడం ఎవరితరం? అందులోనూ మనోహరమైన యీ కాసాతీరం, నేత్రాలందకరమైన నందన వనం, హాయిగొల్పు మలయ మారుతం-యీ ప్రకృతిశోభ కనులు మూసుకుంటే మాయమైపోయేదా? మాయని ముద్ర లను ఎటువంటి మానుల హృదయాలపైనన్నా వేయగలదు. ఒయ్యారమొలికించుతున్న నన్నుగాంచి, అతడూ తాస్త చలించాడు. కాలికి దీపంలా అల్లల్లాడిపోయాడు.

ఆయన ఒడలు కొత్తగా వస్తున్న వసంతునికి సుస్వాగత మిస్తున్నట్టుగా గగుర్పొడిచింది. వ్రతభంగమవుతున్న భీతితో అతని చేతిలో జపమాల గజగజలాడిపోయింది. అతడి చెక్కిలిపై చిరుచెమట్లు వెలిసాయ్. తామరల్లా కన్నులు విరిసి ఆ తీరాన్నంతా పూలవనంగా మార్చివేసాయ్. అతడి మనో వికారాలు, నా మననావేశాన్ని మరింత అతిశయింప జేసాయ్. నేను అనూహ్యమైన ఆనందానుభూతిని పొందాను.

అబ్బ! మన్మథుడే ఆ తరుణానికి శృంగార చేష్టలననీ్న నేర్పుతాడనుకుంటా. కాకపోతే నాకనుబొమ్మల్లో విరుపులు. అతడి ప్రతివిరుపులు. నా బుగ్గపై చిన్న సిగ్గుచుక్క. అతడి చెక్కిలిపై చిరుచెమట్లు. ఇవన్నీ ఎలావచ్చాయ్! అతడి తన మనసులోని మాటలను, మరులనూ చూపులతోనే చిలక రిస్తున్నాడే మన్మథుని మహిమ కాకపోతే స్త్రీ ముఖం ఎరు గని ఆ మానానికి ఇవన్నీ ఎలా వచ్చాయి!

నేను తెగించి ఆ ముని బాలకుని ప్రశ్నించాను—

'స్వామీ! మీరెవరు? మీకు చెవిని పెట్టుకున్న పూల గుత్తి ఏ చెట్టుది?'

ఆయన చిరునగవు చిందించాడు

'ఎందుకిలా అడుగుతున్నావ్?'

'నే నెన్నడూ ఇటువంటి సుగంధాన్ని అనుభవించ లేదు గనుక!'

'అయితే విను, త్రిభువనాల్లోనూ ప్రసిద్ధుడైన 'శ్వేత కేతువు' అనే దివ్య మహర్షి ఉన్నాడు. దేవతలు సైతం మోహించగలిగే, నలకూబరుని మించిన మోహనాకారు డాయన. ఒకనాడు పూలుకోసుకుందామని ఆకాశ గంగలో దిగాడు. అక్కడే వేయిరేకుల పద్మంపై కూర్చున్న లక్ష్మి దేవి ఆయనను చూచింది. జగత్ప్రసిద్ధమైన ఆ సౌందర్యం చూచి లక్ష్మీదేవి ఆయన యెడ ప్రసన్నముఖురాలైంది. ఆమె కరుణాకటాక్ష వీక్షణం పడిన వెంటనే ఆ తల్లి పాదాలవద్ద జన్మించాడు ఓ బిడ్డ. ఆ బిడ్డను ఒడిలోకి తీసుకొని 'ఇదిగో మీ కుమారుడు' అని శ్వేతముఖునికి ఆబిడ్డను అందించింది— లక్ష్మి.

ఆ పిల్లవాడు పుండరీకంలో పుట్టడంవల్ల, శ్వేతకేతు డత నికి 'పుండరీకుడు' అన్న పేరుపెట్టి పెంచుతూ, సకల విద్య

లనూ నేర్పించాను. ఆ పుండరీకుడనే నేను' అని ఆ ముని కుమారుడు చెప్పగా, అంతకు ముందు వలపుతో అతడికి పట్టిన చిరుచెమట్లు నాకు పట్టాయ్.

ఏదో అడగాలన్న కుతూహలం నాకు జనించింది.

నేను అడక్కుండానే, నేను అడగాలన్న ప్రశ్నకు అతడు సమాధానం చెప్పనాగాడు—

'అయితే ఈ పూలగుత్తి ఎక్కడిదని అడగబోతున్నావు కదూ ? విను. ఈ రోజు చతుర్దశి గదా ? కైలాసంలో గౌరీ పతిని దర్శించుకుందామని, నేనూ ఈయనా బయల్దేరాం. నందనవన ప్రాంతంలో వనదేవత కానవచ్చింది. చైత్రలక్ష్మి స్వయంగా అలంకరించగా, ఆ దేవత పూలు, చివుళ్లూ, మొల నూలుగా ధరించి, పొగడమాలను కాళ్ళవరకూ తన నగ్న శరీరం కనబడకుండా వేళ్ళాడ వేసుకుంది. పూదేనియలు త్రాగి మత్తెక్కినట్టు కనబడిందామె.

'ఆ వనదేవతే, ఈ పారిజాత కుసుమదళాన్ని తెచ్చి నా కిచ్చి నమస్కరించి అన్నది. 'స్వామీ! అపురూపమైన మీ సౌందర్యానికి ఇదిగో కానుక! ఇది మీ చెవిని అలకరించ వలసిన పారిజాతపు దళం ! ఇది చెవిలో తురుముకొని పారి జాతం జన్మ సార్థకం చేయండి' ఇదీ ఈ పూగుత్తి కథ!' అని మునికుమారుడు పుండరీకుడు ముగించాడు—

ముగిస్తూ—

'నీవంతగా యీ పూలగుత్తిని సిగలో తురుముకోవాలని అనుకుంటే, ఇదిగో తీసుకో!' అంటూ స్వహస్తాలతో ఆ కుసుమ దళాన్ని నా చెవిని అలంకరించాడు. ఆయన చేయి తాకిన తావున మరో పారిజాత కుసుమంలా గగుర్పాటు కలిగింది. నా చెక్కిలిని, సోకిన హాయిలో. అతడి చేతినున్న జపమాల జారిపోయిందికూడా అతడు గమనించలేదు. నేనా జపమాలను క్రింద పడకముందే పట్టుకున్నా. దాన్ని నా చేతులనుండి తీసుకోడానికి అన్నట్టు అతడు వొంగినన్ను కౌగలించుకున్నాడు. అలా ఆయన ఆలింగన భాగ్యాన్ని పొందాను నేను. ఊహాతీతమైన అమరానందాన్ని ఆ క్షణంలో పొందాను.

ఇంతలో తటాలున మా చెలికత్తె వచ్చి—

'అమ్మా! దేవిగారి స్నానమయింది. ఇక మీరే మిగిలారు, రండి!' అంటూ పిలిచింది.

ఆ పిలుపు, ఏనుగుకు కొత్త అయిన అంకుశం పోటులా నాకు తగిలింది. పులకరింతల ముళ్ళలో నేను చిక్కిపోయినట్టు, మన్మథ బాణాల ముట్టడిలో నేను తగుల్కొన్నట్టు, అక్కడి నుండి బలవంతానగాని కదల్లేకపోయాను.

నేను కదలగానే, పుండరీకుడి ప్రక్కనే ఉన్న ముని కుమారుడు మందలిస్తూ అన్న మాటలు నాకు వినిపించాయ్.

'మిత్రమా? పుండరీకా? ఏమిటీ వికార చూపులు? పామరునివలె మనసును నిగ్రహించుకోలేక, యిలా ఉక్కిరి బిక్కిరై పోతావెందుకు? నీ తపోనిష్ఠ ఏమైంది? నీ వైరాగ్యం, భోగ ద్వేషం, బ్రహ్మచర్యం అన్నీ కాలిపోయాయా?

'నీ చేతిలోని జపమాల యింకొకరు గ్రహించారనికూడా నీకు గుర్తు లేకపోయిందే? ఇంతటి మతివిభ్రమణమా నీకు? ఇప్పుడా చంచల నీ హృదయాన్నికూడా ఎత్తుకు పోయిందే! దానినైనా అధీనం చేసుకో! ఊ!'

ఆ మాటలకు పుండరీకుడు సిగ్గుపడి—

'మిత్రమా కపింజలా! నన్నలా అపార్థం చేసుకోకు. జపమాలను ఒక దుర్మార్గురాలు పట్టుకుపోతే ఊరుకుంటానను కున్నావా!' అంటూ కోపాన్ని నటిస్తూ, కొని తెచ్చుకొన్న హుంకార స్వరంతో, అధరచుంబనకోసం అదరిపడుతున్న పెదవులతో అన్నాడు—

'ఓసీ! చంచలా! నా జపమాల ఇవ్వకుండా మరో అడుగు ముందుకు వేసావా! ...'

నేనాగిపోయాను. మెడలో వేసుకున్న జపమాలను, నృత్య విన్యాసంతో పుష్పాంజలి భంగిమంలో వెళ్ళి, ఆయన ముందు నిల్చి – 'ఊ! తీసుకోండి!' అన్నా.

పాపం! శూన్య హృదయుడు, శూన్య హస్తాన్ని చాపాడు. ఆ చేతిలో జపమాల పెట్టి, నేను వెనుదిరిగి వచ్చే

శాను. స్నాన మాచరించి నాతల్లితో యింటికి వెళ్ళి పోయాను.

ఆయన ఎడబాటుతో నా హృదయం కాలిపోసాగింది. నేనేం చేస్తున్నానో నాకే తెలీదు. నవ్వుతున్నానో, ఏడుస్తున్నానో, అది రాత్రో పగలో అనే జ్ఞానంకూడా నాకు లేదు. ఈ మదనతాపాన్ని ఎలా అణచుకోవాలో బోధపడ లేదు.

అంతఃపురంలోనికి ఏ సఖినీ రాకుండా ద్వారం చెంతనే ఆపివేసాను. ఎవ్వరినీ నా అనుమతి లేకుండా రాకూడదని ఆజ్ఞాపించి, మరో గవాక్షంలోంచి, నేను ఆయన్ను కలుసుకున్న దిశనే చూస్తూ ఉండిపోయాను. అక్కడే నాకు పూర్ణచంద్రోదయ మౌతున్నట్టుగా తోచింది. ఆ దిశనుండి వచ్చే గాలి, పూల వాసన, చిలుకల, కోయిలల మధుర ధ్వనులు ఏమైనా ఆయన నుండి సందేశం తెస్తాయేమోనని ఎదురు చూస్తున్నా. ఆయనకు మౌనం ప్రియం! ఆ మౌనాన్నే నేనూ అవలంబించాను.

అలా ఉండగా నాతో సరస్సుకు స్నానానికి వచ్చిన సఖి ఒకతె చెంతకు వచ్చి మెల్లగా అన్నది—

'సఖీ! ఆ సరోవర తీరంపై కనబడ్డ దివ్య మునుల్లో ఒకరు నాకు కనుపించారు.'

'ఏమి చేమిటీ?'

'అవును చెలీ! నీవలా వెళ్ళాక పొదల చాటున దాగిన కన్యాయన పిలిచి 'ఎవరామె?' అని అడిగాడు. హంస రాజు కుమార్తె 'మహాశ్వేత' అని నేను చెప్పగానే రెప్ప వాల్చకుండా కాస్సేపు నిలచిపోయి అడిగాడు — 'నాకొక సహాయం చేసి పెడతావా?' అని.

'అదేమి స్వామీ? మీ ఆజ్ఞకు బద్ధులమై మెలగే మేము సహాయమే చేయలేమా?' అని నేను నమస్కరించడం, అప్పుడతడు ప్రక్కనున్న తమాల వృక్షం ఆకుల పిండి, ఆరసంతో తన ఉత్తరీయపు చెరగుపై ఈ లేఖ రాసి నీకు అందివ్వమన్నాడు' అని, నా చెలి ఆ లేఖను చూపించింది.

'ఆశ చూపి హృదయాన్ని దొంగిలించి పోవడం నీకు భావ్యమా, చెలువా?' అని లేఖలో ఉంది.

అది చదువుకోగానే నా కళ్ళు చిమ్మచీకట్లు క్రమ్మాయి. దారి కనబడలేదు. మత్తెక్కిపోయాను. నన్ను నేనే మరచిపోయాను. నా చెలి, నా కప్పుడు గురువు, ప్రభ్వీణి, యజమానురాలుగా భావించాను. స్వర్గానికి వెళ్ళి వచ్చిన పునీతురాలుగానా కామె కనబడింది. ఎన్నెన్నో నా స్వామిని గురించి ప్రశ్నల వర్షం ఆమెపై కురిపించాను. తీరని కోరికలు గుర్రాల్లా పరువులు పెట్టగా తీరని ఆశలు, మనస్సులో చివురు లెత్తగా ఆ రోజల్లా ఆ దివ్య సుందరమూర్తి సమాచారంతోనే గడిపివేసాను.

ఇంతలో హృదయాను రాగాన్ని పుణికి పుచ్చుకున్నట్టుగా సూర్యుడు ఎర్రబడ్డాడు. కమలవనాలు ముడుచుకుపోయాయ్. విరహంతో సొమ్మసిల్లిపోతున్న పద్మినీ లతలన్నీ కనులు మూసుకున్నాయ్.

చీకటి ఆవరిస్తోంది. మరల ఇంకొక చెలిలోనికి ప్రవేశించింది—

'ఎవరో బయట జడదారమ్మా!' అంది.

పుండరీకుడేమోనని తక్షణం లోనికి తీసుకు రమ్మని ఆజ్ఞాపించాను.

అతను వచ్చాడు. అయితే పుండరీకుడు కాదు-కపింజలుడు. అయినా పుండరీకుని పోలి వసంతునిలా ఉన్నాడు. పుండరీకునికి తగిన చెలికాడు. అతడు నాకేదో చెప్పబోతున్నట్టుగా ప్రతిమాలుకుంటున్నట్టుగా కనబడ్డాడు. నేనే ముందు లేచి నమస్కరించాను.

అప్పుడతడు వినయంగా అన్నాడు—

'రాకుమారీ! ఏమి చెప్పడానికీ నన్ను సిగ్గు ముంచెత్తుతోంది. కందమూలాలు భుజిస్తూ అడవుల్లో ముక్కుమూసుకొని తపస్సు చేసుకొనే ముని లెక్కడా! భోగలాలాసతతో కూడిన యీ ప్రపంచ మెక్కడ! యీ రెంటికీ పొందెలా కుదిరిందో బోధపడ్డంలేదు. చెప్పక తప్పక చెబుతున్నా,

చెప్పకపోతే, అనర్థాలు సంభవించవచ్చు. నా మిత్రుని ప్రాణాలే ఎగిరిపోవచ్చు.

'విను. నీ వుండగానే పుండరీకుని నేను మందలించినది నీవు గమనించావుగదూ? నీవు వెళ్ళిపోయాక అతడూ వెళ్ళి పోయాడు. ఎక్కడకు ఎందుకు వెళ్ళిపోయాడో అర్థంకాక కాస్సేపు ఆలోచించాను. ఏనాడూ ఒక క్షణమైనా విడిచి ఉండని మిత్రులం మేము. వెంటనే వెదకడానికి బయలు దేరాను. కమల కాంతారాలన్నీ వెదికాను. ఎక్కడా కనబడ లేదు. కడకు సరస్సుకు దగ్గరలోనే ఉన్న చైత్రవనంలోని ఓ పొదరింటిలో దొరికాడు. అతడిస్థితి ఏమని వర్ణించను? విగ్రహంలా పడిఉన్నాడు. నిశ్చలుడేగాని చలించిపోయాడు. ఒంటరిగానే ఉన్నా అతడిచెంత మన్మథుడున్నాడు. శూన్య మనస్కుడైన అతడి మనస్సులో, అతడు వలచిన ఒక స్త్రీ విగ్రహంవుంది. ముని గనుక శపిస్తాడని మన్మథుడు ఎదుట పడకుండా తెరమరుగున పడి అతడ్ని బాధిస్తున్నాడు. అవ యవాలు కదలడంలేదు. మనసులోని మగువకోసం, అవి లోనికి వెళ్ళిపోయాయ్. కామాగ్ని జ్వాలలతో కందిపోయిన కనుదోయినుండి కన్నీరు కారుతోంది. నిట్టూర్పులు పాముల్లా బుసలు గొడుతున్నాయ్. నీ కిచ్చిన పారిజాత కుసుమం దాల్చిన ఆయన చెవిపై. ఆ వాసనపోక తుమ్మెదలు గుంపులు గుంపులుగా యింకా చేరుతూనే వున్నాయ్. చుట్టూరా

ఉన్న చెట్లపై నుండి రాలిన పుష్పాడి ఆయనను కప్పి వేస్తోంది. గండుకోయిలల కూతలు ఆయన హృదయాన్ని కోసి వేస్తున్నాయ్. గంగా ప్రవాహంలా సన్నబడిపోయాడు. పిచ్చివానిలా అగుపించాడు నాకు. నాకిక దుఃఖమాగలేదు. గుండె కొట్టుకొంది. అబ్బ! కామవికారం, ఎంత శక్తి గలది! ఏ నాడూ ఏ ఒక్క పొరపాటూ చేయని వానినే, ఆ కామపిశాచి ఆవహించిందే? నే నాయన్ని తట్టి పిలిచాను. 'పుండరీకా! ఏమిటిది?' అని. బలవంతపై అతడు కనులను తెరచాడు. సిగ్గుతో మాటలు తడబడగా అన్నాడు—

'మిత్రమా! అన్నీ తెలిసి ఎందుకడుగుతావ్?' అని జాలిగా నా ముఖంలోకి చూచాడు.

ఇకతడ్ని మరలించడం అసంభవ మనుకున్నా. అతడు తెలివిని కోల్పోయాడు. అలా కోల్పోయినవాడే రత్నమని నిప్పును పట్టుకుంటాడు. ధర్మమని విషలతకు నీరు పోస్తాడు. క్షణిక సుఖంకోసం. శాశ్వత ఆనందాన్ని విడవడుకుంటాడు.

'ఏమిటీ బుద్ధిహీనత మిత్రమా?' అని కోప్పడ్డాను.

కాని అతడు నా మాటలను త్రుంచివేసినట్లు మధ్యలోనే నన్నాపి అన్నాడు—

'మిత్రమా! ఉపదేశించడం తేలిక! నిగ్రహం, వివేకం, గతించిపోయిన గాథలు! ప్రాణాలతో ఎలాగో ఇప్పటికీ నేను జీవించాను. ఉపదేశ సమయం మించిపోయింది. నన్నిప్పు

డెవ్వరూ సరైన మార్గంలో పెట్టలేరు. ఏమైనా చేయ గలిగితే నా మదన తాపాన్ని తేర్చే ఉపశమనం ఏమైనా చేయి!' అని.

నా మిత్రుని బాధ నా కప్పుడు అర్థమైంది. వెంటనే కొలనులోని తామరతూండ్లన్నీ కోసుకొచ్చి ఆ పొదరింటి వద్దనే ఉన్న రాతిశయ్యపై పరిచాను. తామర పత్రాలు తెచ్చి నీటనుముంచి విసురుతూ, అతని వక్షస్థలంపై సుగంధ చందన చిగుళ్ళు పిండి, ఆ రసాన్ని అలదినాను. కాని అతడికి ఉపశ మనం కలుగటంలేదు. అతడి శరీరం కాలిపోతోంది. గుండె దడదడ కొట్టుకొంటోంది. నాకేమీ పాలుపోలేదు. 'ఏమి చేయడమా?' నని ఆలోచిస్తున్నా. మేరునగ గంభీరుడైన నా పుండరీకుడు పూచిక పుల్లకంటే తేలికైనట్టుగా మార్చి వేసింది — ఈ కామరాగం! ఇప్పుడీయన్ని రక్షించడ మేలా? ఎవరిని రక్షించ మనడం?

'నీవుతప్ప మరొకరు రక్షించలేరని ఒక అభిప్రాయానికి వచ్చాను. నీ పొందుతప్ప అతడు బ్రతికే మార్గంలేదు. చచ్చిపోయి, ఈ విషయాన్ని నీకు నివేదిస్తున్నాను. ఇప్పుడు ఆలోచించి, నామిత్రుని బ్రతికించే మార్గం చూడు!' అంటూ కపింజలుడు చెప్పి, నా ముఖంలోకి చూచాడు.

నేను సిగ్గుతో ముఖం దించుకున్నాను. ఆనంద బాష్పాలు దొరలాయ్. మన్మథమూర్తికి రెండు చేతులూ ఎత్తి నమస్క-

ించాను. ఈ మరులు నాలో నేగాక, ఆయనలో కూడా పులక
రిత్తించినందుకు నాపై మదనుడు అనురాగం చూపాడు.
ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి?

ఆలోచనలో మునిగిపోయాను. ఇంతలో ప్రతీహారి వచ్చి 'రాకుమారీ, రాకుమారీ! నీకు అనారోగ్యంగా ఉందని మహారాణి చూడ్డానికి వస్తోంది' అంది.

ఆ మాటవిని, ఇక తాను అక్కడ ఉండడం మంచిది కాదని భావించి లేచిపోతూ కపింజలుడు అన్నాడు—

'రాకుమారీ! నాకు సమయమై పోయింది. దినకరుడుకూడా అస్తగతుడౌతున్నాడు. ఇక నా మిత్రునికి ప్రాణదానం చేసే భారం నీదే!' అంటూ వచ్చేస్తున్న మా మాతృపరివారాన్ని గాంచి, బెదిరిపోయి వెళ్ళిపోయాడు.

మా అమ్మ వచ్చింది. నా ఆరోగ్యాన్ని ప్రశ్నించింది. కాస్సేపు కూర్చొని వెళ్ళిపోయింది. ఆమెతో నేనేమి మాటాడానో నాకే తెలియదు. మనసు మనసులో ఉంటేనేగా - తెలిసేది. ఇంతలో పడమటిదిశ ఎర్రబడింది. సూర్యుడు పశ్చిమాద్రిని విశ్రమించాడు. నాకేం చేయాలో బోధపడక, నా ప్రియసఖి తరళికను ప్రశ్నించాను—

'తరళికా! ఏమిటే తరుణోపాయం! కపింజలుని మాటలు విన్నావుగదా! వంశాన్నీ కులాన్నీ, శీలాన్నీ, కీర్తినీ, విడనాడి వెళ్ళి, ఆయన చేయిని తాకమన్నావా! లేకపోతే

అతడు మరణి స్త్రీ మునిహత్యామహాపాతకం సంక్రమిస్తుందే!' అని ఆలోచన ఆడుగుతుండగానే, తూర్పు దిక్కులో చంద్రుడు పొడిచాడు. చీకటి ఏనుగును, కుంభస్థలంపై చంద్ర సింహం, పంజాతో కొట్టగా బ్రద్దలైన ఆ స్థలనుండి వెల్వడిన ముత్యాల్లా చంద్రకిరణాలు పైకి త్రుళ్ళాయి. మెల్లమెల్లగా చంద్రుడు ఆకాశంమీదికి వస్తున్నకొద్దీ, దిశాంగనల నవ్వులు మొలకలెత్తాయ్. ఆమె తెల్లటి పలువరుసనుండి, వెన్నెల వెలుగులు చిందసాగాయ్. ప్రణయ కలహంతో రోహిణీదేవి కాలి పారాణి గుర్తుపడ్డట్టు, చంద్రుడు ఎర్రగా కనబడి, తెల్ల నౌతున్నాడు. నాలో మదనుడు మండుతున్నాడు. మనస్సు చీకటితో కప్పడిపోయింది. తరళిక ఒడిలో నిద్రించినా నిజానికి నేను నిద్రిస్తున్నది-ఆ మన్మథుని ఒడిలోనే. నాకు మృత్యువు పైబడుతున్నట్టు గోచరిస్తోంది.

వసంతం, మలయమారుతం నాలో నిట్టూర్పులను రేపు తున్నాయ్. పైన వెన్నెల నిప్పుల కురిపిస్తోంది. ఆ బాధల లోంచి, కాస్త ఉపశాంతా అన్నట్టు చంద్రోదయంలోంచి బయటికి వచ్చిన తామర తోటలోని నిద్రాదేవిపలె నన్ను కునుకు ఆవహించింది. వెంటనే తరళిక నాకు చందన సుగం ధాన్ని పూసింది. అప్పుడు మరల నా కనులు తెరచు కున్నాయ్. తరళిక రొమ్ములు, కన్నీటితో తడిసిపోవడం కనిపించింది నాకు. నా కాళ్ళకు నమస్కరించి, చందన పల కంతో తడిపిన చేతులను జోడించి అంది—

'అమ్మా! ఇక సిగ్గెందుకు? నువ్వు 'ఊ' అంటే అతడిని యిక్కడకు తీసుకు వస్తాను. లేదా, నీవే స్వయంగా వెళ్ళు! ఇక ఈ మదన వికారాన్ని నీవు తట్టుకోలేవు. చంద్రోదయమైన సముద్రంవలె మరులు నీలో ఉరకలు వేస్తున్నాయ్.'

'ఛ్రిదానా! ఆ మన్మథుని మాటకేంలే! పద పోదాం. కాస్త సిగ్గును తొలగించుకుంటే, మన కార్యాలు తప్పక నెరవేరుతాయ్. బ్రతికుండగా నాహృదయేశ్వరుని చూస్తాను పద!'

ఆ మదన భారంతో ఎలాగో లేచాను. నేను లేవగానే అపశకునంగా నా కుడికన్ను అదిరింది. 'ఏమిటీ అశుభం?' అని నేను కాస్త జంకాను. చంద్రుడు - ముల్లోకాల భవంతికి జలధార గొట్టంవలె సుధా ధారలను ధరించిన శశాంకుడు, చందన రసప్రవాహాలను పొరలిస్తున్నాడు.

ఇంటింటా ఇల్లాళ్ళు చంద్రోదయానికి నివాళు లెత్తుతున్నారు. కామిను లంపిన రాయబారులతో, రాచబాటలన్నీ కిక్కిరిసి పోయినయ్! వెన్నెలపైనపడి వేధిస్తుందని భయపడి, నల్లని వలువలు ధరించిన అభిసారికలు, కలువ తోటలోని విరిగన్నియల్లా అటూ, ఇటూ పరుగు లెడుతున్నారు.

పారిజాత కుసుమదళం నా చెవిలో ఉంది. పద్మరాగ మణుల కాంతులతో నేసినట్టున్న చెల్లాయి మేలుముసుగు వేసుకుని ఎవ్వరి కంటపడకుండా నా స్ఫటిక భవంతిని దిగాను. తరళికా, పరిచారికలూ నా వెనుకే ఉన్నారు.

అన్నట్టు వీరంతా నా కెందుకు? ప్రియుని చెంతకు పోయే వారికి తోడుగా పుష్పశరుడూ, చంద్రుడూ, ఎన్నడూ ఉంటూనే ఉంటారుగా! సందేహం కలిగి తరళికతో అన్నాను—

'తరళికా! సిగ్గును చంపి, ఇంద్రియాలను నొక్కి పట్టి హృదయం ముందుకు ఇలా పరుగులెడుతోందే! నన్నట్లా ఈడ్చుకొని చంద్రుడు తీసుకు పోతున్నాడే, ఆయననుకూడా, ఇలాగే చంద్రుడు ఈడ్చుకొస్తాడంటావా!'

ఆ మాటకు తరళిక నవ్వింది.

'ఎంత అమాయకురాలివమ్మా! చంద్రుడు నిన్ను నడుపుతున్నాడా! కాదు. కాదు. నీ పైనే మోహం జనించి, నీతో సరసాలాడుతున్నాడు. నీ చెక్కిళ్ళపై తన కాంతితో ముద్దు పెట్టుకుంటున్నాడు. చూడు! సౌందర్య సోయగాలతో నున్న నీ కుచపాళిపైకి చేతులను చాపుతున్నాడు — చూడు! నా కాలి గోళ్ళపై ఎలా మెరుస్తున్నాడో చూడు! పాపం! నీ కోసం విరహుడై ఎండిన చందన లేపంవలె ఎలా పాలిపోయి. ఉన్నాడో చూచావా!' అని చమత్కారంగా అంది.

ఇలా చమత్కారాలతో ఆ మాటా, ఈ మాటా అను కుంటూ ఆ చోటు చేరుకున్నారు. దారిలో పడిన పుష్పాది రాసులలో కొన్ని పాదాల గుర్తులు కనబడ్డాయ్. కైలాసం నుండి చంద్ర కిరణాలు తగిలి పారుతున్న సెలయేటి తరం

గాలు కడిగి వేస్తున్న స్వచ్ఛమైన స్థలం చెంతనే పుండరీకుడు ఉన్నట్టు అగపడుతోంది. ఆయన ప్రక్కన ఎవరో మరో కాయన విలపిస్తున్న విలాపం వినబడుతోంది. కుడి కన్ను అద రడంతో అనుమాన మబికిన నా మనస్సప్పుడు మరింత గుబి ల్లుమంది. భయభ్రాంతురాలనై తడబడుతున్న అడుగులతో ఆ దిక్కుగా గబగబా నడచి వెళ్ళాను. కొంత దూరం వెళ్ళాక, కపింజలుని విలాపం వినబడుతోంది.

'అయ్యో! కొంప మునిగిపోయిన దే! సర్వం నాశన మైనదే! ఏమిటీ విధి వైపరీత్యం? ఓయి పాపీ! మహాశ్వేతా! నా మిత్రుడు నీ కేమి అపకారం చేసాడే! ఓరీ! చంద్రా! ఇప్పుడు నీ కళ్ళు చల్లబడ్డాయా? ధర్మమా? ఇక నాకు దిక్కెవ్వరు? అంతా శూన్యమై పోయిందే? బ్రతుకు బండలై పోయినదే? తపస్సు దగ్ధమై, లోకం నరకమైనదే? ఇక నే నెవ రితో తిరుగను? ఎవరితో ఛలోక్తులాడి జీవించగలను? ఆహా! పరమేశ్వరా!' అని భోరు భోరున అతడు ఏడ్వడం నేను విన్నాను.

మేని ప్రాణాలెగిరి పోయినట్టు ఒక్క పెట్టున కెవ్వున అరిచాను. గబగబా ముందుకు పరుగెత్తాను. ప్రక్కనున్న తీవెలలో తగుల్కొని నా పైట చెరగు చర్రున చిరిగిపోయి నది కూడా నాకు తెలియలేదు. పడుతూ, లేస్తూ ఎలాగో ఆ స్థలాన్ని చేరుకున్నా.

అతడు సరస్సుకు సమీపంలో పూలూ, చివురుటాకులూ, తామర తూళ్ళూ పరచిన ఒక చంద్రకాంత శిలాఫలకంపై పడుకుని ఉన్నాడు. ఏడ్చి ఏడ్చి ఎర్రబడినట్టున్న ఆ కన్నులు, జీవితంపై విరక్తి పొడమిన వ్యక్తిలా ఆ అధర కంపనం అన్నీ చూస్తే, నాపై కినిసి ప్రాయోపవేశం చేస్తున్నట్టుగా కనబడ్డాడు.

లేక నా దర్శనంకోసం ఏదైనా వ్రతనిష్ఠలో అలా పడి ఉన్నాడా? అదీగాక, తల మునిగి మదనుని నిశిత విరితూపులను తట్టుకోలేక ప్రాణాలనే విడిచిపెట్టాడా?

అంతా అయోమయంగా ఉంది.

అతడి ప్రక్కనే కపింజలుడు కూర్చున్నాడు. నన్ను చూడగానే 'రక్తదాహంగల రక్కసీ!' అని ఒక్క కేక పెట్టి, తన మిత్రుని మెడను కౌగలించుకున్నాడు. అలా కౌగలించుకున్నప్పుడు అతడు కదలలేదు.

అప్పుడప్పుడే అతడు అసువులు బాసినట్టు అతడి నేత్రాలు చూడగానే నాకు తట్టింది. తట్టగానే, నా కాళ్ళ అడుగున భూమి బద్దలై నన్ను పాతాళంలోకి గొనిపోయి నట్టయింది, చుట్టూ చిమ్మచీకటి ఆవరించినది. కళ్ళూ వొళ్ళూ అంతా తిరిగిపోయింది.

'ప్రియా! నన్ను చూడవ్? నన్ను దిక్కులేని దానను చేసి పోతావా? మదన పీడితురాలను చేసి దవానలజ్వాలల మధ్య

విడిచి వెడతావా! నాకోసం నీవింత త్యాగం చేసావని. బలి దానమైపోయావని తెలిస్తే, లోకం నన్ను ఊరుకుంటుందా! ఆ నిందలతో, యీ మదన పీడనతో మోహులాపడి, చివికి చివికి చావమనా, నన్నీ భూతలంపై విడిచిపెట్టి పోయావ్? ఇప్పుడిక నన్ను కాపాడువారెవరు! ఎంత పాపం చేసు కున్నాను! పంచప్రాణాలతో ప్రేమించినా నీవే లేనప్పుడు నాకిక తండ్రెందుకు! తల్లెందుకు? దేవుడెందుకు?' అని ఏవేవో నా మనోవ్యథను, బాధను వెడల బుచ్చుదామనుకున్నా. వెళ్ళబుచ్చానో లేదో తెలీదు. నేను క్రింద దభీమని పడి పోయాను. స్పృహ వచ్చాక చూచుకున్నాను. నేను కన్నీటి మడుగులో ఉన్నాను. నా ముత్యాల సరులన్నీ తెగి, చెల్లా చెదరై పోయి పడివున్నాయ్. పిచ్చెత్తినట్టు అరచి, రోదించి, ఆ హారాలను నేను త్రెంచుకున్నానని తరువాత తెలిసింది.

ఇక పుండరీకుడు లేనిది, యీ పుడమిపై బ్రతికెందు కని పించింది. ఇలా చివరి క్షణాలలో కొనప్రాణాలలో నా ప్రియు డున్నట్టు కపింజలుడైనా చెప్పకున్నందుకు నాకు చాలా కోప మొచ్చింది. కాని అంతలోనే కరిగిపోయా—

'నీవైనా, నేను వచ్చేదాకా యీయన ప్రాణాలను కాపాడలేకపోయావా! స్వామీ! యీయననెలా అయినా బ్రతికించవా!' అని ఆయన పాదాలపై పడి బ్రతిమాలు కున్నాను. తరళికను ఎన్ని మారులో భుజం కరిచి ఏడ్చాను.

క్షణక్షణానికి నేను స్పృహ తప్పిపోయాను...' అంటూ తన కథను చెబుతున్న మహాశ్వేత, ఆ స్నిగ్ధ తపస్విని కంపించి పోయి, మూర్ఛపోయింది. అప్పుడు ప్రక్కనే ఆ కథను వింటున్న రాకుమారుడు చంద్రాపీడుడు, ఆమెకు అనేక విధాల ఉపచారాలు చేసాడు.

'భగవతీ! నీ గతగాథను పలికించి నీకీ విషాదాన్ని తెచ్చి పెట్టిన పాపాత్ముడ్ని నేను. నన్ను క్షమించు! ప్రణయగాథలు ఎంత ప్రాచీనమైనా మరల మరల చెప్పుకున్నప్పుడు, కన్నీటి సెలలను పుబికిస్తాయి! అప్పటి దానిగురించి ఇప్పుడు వృథాగా ప్రాణాలను ఎందుకు పోగొట్టుకుంటావ్ ?' అన్నాడు.

ఆమె కాస్త కోలుకొని, ఒక వేడి నిట్టూర్పు విడిచి—

'రాకుమారా! అప్పుడు పోని ప్రాణాలు ఇప్పుడు పోతా యంటావా ! ఇక నేను కార్చే కన్నీరంటావా ? ఇది కన్నీరు కాదు నాయనా! ఈ రాతి గుండెకు కన్నీరేమిటి? ఈ పాడు శరీరాన్ని జీవచ్ఛవంలా మోసుకుని, సిగ్గులేకుండా బ్రతుకు తున్నాను నేను,' అంటూ మరల తన గాథను చెప్పసాగింది.

'అప్పుడే నేను మరణించాలని నిశ్చయించుకుని తరళికతో అన్నాను.

'తరళికా! నా చుట్టూ పుడకలను పేర్చు. నా ప్రియుని నేను చేరుకుంటాను' అని.

ఇంతలో చంద్రమండలంలో ఒక తేజస్సు ఆవిర్భవించింది. విస్మయంతో పైకి చూచాను. ఒక దివ్యపురుషుడు ఆ కాంతి నుండి దిగివస్తున్నాడు. విరజాజి రేకుల్లాంటి తెల్లని ఉత్తరీయంగా గాలిలో ఉచ్చైశ్శ్రవం నురగల్లా తేలిపోతుండగా, గగనంనుండి అవతరించాడు. మెడలో ముత్యాల హారముంది. ముంగురులు తుమ్మెదరెక్కల్లా మెరుస్తున్నాయ్. చెవిలో విరిసిన కలువవుంది. భుజాలపై మకరికా పత్రాలున్నాయ్. ధవళ దేహంతో ఆ దేహంపై నుండి వర్షిస్తున్న పరిమళ బిందువులతో దిగాడు. అతడు పుండరీకుని భుజాలపై ఎత్తుకొని—

'మహాశ్వేతా! నీవు చనిపోకు! తిరిగి పుండరీకునితో నీవు కలుస్తావ్!' అని తండ్రిలా చెప్పి, ఆకాశంలోకి ఎగిరి పోయాడు.

ఆ ఎగిరిపోయిన మహాపురుషుని గాంచి—

'దురాత్మా! నా మిత్రుని ఎక్కడికి ఎత్తుకుపోతున్నావ్?' అంటూ ఉత్తరీయాన్ని నడుముకు బిగించి, కపింజలుడుకూడా వానితో పైకి ఎగిరిపోయాడు.

నేను చూస్తుండగానే వారు నక్షత్రమండలాన్ని అధిగమించారు. నేను మరల కన్నీటి మడుగులో కూలిపోయాను.

నా దీన స్థితిని గాంచి, తరళిక అంది—

'చెలీ! ఇదేదో ఆశ్చర్యంగా ఉంది. కర్తవ్యమాలోచించు! లే! ఆ ఎత్తుకుపోయినవాడు మహా పురుషుడుగాని, మనిషి కాడు. మహాపురుషులు కలలోనైనా కల్లలాడరు. పుండరీకుని కోసమని ఇప్పుడు అగ్నిప్రవేశం చేయ తలపెట్టడం అవివేకమే అవుతుంది. పోనీ, పుండరీకుని ఎత్తుకుపోయిన ఆ మహాపురుషుని వెంట, కపింజలుడుకూడా వెళ్ళాడా! అతడైనా రానియ్! పుండరీకుడిన్ని అతడెందుకు ఎత్తుకు పోయాడో, అతడెవరో, ఆ విషయం తెలుసుకున్నాక, నీవు చావో బ్రతుకో తేల్చుకుందువు!' అని నన్ను బ్రతిమాలుకొంది.

నాలో ఏదో ఆశ అంకురించింది. ఆశ కోసం మనుషులు ఏమైనా చేస్తుంటారుగదా! ఆత్మాహుతి ప్రయత్నాన్ని విడనాడుకున్నా. ఆ కాళరాత్రల్లా దొర్లి దొర్లి ఏడ్చా. ఆ మహాపురుషుని మాటలపై ఆశ కొద్దీ మరునాడుదయాన్నే లేచి ఆ సరస్సులో స్నానంచేసి, ఆయన రూపాన్నే నేను కూడా ధరించి, ఆ కమండలము, ఆ కాషాయంబరాలనే ధరించి, జపమాలతో ఇలా ఆ పరమేశ్వరుని జపించుకుంటున్న నేను చేసిన పాపం ఇలా అయినా పోతుందేమోనని నా ఆశ! నా కోసం నా తల్లి దండ్రులు వచ్చికూడా, నన్ను ఈ జపతపాల నుండి విముఖురాలను చేయలేక, ఏడ్చి ఏడ్చి వెళ్ళిపోయారు. అప్పటినుండీ నా బ్రతుకీ శివలింగంవద్దే నాయనా! బ్రహ్మహత్యా పాతకురాలినైన నా గాథ విని నీవు పొందే ప్రయో

జన మేమిటి?' అంటూ మహాశ్వేత చీర చెరగు అడ్డు పెట్టు కొని, ఏకధార కన్నీటితో విలపించింది. చంద్రాపీడునికి పూర్వంకన్నా ఇప్పుడామెపై అమిత గౌరవం ఏర్పడింది. ఆమె నిర్మలతా, వినమ్రతా అతడిన్ని ముగ్ధుడ్ని చేసాయ్. అడిగినదే తడవుగా తన గాథను వినిపించిన ఆమెకు కృతజ్ఞత చూపాలనుకున్నాడు.

మెల్లగా మహాశ్వేతతో అన్నాడు—

'దేవి! నీవు పుణ్యాత్మురాలవే! కన్నీళ్ళతో ప్రేమను కనపరిచే ఈ లోకం కన్నా జీవితాన్నే పూర్ణాహుతి చేస్తూ నీవు జరిపే ఈ త్యాగం మహోన్నతమైనదే! ఇక నీకు విచార మెందుకమ్మా! ప్రేమకోసం తండ్రినీ, తల్లినీ, సుఖాన్ని, భోగాన్ని సర్వాన్నీ విసర్జించావే! బ్రహ్మ చర్యాన్ని గ్రహించి ఈ కారడవులనేచరించి ఈ కందమూలాలనే భుజిస్తున్నావే! ప్రాణం పోగొట్టుకోడం తేలికగాని, ఇటువంటి కష్టాలను అనుభవించడం తేలికటమ్మా! అందుకని ఆత్మహత్య చేసుకుంటావా? అదెంత పాపం! చనిపోయిన ఒకరికోసం బ్రతికున్న మరొకరు చనిపోవడం మూర్ఖత్వంగాదా? నీవు చనిపోయి సాధించే దేమిటి? పోనీ పుణ్యమన్నా వస్తుందా?'

'తన ప్రియుడు ముక్కంటి మంటలో భస్మమైపోతే రతీదేవి చనిపోయిందా? వీరాగ్రేసరుడైన అభిమన్యుడు చనిపోతే, విరాటపుత్రి చనిపోయిందా? సౌందర్యవంతుడు, శివ వర

ప్రహాసీ అయిన సైంధవుడు చనిపోతే, సూర్యుడు అన్నల ముద్దు చెల్లెలయిన ఆయన ప్రియురాలు దుశ్శల మరణించిందా? అదీగాక ఆ దివ్య పురుషుని మాటలే కల్లలుగా భావించడం తగదు. బ్రతికించే ఉద్దేశమే లేకపోతే నీ పుండరీకుణ్ని అతడు దేవలోకానికి తీసుకుపోతాడా? మహాత్ముల శక్తిని కించ పరచకమ్మా!

'పూర్వం విశ్వావసుడనే గంధర్వునికి, మేనకకు 'ప్రమద్వర' అనే పుత్రిక కలిగింది. ఆమెను పాముకరవగా చనిపోతే, చ్యవన మహర్షి మనుమడు రోరుముని తన ఆయుష్షులో సగమిచ్చి బ్రతికించడం వినలేదా!

'అశ్వమేధాశ్వం వెంటవెళ్ళిన అర్జుని నిశిత బాణాలకు, తన పుత్రుడు బభ్రువాహనుడే ఆహుతైపోతే, తల్లి ఉలూపి బ్రతికించుకోలేదా? యమునితో పోరాడి, సావిత్రి సత్యవంతుడ్ని బ్రతికించుకోలేదూ?

'అందుచేత చనిపోయినవారు బ్రతకడం సంభవం. కరుణ గలవారి యెడనే భగవంతుడు కాఠిన్యం అవలంభిస్తాడు. ఒక జన్మలో సుఖించిన ప్రియులకు అనేక జన్మల్లో ఎడబాటు తటస్థిస్తుంది. సంసారసాగరాన్ని యీదేవారికి ఇవి తప్పవు.' అంటూ అనేక విధాల చంద్రాపీడుడు ఆమెను ఓదార్చాడు.

ఇంతలో సంధ్య వాలింది. పక్షులు వేటి గూటి కవి చేరుకుంటున్నాయ్. మహాశ్వేత మెల్లగా లేచి, కమండలోద

కంతో కాళ్ళు కడుక్కొని, పడకపై నిట్టూర్చి దుఃఖంతో కూర్చుంది. చంద్రాపీడుడు స్నానం చేసి, సంధ్యావందనం చేసుకొచ్చి రెండవ రాతిపై తన ఉత్తరీయమే వేసుకొని పడుకొని, ఆ గాథను మరొక్కసారి మననం చేసుకుంటూ అనుకున్నాడు.

'అబ్బ! ప్రేమ పరీక్ష ఎంత కఠోరమైనది! మన్మథ శరాఘాతం ఎంత తీవ్రమైనది! ఎన్ని నిండు ప్రాణాల బలిదానాని కది దారి తీస్తున్నది!' అంటూ మహాశ్వేతను ప్రశ్నించాడు—

'మరి, మీతో వనవాస క్లేశాన్ననుభవించే ఆ తరళిక ఎక్కడ?' అని.

# 8

మహాశ్వేత జవాబు చెప్పింది—

'నా ప్రియ స్నేహితురాలి కొరకు సందేశం, ఆమెచే కంపించాను.'

'ఎవరో ప్రియ స్నేహితురాలు?'

'అదో కథ, విను నాయనా! మా పధ్నాలుగు వంశాల లోనూ అమృతంలో పుట్టిన వంశం అన్నానే, ఆ వంశంలో

'మదిర' అనే కన్యక పుట్టింది. ఆమెను అఖిల గంధర్వ నాథుడైన చిత్రరథుడు పెండ్లాడాడు. ఆయనకో ముద్దుల కూతురు పుట్టింది - ఆమె పేరు కాదంబరి !

ఆమె నాకు చిన్ననాటినుండీ స్నేహితురాలు. మా కాయాలు వేరుకాని ఆత్మలు ఒకటే. నా విషాద గాథను ఆమె విని, నా దుఃఖం తొలగునందాక తాను పెండ్లాడననీ, ఒక వేళ తన్ను తన తల్లిదండ్రులు ఎవరికైనా బలవంతంగా కట్టబెడితే, తాను ఆత్మహత్య చేసుకుంటానని శపథం చేసిందామె.

తన కూతురిలా శపథం చేసిందని విని చిత్రరథుడు చాలా ఆవేదనపడి, ఆమె శపథాన్ని మాన్పుకునేలా చేయు భారం నాదని, ఒక కంచుకిచే కబురు పంపాడు. ఆ కంచుకి నీవు రాక ముందే ఇక్కడకు వచ్చాడు. నేను ఆయనకు తోడిచ్చి తరళచే, నా స్నేహితురాలు కాదంబరికి సందేశం పంపించాను. ఆమె ఇలా వెళ్ళిందో లేదో, మీరు వచ్చారు.

'ఏమిటా సందేశం?' ప్రశ్నించాడు - చంద్రాపీడుడు.

'నేను జీవించి ఉండాలనుకుంటే, నీవు పెద్దల మాట విని పెండ్లి చేసుకోమని.'

'అబ్బ ! మీరెంత సహనవంతులు !' అని నిద్ర రాగా ఆవులించి, రాకుమారుడు నిద్రపోయాడు.

చంద్రోదయమైంది. వొంటికి విభూతి రాసుకొని, జింక చర్మం సగం కప్పుకుని, అంబికా వామ స్తనంలా, చంద్రుడు

ఆకసంపై ప్రత్యక్షమయ్యాడు. కలువతోటలన్నీ వికసించాయ్. తన కరాలను, సరస్సులోకి ప్రాకించి, వేళ్ళతో సైతం తమను పీకివేస్తాడా ఆ చంద్రుడన్నట్టు, తామరలు ముడుచుకుపోయాయ్. మహాశ్వేత నిద్రపోయింది. చంద్రాపీడునికి నిద్ర తేలిపోయింది. తాను వొదిలి వచ్చిన వైశంపాయనుడు, పత్రలేఖ, రాజకుమారులూ, గజతురగ పదాతి సైనిక శ్రేణులూ అన్నీ గుర్తుకొచ్చాయ్. వారి గురించిన ఆలోచనలోనే ఎప్పుడో ఆయన కళ్ళు మరల మూసుకుపోయాయ్.

శుభోదయమైంది. మహాశ్వేత లేచి, స్నానంచేసి, అఘమర్షణ మంత్రాలను జపిస్తోంది. అప్పటికి చంద్రాపీడుడు లేచాడు. ఆ సమయంలోనే తరళిక వచ్చింది.

కాని విచిత్రం! ఆమెతో ఎవరో నవమన్మథుడు వస్తున్నాడు. కుంకుమపువ్వులాంటి రంగు, ఇంద్రనీలాల్లాంటి కురులు, పైన ఉత్తరీయం లేకపోయినా, అతడి కుండలకాంతి భుజంపై పడి, ఆ లోటు లేకుండా అగపడుతోంది. అతడు నాగరికునిగా, రాచనగర్లలో వ్యవహారదక్షునిగా కనిపించాడు. చంద్రాపీడుని చూచి, అతడు ఆశ్చర్యపోతున్నాడు. తరళిక మహాశ్వేతకు నమస్కరించి ఏదో అనబోయింది. అప్పటికామె కళ్ళు తెరవలేదు. జపమయ్యాక మహాశ్వేతను తానే ముందుగా అడిగింది——

'చెల్లీ! కాదంబరి క్షేమమేనా? నా సందేశాన్ని అలిస్తా నందా?' అని.

'దేవీ! కాదంబరిని చూచాను. నీ సందేశాన్ని వినిపించాను. ఆమె కన్నీరు కారుస్తూ కొన్ని మాటలను చెప్పమని, ఇదిగో, యీ వైణికుడ్ని పంపింది. ఇతడే ఆమె మాటలను చెబుతాడు,' అని ఊరుకుంది - తరళిక.

'భర్తృదారికా! మా కాదంబరి ఇలా చెప్పమంది!' అంటూ వైణికుడు ఆ సందేశాన్ని వినిపిస్తున్నాడు—

'చెలీ! నా మనస్సును పరీక్షించాలని యిలా సందేశాన్ని పంపించావా? లేకపోతే, నిన్ను విడిచిపెట్ట గలిగిన అవిశ్వాస పాత్రమైన స్నేహితురాల ననుకొన్నావా? ఒక స్నేహితురాలు ప్రేమాగ్నిలో పడి దహించుకు పోతుండగా మరో స్నేహితురాలు చూస్తూ తద్విరుద్ధమైన పని ఎలా చేయగల దనుకున్నావ్? ఆ కాముడే నిన్నీ దుర్దశకు తీసుకొచ్చాడు గదా! ఆ కఠినుడిని నే నెలా సంతృప్తిపరచగలను! అది కల లోని మాట. భర్త ఎడబాటుతో కుమిలిపోతూ రాత్రింబవళ్ళు వనవాస మనుభవిస్తున్న నిన్ను చూస్తూ నేను మరో పెళ్ళి చేసుకోగలనా? ఈ విషయంలో నేనొక స్థిర నిశ్చయానికి వచ్చేసాను. క్షమించు - సందేశం పాటించలేదని. నా జీవితంతో పాటు, వనవాసం వెళ్ళిపోయావు నీవు. నీ సుఖం నుండి వేరై ఇక వివాహం జరగదు చెలీ!'

ఆ సందేశం విని, కాస్సేపు ఆలోచనలో పడింది – మహా శ్వేత. ఇక తనుస్వయంగా వెళ్ళినగాని ఆమె మనస్సుమార్చు కొనదని భావించి—

'వైణికా ! నీ వెళ్ళు. నే నామెను స్వయంగా కలుసు కుంటా.' అని అతడ్ని పంపించివేసింది.

చంద్రాపీడుడప్పుడు మహాశ్వేతను అడిగాడు—

'ఆహా ! మరో త్యాగమూర్తి గాథ నిప్పుడు విన్నాను. ఆమె ఎవరు ? '

'చెప్పాగనుదా, ఇంతకు ముందు, చిత్రరథుని రాజధాని విచిత్రమైనది. హేమకోట పర్వత రమణీయకతను అది పుణికి పుచ్చుకున్నట్టుంటుంది, అందులో కాదంబరి–ఒక నవరత్న ఖనిజరాశి. మాటలు చాలవు చెప్పడానికి, చూడాల్సిందే!'

'అయితే మీతోపాటు నన్ను తీసుకెడతారా ?'

'చూడాలనుకుంటే తప్పకుండా తీసుకెడతా నాయనా!' ఇద్దరూ బయలుదేరారు.

హేమకూటపర్వత ప్రాంగణాన్ని దాటి కాదంబరి అంతః పుర మార్గాన్ని ప్రవేశించారు.

మహాశ్వేతను చూడగానే, ప్రతీహారులు పరుగెత్తుకొచ్చి ముందుండి దారి చూపించారు.

ఎటు చూచినా వేలకొద్దీ స్త్రీ జనం ! అది ఒక స్త్రీ రాజ్యంగా, లోకంగా అగుపడింది. యుగాలు నాలుగుగాక,

అయిదో యుగంలో, అనగా స్త్రీ యుగంలో ఉన్నట్టుగా తోచింది—చంద్రాపీడునికి. మగవారంటే పరిపడక బ్రహ్మ దేవుడు స్త్రీలతో ఇక్కడ మరొక లోకం సృష్టించాడేమో.

ఎటుచూచినా మణికాంతులే. చంద్రకాంత మండపాలే! బంగారు తోరణాలే. కన్నులు మిరుమిట్లు గొలుపు సౌందర్య వతులైన స్త్రీల లావణ్య విలాసాలే. రతీమన్మథుల కేళీ స్వరూపాలే. వసంత విజయ విహారమే. సౌందర్య సౌకు మార్యాలు చెట్టాపట్టాల్ పట్టుకొని ఆడుకుంటున్నట్టు చూడ ముచ్చటగా ఉందా అంతఃపురం. అది గాంచి, తన్మయుడై పోతున్నాడు-చంద్రాపీడుడు.

ఎటు చూచినా కన్యలే మరి! చంద్రబింబాలు అనేకం వెలిసినట్టుగా ఉంది. వారి చూపులు విరిసిన, కలువతోట లతో నిండిపోయి ఉన్నాయ్. వారి చిరునగవుల వెలుగుల్లో విర జాజుల వాన కురుస్తున్నట్టుంది. అక్కడి కన్యల అరచేతుల అరుణిమ ఎర్రతామరల వికాసాన్ని మరపిస్తుంది. వారి ఆభ రణ కాంతులు నెమలి పింఛాలను తలపిస్తున్నాయ్. వారంతా కామినులై విహరిస్తున్నారు. వారా వెన్నెల కాంతులనేతిని బ్రతుకుతున్నారా? వారు ఆనందంకోసమే పుట్టారా? అమృ తంలో పుట్టినందున, వారికిక చావు పుట్టుకలే లేవా? ఎంత లేకపోతేమాత్రం—ఏమిటా విచ్చల విడితనం? చల్లిన పూలపై కాలు జారిపడి. కామక్రీడా పరవశులౌతారెందుకు? వారంతా

కామక్రీడా పరతంత్రులా? కాకపోతే, ప్రియుని కౌగలించు కున్నట్టు, ఆ బిందెలను అదిమి అదిమి మరీ పట్టుకున్నారేం ? వీణియలు మీటుతూ, ఎవరో చక్కిలిగింతలు పెడుతున్నట్టు, అదిరిపడతారేం? సంపంగి సుమమాలలను ధరించి, ప్రియుని పెదవులపైకి అధరాలను పోనిచ్చినట్టు. సుగంధాన్ని మాటి మాటికీ పీలుస్తారేం? అబ్బ ! ఎంత సౌకుమార్యులు వారు ? పొగడదండ మోకకు చుట్టుకుని, ఆ బరువునే మోయలేక నడుస్తున్నారు. మణికంకణాల ముంజేతులను సైతం, క్రిందికి వ్రేలాడవేయలేక పోతున్నారే ! పూలు కోయడమే గాని, దండలు కూర్చలేకపోతున్నారు. ఎంత చోద్యం ? ఎంత వైపరీత్యం ?

అంతటి చోద్యమైన అంతఃపురంలో కాదంబరి పరిచారి కల, శారికా కలకలం చంద్రాపీడునికి వినబడింది?

'లతికా ! మొగలి పుప్పొడితో తీవెలకు పాదులు పెట్టవే. మకరికా! చందనపు బావుల్లో రతనాల ఇసుకను పోయవే. రజనికా! నీవు చెట్ల చీకటిలో మణిదీపాలు వెలిగించవే. కుముదికా ! పక్షులు తినకుండా దానిమ్మలపై ముత్యాల సరులు చుట్టవే. నిపుణికా! మణిప్రతిమల కుచాలపై మక రికా పత్రాలు లిఖించవే! ఏమే మధురికా! అక్కడ నీవేం చేస్తున్నావ్? జవ్వనం పొంగిపోతుంటే, ఆ నెమళ్ళను కౌగ లించుకుంటున్నావటే! రండే! మయూరికా శాలలో కిన్నరు

లను వొదలవే! పంజరాల్లో చిలుకలను విడవవే! ఆ నెమళ్ళను క్రీడా శైలాలపైకి పంపండే! పదండే! చెలి రాబోతోంది. ఆ పూవులు సర్దండే! ఆమె కాలు జారిపడుతుందేమో!' ఆ కలకలంలో వినిపించిన మాటలివి.

ఆ చివరి మాటలు మరీ చోద్యంగా ఉన్నాయ్. పరిచారిక మాటలువినే దిగ్భ్రాంతుడైన చంద్రాపీడుడు, చివరిమాటల్లో చెలి సౌకుమార్యాన్ని విని తన్మయుడై పోయాడు.

మహాశ్వేత ముందు నడుస్తోంది. తెప్పరిల్లి తానూ అటు వెడుతున్నాడు.

అది-ఒక కాంచన ద్వీపంలాంటి సంపంగి వనం. పూలపై చేరిన తుమ్మెదలచే అశోక వనంలా ఉంది. అటుఇటూ ఆడ వాళ్ళు. కాళ్ళ పారాణికి నలిగి ఆ వనం రాగ సాగరంలా ఉంది. దేహాలకు పూసుకున్నచందన పొడి, అగరుతో తీర్చిన మకరికా పత్రాలు, దంత పత్రాల కాంతులు అన్నీ వెన్నెల విరిసి, అమృత ప్రవాహంలా ఉంది. ఆ ప్రవాహంలో చంద్ర రేఖలా పడి అడ్డుగా నడిచి వెడుతున్నాడు.

ఎదురుగా వసంత మండపం.

ముందు పుష్పాలంకృతులైన ప్రతీహారులు.

వారి మధ్య మండపంలో కాదంబరి.

మండపం మధ్య ఒక పుష్ప శయ్య ఉంది. దాన్నిపై సంపంగెలు గుభాళిస్తూ సుగంధాన్ని విస్తరిస్తూ స్వర్గంలా

మెరుస్తున్నాయ్. దానిపై కలువల దిండు. ఆ దిండుపై అర్ధ దండను వాల్చి, వేళ్ళపై చుబుకాన్ని ఉంచి, చంద్రుడ్ని విడిచి వచ్చిన చంద్రరేఖలా తళతళలాడుతూ మెరసి పోతోందామె.

ఆమె శరీర కాంతి ప్రవాహంలో ఈదులాడుతున్నట్లుగా వింజామర పాణులు పూలతలతో వీస్తున్నారు. ఆమె మణి కాంతులకు దేవతలు, కురుల కాంతులకు నాగులు, రత్న కాంతులను దిక్పాలురు చుట్టూ ప్రతి ఫలించి ఆమెకు దొంగి లించుకు పోతున్నారా అనిపిస్తోంది.

ఆమె చూపులలో చిలుకలు కులుకుతున్నాయ్. నగల గలగలలో నెమళ్ళు ఆడుతున్నాయ్. జడ కుచ్చులలో కోయి లలు పాడుతున్నాయ్. చుట్టూ ఉన్న పరిచారికలు ఆమె అందాన్ని చూడ్డానికై దివ్యచక్షువులను సంపాదించుకున్నారా అనిపిస్తోంది. కన్యాదానం చేయక పోయినా, కాముని కౌగ లిలో ఆమె ఓలలాడుతున్నట్లుంది. ఆమె కుచపాళి, చను వల్కలాలను చీల్చివేస్తున్నాయ్. తొడలు, బండరాయి అడ్డుపడగా రెండుగా చీలిన నదీపాయల్లా కనబడుతున్నాయ్. నడుమున రత్న కాంతులతో ప్రకాశించే మొల నూలు ఉంది. ఆమె కనులలో కలువతోట వికసిస్తోంది. ఆమె కోమల వక్షం- చనుకట్టును మోయలేకపోతోంది. స్తన భారంతో వాలి పోతున్న ముఖాన్ని పైకెత్తుతున్నట్లు హార కాంతులు పైకి

ఎగజిమ్ముతున్నాయ్. రతీదేవి హీణియ రత్న కోణంలా ఆమె ముక్కు మెరుస్తోంది. పిల్లగాలులకు లేచిన సెలయేటి అలల్లా ఆమె పెదవులు కోమలంగా ఉన్నాయ్. సోగ కనులు. ఆ పక్క మాణిక్య కుండలాలతో శ్రీకారాలు చుట్టుకున్నట్టున్న చెవులు. ఆమె అంగ అంగంలోనూ, మన్మధుని పొదుగు కొని ముసిసిపోతోంది. ఒక్క నెలవంకను తలపై దాల్చిన శివుని గర్వభంగం గావించాలని తన నగవుల వెలుగుతో, దిక్కు దిక్కులకూ వేనకు వేలు నెలవంకలను విరజిమ్ము తోంది. శివుని అహాన్ని ఛోగొట్టడానికి కాబోలు, రతీదేవి మరో త్రిభువనైక సౌందర్య మోహినై వెలసినట్టుందామె.

చంద్రాపీడుకు చూచినప్పుడామె, తన అందెల చప్పుడుకు పారిపోతున్న హంసలను పట్టుకు రమ్మని హంస పాలికను ఆజ్ఞా పిస్తోంది. తాను పెంచిన తీవె పుష్పించినదని చెప్ప వచ్చిన వనపాలికకు సొమ్ములు కానుకలుగా ఇస్తున్నది. తన కనులు కలువలని భావించవచ్చే తుమ్మెదలను, కలువ చెండ్ల కొడు తున్నది, తన హావభావ విలాసాలతో మరొక మన్మధుని ఆ వనరాజిలో సృష్టించి శివుని పరాభవిస్తోంది. ముంగురులు వాలిన శిరస్సుపై సన్నని మేలి ముసుగు ధరించి . ఆ సన్నని వస్త్రంలోనుండీ తన స్వర్ణ శరీరం, ఆ శరీరంపై అవయవా లన్నీ కనుపిస్తుండగా ఆమెను చంద్రాపీడుడు చూచాడు.

సరిగ్గా అప్పుడే వైణికుడ్ని 'అతడెవరని'? కాదంబరి చంద్రా పీడుడ్ని గురించి ప్రశ్నిస్తోంది.

ఆ కాదంబరి ముఖాన్ని చూడగానే, చంద్రుని చూచిన సముద్రం పొంగినట్లు చంద్రాపీడుని హృదయం పొంగి పోయింది—

'అయ్యో! ఆ బ్రహ్మదేవుడు నా మిగిలిన అంగాలన్నీ కన్నులుగా జేస్తే ఎంత బాగుండును! ఈ రెండు కన్నులూ ఈమె సౌందర్యాన్ని గాంచుటకు సరిపోవుట లేదుగదా!' అంటూ అటువైపే చూచాడు. అదే సమయంలో కాదంబరి ఇతడ్ని చూచింది. ఆమె కళ్ళముందు నవమన్మథునిలా ఉన్న చంద్రాపీడుడు పడగానే ఆమె మెడలోని హారాలు గళ్ళు మన్నాయ్. వొడలు పులకరించింది. ఆనందంలో కన్నీరు చిందింది. తన హృదయంలో ప్రవేశించిన చంద్రాపీడుడ్ని పట్టుకోడానికా అన్నట్టు, స్తనాల పైకి ఆమె చేతులు పోయాయ్. అప్పుడే మన్మథుడు గురిపెట్టి చెరకు విల్లును సంధించాడు. సుకుమారి కాదంబరి 'అబ్బా!' అని అదరి పడ్డది. అలాగే చంద్రాపీడుని హృదయంలోనూ కాదంబరి ప్రవేశించింది. ఆమె శరీరకాంతి సోకినా, ఆమె తనను తాకి నట్టుగానే ఉప్పొంగిపోయాడు.

చాలా కాలానికి వచ్చిన మహాశ్వేతను చూడగానే, కాదంబరి స్నేహముప్పొంగి మనసారా ఆమెను ఆలింగనం చేసుకుంది. మహాశ్వేత ముందుగా తన ప్రక్కనున్న చంద్రా పీడుడ్ని పరిచయం చేసింది—

'చెలీ! కాదంబరీ! ఈయన చతుస్సముద్ర పరీత భూమండ లాధీశుడైన తారాపీడుని కుమారుడు - చంద్రాపీడుడు. తన విశాల భుజస్కంధాలపై విజయలక్ష్మిని ధరించినవాడు. దిగ్విజయయాత్రలో నన్ను కలుసుకొనుట తటస్థించగా, నే నిక్కడకు తీసుకొచ్చాను. ఈయన నా కెందుకో అకారణ స్నేహితుడైనాడు. నన్ను నీ వెలా చూచుకుంటావో ఈయన్ని కూడా అలాగే చూడు. నిన్ను గురించి చెప్పాను. నూతన వ్యక్తి అని సిగ్గు పడకు! పరిచయం లేదని సందేహించకు! నాకువలెనే ఇతడు నీకూ మిత్రుడే!'

చంద్రాపీడుడు కాదంబరికి నమస్కరించాడు. ఆమె కేం చేయాలో తెలియక మదన వికారంలో పడబడి వాలుగంట చూచింది. చిరు పెదవులపై తలచిన నగవును దాచుకొంది. కాస్సేపటికిగాని ప్రతి నమస్కారం చేయ లేకపోయింది. అందులోనూ ఎంత సిగ్గు! ఆసిగ్గుతోనే, మహాశ్వేతను తన శయ్యపై కూర్చోబెట్టుకుంది. ప్రక్కనున్న రత్నాసనంపై చంద్రాపీడుడు కూర్చున్నాడు, మహాశ్వేత ఎదుట కాదంబరి ఎలా ఉంటుందో తెలుసుకున్న వారైనందున. పరిచారికలు సంగీత వీణారావాలను ఆపు చేయించారు. మహాశ్వేత పాదాలను పన్నీటితో కడిగారు.

రూపంలో, స్నేహంలో కాదంబరికి సమానురాలైన 'మదలేఖ' అనే సఖివచ్చి బలవంతంగా చంద్రాపీడుని కాళ్లు కూడా కడిగింది.

మహాశ్వేత, కాదంబరి వీపును ప్రేమతో నిమురుతూ, తుమ్మెదలు వాలుతున్న చెవికమలాన్ని, వింజామరలకు రెప రెపలాడుతున్న ముంగురులను సవరిస్తూ అనేక కుశలప్రశ్నలను వేసింది. వాటికి పరాకు చిత్తగిస్తూ, కాదంబరి జవాబు చెబు తోంది. చంద్రాపీడుడి అందాన్ని ఆమె కళ్ళు తప్పించుకో లేక పోతున్నాయ్. అతడి నీడ తన చనుగట్టుపైపడి చెదరి పోతున్నందుకే విరహం భరించలేక పోతోంది. రెప్పలు మూత పడుతున్నాయ్. పెదవులు అదురు తున్నాయ్. కాస్సేపటికి కాదంబరి, మహాశ్వేతకు కర్పూర తాంబూల మందించగా—

'కొత్తగా వచ్చిన అతిథి తర్వాతనే మనం' అని మహాశ్వేత తిరస్కరించింది.

కాదంబరికి సిగ్గు పొడమింది. చేయిసాగలేదు.

'సిగ్గేస్తోంది - నీవే ఇవ్వు!'

'కాదు. నీవే ఇవ్వాలి.'

కాదంబరి వొణికిపోయింది. కాముని బాణాలకు ఆమె శరీరమంతా ముచ్చెమటలు పోసాయ్. చేయందుకొమ్మని కోరుతున్నట్టుగా, సిగ్గులు ముట్టడించగా, పడిపోతానేమో అని తూలుతూ ముందుకు వొంగి చాయి చాపింది.

చంద్రాపీడుడూ చాపాడు — చేయి.

ఘల్లుమన్న ఆమె కంకణాల చేయి మాట్లాడింది. 'ఇక జీవితమే మీది!' అన్నట్టుగా. ఆ క్షణంలో ఆమె రూప లావ

ణ్యాన్నీ, ఆమె విలాసాలనూ, బ్రహ్మకూడా వూహించ లేడేమో! అందులోనూ సిగ్గుతోనున్న జవ్వనామె.

చంద్రాపీడుడా తాంబూలాన్ని అందుకున్నాడు. తటాలున ఆమె చేయి వెనక్కి లాగింది. ముంజేతి మణి కంకణం క్రిందకు జారింది. మన్మథ తూపులకు తూట్లుపడ్డ కాదంబరి హృదయంలా ఉందా కంకణం. ఆయన చేతిని తాకుదామన్న ఆసక్తితోనే క్రిందపడ్డట్లు తోచింది. ఆ కంకణం జారిపడినట్టే ఆమెకు తెలీదు.

ఇంతలో కంచుకి వచ్చి మహాశ్వేతతో అన్నాడు—

'ఆయుష్మతీ! మిమ్మల్ని చిత్రరథ మహారాజూ, మహారాణి మదిరాదేవీ చూడాలనుకుంటున్నారు.'

'అలాగే వస్తున్నా!' అంటూ లేవబోయి, కాదంబరిని అడిగింది—

'చెలీ, కాదంబరి! చంద్రాపీడుడు ఎక్కడుంటాడు?'

అప్పుడే తన హృదయంలో తిష్టవేసాడే? అని లోలోన అనుకొని—

'అదేమిటి మహాశ్వేతా? నా శరీరంపైనే నాకు అధికారం లేకుండా పోయిందే! ఇకే భవనాలపై ఉంటుందా? ఆయనకూ, నీకూ ఇష్టమొచ్చిన చోటనే ఆయన ఉండొచ్చు.'

'అయితే నీ భవనానికి ప్రక్కనున్న క్రీడా శైలంపైని మణి భవనంలో ఉండనియ్!' అని మహాశ్వేత చిత్రరథుడ్ని చూడ్డానికి వెళ్ళిపోయింది.

చంద్రాపీడుడు కూడా లేచి కాదంబరి పంపిన వైణికులతో, క్రీడాచతురులతో, అందమైన కన్యలతో, పరిచారికలతో వైణికుడు దారిచూపగా మణి భవనానికి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళగానే, కాదంబరి తన పరిచారిక బృందాన్నంతను వొదిలి, కొద్దిమంది ప్రతిహారులతోనే తన భవనానికి వెళ్ళిపోయింది. తన భవనంలో హంసతూలికంపై పరుండి, ఏదో జ్ఞప్తికొచ్చి తనకు తానే సిగ్గుపడిపోయింది.

అవును. జ్ఞప్తికిరాక ఏమౌతుంది? తాను చేస్తున్న పనేమిటి? ముక్కూముఖమూ ఎరుగని పరపురుషుని ఒక కులకాంత సిగ్గూ ఎగ్గూ చంపుకొని తలచుకోవచ్చా? తలచుకోవడమేకాదు. తనకు తెలియకుండా, ఎందరో ఉండగా తన హృదయాన్ని ఆయనకు అంకితం చేసివేసిందే? అందులోనూ ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టే, అంతఃపుర దాసీల ముందు సర్వసంగ పరిత్యాగి మహాశ్వేత ముందు సిగ్గు విడిచి తాను తన శరీరాన్నే మరచిపోయినట్లు బాహాటంగా పలికిందే? ఛీ! ఛీ! పాడు జన్మ! ఎంత సిగ్గుమాలిన పని చేశాను. నన్ను చూచి, గంధర్వలోకం కనికరిస్తుందా? ఇంద్రియ చాపల్యం ఎంత దుర్గతికి పాల్పడ చేసింది? నేను మహాశ్వేతకు చేసిన శపథాలు నీటిపై రాతలేనా? ఎంత చులకనై పోయాను — పదిమందిలో! ఎన్నడూ చూడని వ్యక్తికే, నా హృదయం

అంకితమైపోయింది? నన్ను బానిసగా ఆ మన్మథుడు అతడి కేల విక్రయించాలి? పైగా ఇప్పుడు నే నెందుకు సిగ్గుపడు తున్నాను?' అని ఏదేదో అనుకుంటూ మరల కాదంబరి వణికిపోతూంది.

ఆమె కంపనను గాంచి చంద్రాపీడుడు ఫకాలున నవ్వినట్లు వినిపించింది. తనను అవహేళన చేస్తున్నట్లుగా తోచింది. అలా నవ్వి చంద్రాపీడుడు. ఆతిథ్యాన్ని తృణీకరించి, మణి భవనం దిగి వెళ్ళిపోతున్నట్లుగా కనుపించింది.

'ఎందుకు వెళ్ళిపోతున్నారో?' అని ఆమె మనస్సు ఆయ నను ప్రశ్నించింది.

'కాకపోతే, నా ప్రేమను తృణీకరిస్తావా? అవమాన పరు స్తావా? ప్రేమ లేనిచోట యీ చంద్రాపీడుడు ఉండడు! అని అతనన్నట్లు వినిపించింది.

'ఆ . . . ఆ . . . ఆ వెళ్ళకండి!' అని తనకు తెలియకుండా ఆమె పెదవులు అన్నాయ్. ఇప్పుడామె హృదయం అతడి రూపాన్ని వెన్నంటింది. అడ్డుగా వెళ్ళి అతడిని కౌగలించుకుంది. అతడి హృదయానికి తన రొమ్ములను ఆనించి, మరల పుల కాంకితైంది.

ఇక్కడ మణిభవనంలోనున్న చంద్రాపీడునికీ ఆదే అవస్థ !

'కాదంబరి నన్ను అనుగ్రహించిందా ? లేకపోతే, నన్ను చూచినప్పుడు సిగ్గుతో ఎందుకు ముడుచుకుపోతోంది! నా

ప్రతిబింబానైనా పడనీయమని, తన చెక్కిలి నా వైపు ఎందుకు త్రిప్పుతుంది? ఇది ఆమె సహజ వికాసమా ? లేక నా చిత్తచాపల్యమా? కాదు, సహజంగానే ఆమెలో మన్మథుడు ప్రవేశించి నాపై మక్కువను కలిగించి ఉంటాడు? . . .' అని ఏవేవో మానవ సహజమైన బలహీనతలతో గోరంతలు కొండంతలు చేసుకుంటూ, ఊహించుకుంటూ, 'నాపై ఆమెకు సహజానురాగం కాకపోతే, త్వరలోనే బయట పడి పోతుందికదా, ఇప్పుడు నాకీ ఆలోచనలెందుకు ?' అంటూ ఒక నిశ్చయానికి వచ్చి, లేచి క్రీడాకన్యలతో కాస్సేపు వినోదించి, ఉద్యానవనం చూడ్డానికని, క్రీడాశైల శిఖరం అధిరోహించాడు.

సరిగ్గా ఆ శిఖరాన్నే చూస్తూ గవాక్షంలోనుండి కాదంబరి కనబడింది. ఆమె వెనుక పరిచారికలు ఛత్రచామరాలు పట్టి నుంచున్నారు. ఆమె జడలో తురిమిన పూలపై తుమ్మెదలు ఝుమ్మంటున్నాయ్. సగం వాల్చిన మేలి ముసుగులో వారగా చూస్తూ నిలచిపోయిందామె. చంద్రాపీడుని అనుసరించుటకు ఏదో ప్రయత్నం చేస్తోంది. ఆమెకు తెలియకుండా ఆమె చేతిలోని పూల చెండును- బంతిలా ఎగుర వేస్తోంది. దానిని పట్టుకోడానికి పరుగెడుతోంది. ఆ చిన్నెలు చూచి అక్కడ చిన్నవాడు నవ్వుకుంటున్నాడు.

ఇంతలో మహాశ్వేత తిరిగి వచ్చినదన్న కబురు వచ్చింది. కాదంబరి ఆమెను కలుసుకోడానికి వెళ్ళింది. చంద్రరేఖ లేసి

చంద్రుడెక్కడుంటాడు ! అతడూ క్రీడాశైలం దిగిపోయాడు. స్నానాదులు ముగించుకొని, మహాకాళుని పూజించి, శైల మందిరంలోనే ఆ పూటకు ఉండిపోయి మరల భానోదయానికి క్రీడాశైలమెక్కి అక్కడున్న ఒక లతామండపంలోని శిలా వేదికపై ఆసీనుడయ్యాడు. అదెంతో మనోహరంగా ఉంది ! జింకలు నెమరు వేస్తూ జార్చిన నురగలు అక్కడ పడిఉన్నాయ్. కామినుల పాద పారాణి ముద్రలు విరివిగా ఉన్నాయ్. పూల పుప్పొడి విరజిమ్మి ఉంది. ఆ పైనున్న పొదరింటి కప్పే నెమళ్ళకు నాట్యవేదికని పైకి చూచాక అతనికి తెలిసింది. క్రింద కనులముందు అద్భుతమైన కాంతి. పట్టపగలే చంద్రుడు పొడిచినట్టున్న కాంతది. ఆశ్చర్యపోయాడు.

'ఆకాశగంగ భూమిపైగాని పడిందా?' అని భ్రమిస్తూ క్రీడాశైలం దిగబోతూ వెలుగు వచ్చిన దిక్కుగా చూచాడు.

ఇంకెవరు ? కాంతిలో కాదంబరితో సమమైన మదలేఖ ! ఆమె చుట్టూ అందమైన కన్యలు ఆమెకు తెల్లని గొడుగుపట్టి నుంచున్నారు. పూలగుత్తులు పట్టుకొని ఆ వెనుక కొందరు నడుస్తున్నారు. ఆమె ప్రక్కనుండే తరళిక వస్తున్నది. ఆమె చేతిలో పాలసముద్ర కాంతిని మించి మెరుస్తున్న హార మొకటుంది. నక్షత్రాలతో కూర్చినట్టు సముద్ర మథనంలో చెక్కలైన చంద్రుని ముక్కముక్కలుగా కూర్చినట్టు దివ్య కాంతిని ప్రసరిస్తోందా హారం. దేవకాంతల కుచపరిమళం ఆ

హారం నుండి విరజిమ్ముతోంది. పట్టపగలే వెన్నెల విరియుటకు కారణం ఆ హారమేనని చంద్రాపీడుడు భావించడం అసంగతమేమీ కాదు.

అలా వచ్చిన మదలేఖను స్వయంగా వెళ్ళి పలుకరించాడు. అతనితో ఆమె వెళ్ళి అతడంతకు ముందు కూర్చున్న లతా మండపంలోనే కూర్చొని చంద్రాపీడునికి సుగంధం రాసి, జాజిపూలను మౌళికి జుట్టి, వైణికుడు తెచ్చిన పట్టు బట్టలను కట్టబెట్టి తరళిక చేతిలోని హారాన్ని ఆయన మెడలో వేసింది. మేరు తీరంపై తారా మండలంలా ఆయన వక్షాన ఆ హారం ప్రకాశించింది. చంద్రాపీడుడు ఆశ్చర్యపోతున్నాడు. హారమేసి ఆమె అన్నది—

'మీ మనోహరాకారం ఎవరికి మతి భ్రమింప జేయదు ? మతి భ్రమించి హృదయాన్ని కోల్పోయినా, కోల్పోవచ్చు ఎవరైనా! అలా హృదయాలు లాగివేసుకున్న మీకు మేమే మివ్వగలం? జీవితేశ్వరునికి ఒక జీవితేశ్వరి ఏమి కానుక యివ్వగలదు?-తన ప్రీయమైనదేదో ఇవ్వగలదు గాని! ఇది కాదంబరి ప్రియమైన హారం గనుకనే ఆమె తన ఐశ్వర్యాన్ని గాక ఈ హారాన్ని కానుకగా పంపింది. మీరు దాక్షిణ్యపరులు. ఉదారులు. దీన్ని సమర్పించేవారికి సిగ్గు పొడమొచ్చుగాని, స్వీకరించే మీకు పొడమదు. అందుకే యీ హారం మీకు సమర్పించమని, మా చెలి పెద్ద తప్పిదం చేసినట్టు క్షమించి

పోయింది. ఇది మామూలు హారం కాదు. అమృత మథనంలో వెలికివచ్చిన రత్నాలలో శ్రేష్ఠమైనవాటిని కూర్చినది కావడం వల్ల దీనికి శ్వేతహారమని పేరు. సముద్రుని కిదంటే ప్రియం. అందుకే తన ఇంటికి వచ్చిన వరుణునికి దీనిని సమర్పించాడు. అతడు మా మహారాజు చిత్రరథుని కిచ్చాడు. చిత్రరథుడు తన బిడ్డకు సమర్పించాడు. మీ సుందరాకారానికే తగినదని మా చెలి మీకు దీనిని సమర్పిస్తోంది. లక్ష్మితో పుట్టిన దన్న మక్కువతో రాతిముక్కను విష్ణువు కౌస్తుభంగా వక్షాన్ని ధరించాడు. కాదంబరి ప్రేమతో యిచ్చిన యీ హారాన్ని కూడా ధరించి ఆమె కోరికను తీర్చండి! ఆమె తొలి వలపు దోచుకున్న మీరు దీన్ని స్వీకరించి, ఆ వలపును గౌరవించండి! మీరునిరాకరిస్తే కాదంబరి ప్రాణాన్ని విడుస్తుంది. ఆ భయంతోనే మహాశ్వేత దీన్ని తరళికచే యిచ్చిపంపింది. 'కాదంబరి వలపును కాదనకు నాయనా!' అని చెప్పమంది.'

'మంచి చమత్కారివే! నీ చెలి నన్ను దాసునిగా చేసుకుంది. నీవీ మాటలతో నన్ను కట్టివేసావ్! కానియ్! కాదనడానికి ఇక నే నెవరిని ? నా చిత్తం కాదంబరీయత్తం !' అంటూ మదలేఖను పంపివేసాడు.

ఆమె తిరిగి వచ్చాక ఆ హారాన్ని ధరించిన సౌందర్యమూర్తిని మనసారా చూడాలని పంపి శీత శైలంపై పొడిచిన చందమామలా ఛత్ర చామరాలను విడనాడి, ఛంగున క్రీడా శైలంపై అవతరించింది—కాదంబరి!

అబ్బ! ఏమిటీ మనోవికారం! మాటి మాటికీ ఆవులింతలు, నడుములో అలసట, నేత్రాంచనం, చనుద్వయి గగుర్పొడుపు, జారుతున్న పైట, కాళ్ళకు బంధాలుగా పడుతున్న మొల నూలు. లలాటంపైకి ఎగిరి పడుతున్న ముంగురులు !

అలా పగలు గడచినదాకా, కనుచీకటి పడినదాకా ఆయ నను చూస్తూ నిలచిపోయింది. కామినులు రోషకషాయిత నేత్రాలతో చూడగా, ఆకాశం ఎర్రబడింది. కాముల వనా లన్నీ విరహంతో కళ్ళు మూసుకున్నాయ్. చీకటి నల్లచీర కట్టుకొంది. రసరాగం నిండిన కాదంబరి హృదయం సాంధ్య రాగంతో పరువం దీరింది. దిగ్గజాలు విరజిమ్మిన నీటి తుంప రుల్లా నక్షత్రాలు పొడిచాయ్. చంద్రాపీడుడు క్రీడాశైలం దిగిపోయాడు. చంద్రుడు లేక చంద్రరేఖ ఉండదుగా, ఆమె కూడా దిగిపోయింది. సంధ్య వెన్నెల సంధిలో కాస్సేపు నిల చిన చీకటి, చంద్రుని రాకతో పటాపంచలైపోయింది. పుచ్చ పువ్వులా విరిసాడు-చంద్రుడు. గగనకాంత అభిసారికలా పుల కరించింది. జలధరించింది. దిక్కులన్నీ ధవళమయ్యాయ్. తటా కాలు సుధా సముద్రాలయ్యాయ్. హంస శ్రేణులు విహ రిస్తున్నాయ్. చక్రవాకాలు విరహంతో అరుస్తున్నాయ్. చందన రసంతో కడిగిన శిలా వేదికపై చల్లనైన పారిజాతపు శయ్యపై వెన్నెల కాంతిలో తళతళ మెరుస్తూ చంద్రాపీడుడు పడుకున్నాడు.

అప్పుడక్కడికి వైశేషికుడు వచ్చి—

'దేవి కాదంబరి తమ దర్శనానికి వచ్చింది' అని చెప్పాడు. అదరిపడి, చంద్రాపీడుడు విరుస్తున్న ఎర్ర కలువలా ఎదుట కాదంబరి!......

# 9

జగజ్జేగీయమానమైన కాంతి, ఆభరణాల్లేవ్. రాజదుస్తులు లేవ్. కృత్రిమాలంకారాల్లేవ్. స్వచ్ఛమైన స్ఫటిక కాంతితో ప్రకాశిస్తూ, ధవళమైన వెలుగులాంటి సన్నని పట్టు చెల్లాను ధరించి, మెడలో నిండైన విరజాజి దండను వేసుకొని, సాక్షాత్తు చంద్రోదయ దేవతలా ఉందామె.

చంద్రాపీడుడు లేచి, వినమ్రత ప్రకటించగా, ఆమె కూర్చోమని భక్తితో సైగచేసి, నేలపైనే కూర్చొంది.

'అయ్యయ్యో! నా సేవలు గైకొనవలసిన మీరే మీ సేవలు గైకొనవలసిందన్నట్టు కూర్చుంటే ఎలా? ఇది నాకెంత అవమానం!' అన్నాడు-చటుక్కున చంద్రాపీడుడు.

ఆ మాటలను మదలేఖ అందుకొని—

'ఈ మాటలు మా దేవికెంత అవమానం! మీరతిథులే! మా చెలి మనస్సును దోచినవారే! ప్రాణమైనా ఆమె మీ పాదాలముందు ఫణమెట్టవలసినదే!' అని ఎత్తి పొడిచింది.

ఆమె మాటకారితనానికి మారు మాటాడక మౌనం వహించాడు—చంద్రాపీడుడు.

అంతట సిగ్గు దొంతరలు ఉప్పతిల్లగా కాదంబరి ఆయనను అనేక కుశల ప్రశ్నలు వేసింది. భారతదేశ భాగ్య చరిత్ర గురించి, తారాపీడ మహారాజు గురించి, విలాసవతి గురించీ ముచ్చటగా ఆయన చెప్పగా కొన్ని కథలు విని, ఆ వేళకు తానక లేచిపోయి, తన శయనాగారానికి వెళ్ళి పోయింది. ఆమె ఆజ్ఞాబద్ధులైన పరిచారికలు మాత్రం, చంద్రాపీడునికి సపరిచర్యలు చేస్తూ ఆ లతా మండపంలోనే నిద్రబుచ్చారు.

కాదంబరి సౌందర్యాన్ని తిలకిస్తూ జాగారం చేసిన చంద్రుడు మెల్ల మెల్లగా పొగడ చెట్ల గుబుర్లలోంచి చల్ల గాలిఅలలలో తేలిపోతూ తామరవనాలలోకి వెళ్ళిపోయాడు. రేయల్లా బాణాలు వేసి వేసి అలసిపోయిన మన్మథుని నిశ్వాసాల్లా పైరు గాలులు వీచసాగాయ్. చక్రవాక హృదయాల లోని అనురాగంవలె నివురు గప్పిన సూర్యబింబం ప్రాగ్దిశను అవతరించింది. చంద్రాపీడుడు లేచి స్నానం చేసి, తాంబూలం చేతబట్టి వైణికునితో అన్నాడు—

'వైణికా! కాదంబరీదేవి మేల్కొన్నదో లేదో కనుక్కొని రా!' అని.

వైణికుడు వెళ్ళి వచ్చి కాదంబరి, మహాశ్వేత చెంత కూర్చొని ఉన్నట్టు చెప్పాడు. బయలుదేరాడు — చంద్రాపీడుడు.

మహాశ్వేత చుట్టూ విష్టాగరిష్టులైన తాపసినులు కూర్చున్నారు. అందరూ విభూతి ధరించారు. చేతుల్లో జపమాలికలున్నాయ్. వల్కలాలతో గట్టిగా చనుకట్లు కట్టుకున్నారు. బ్రహ్మచర్య దీక్షతో ఆమెను కొలుస్తున్నారు. అంతఃపురం నుండి గంధర్వరాజు వస్తున్నాడు. అతడికి స్వాగతం ఇస్తున్నది మహాశ్వేత. ఆ ప్రక్క కాదంబరి ఉన్నది. ఆ వెనుక కిన్నర దంపతులు వీణాగానం చేస్తున్నారు. చంద్రాపీడుడు అచట ఒక ప్రక్క కాస్సేపు కూర్చొని, మహాశ్వేత ముఖం చూచి పకపక నవ్వాడు. ఆ నవ్వులోని అంతర్యం తెలుసుకున్న మహాశ్వేత కాదంబరితో అంది—

'సఖి! నీ చంద్రకిరణ ప్రకాశంలో చంద్రకాంత మణి వలె కరిగిపోయి, ఇతడు మనసులోనున్న మాటను చెప్పలేక పోతున్నాడు. ఇతడు తన పరివారాన్ని వీడి చాలా కాలమయింది. అక్కడకు పోవాలని కోరుతున్నాడు. అనుజ్ఞ ఇచ్చి పంపు!'

'అందుకభ్యంతర మేమున్నది చెలీ!' అంటూ గంధర్వ కుమారులను ఆయనను సాగనంపమని ఆజ్ఞాపించింది. వెంటనే వైణికుడు గుర్రం తెచ్చాడు. ఆ గుర్రమెక్కి చంద్రాపీడుడు బయలుదేరాడు. దారిలో ఏ గుట్టలు, పుట్టలు, చెట్టులు కనబడ్డా అక్కడల్లా కాదంబరే ప్రత్యక్షమైనట్టు తోచిందతడికి. దారిలో గంధర్వ కుమారులను వెనుకకు పంపి, తాను అనం

దంతో తన స్కంధావారంలో అడుగు పెట్టాడు. తన అను చరులంతా చేతులెత్తి నమస్కరించారు. వైశంపాయనుని తోనూ, పత్రలేఖతోనూ, మంత్రులతోనూ ఆ రాత్రల్లా గంధర్వలోక వింతలను గూర్చి, కాదంబరీ మహాశ్వేతలను గూర్చి వింత వింత కథలెన్నో చెప్పి నిద్రపోయాడు. నిద్రలో కూడా కాదంబరి గురించి కలవరమే. ఉదయాన్నే లేచి ఆస్థానంలోకి వచ్చినా, ధ్యాసంతా కాదంబరిపైనే. ఆ తరుణంలో వైణికుడు కనుపించి కాదంబరి పంపిన కానుకను సమర్పించాడు.

'కాదంబరి క్షేమమేనా?'

'క్షేమమే రాకుమారా! తన క్షేమానికి చిహ్నంగా యీ కానుకను తమకిమ్మంది. అందులో ఆమె అజ్ఞాత కోర్కెలుంటాయ్. చూడండి!' అని అందించాడు.

తడిబట్ట కప్పిన తామర దొన్నెలోంచి, చందనం ముద్దపై బాలమృణాల వలయాన్ని అభిజ్ఞంగా మాత్రించిన దాన్ని చంద్రాపీడునికే సమర్పించాడు.

అది విప్పి చూచాడు — చంద్రాపీడుడు.

చందనం ముద్దతోపాటు, అందులో చిలుకలేత చెక్కిళ్ళ లాంటి తమలపాకులు, పాలు గారుతున్న పావుచెక్కలు, నెలవంకలాంటి తెల్లని కర్పూరం ఉన్నాయ్.

వాటిని సమర్పించి వైణికుడు అన్నాడు—

'రాకుమారా! కాదంబరి వెలుగులు చిందే కోమల హస్తాలతో నమస్కరిస్తున్నానని చెప్పమన్నది. మహాశ్వేత ఇలా చెప్పమన్నది — 'నీవు వెళ్ళిన తరువాత ఇక్కడ గంధర్వలోకంలో వాన కురిసి వెలిసిపోయినట్టయింది. కాదంబరి బెంగపెట్టుకొని చిక్కిపోయింది. ఉదారుల ఆదరమే ఆనందానికి హేతువు. దయవుంచి, ఒకసారి వచ్చి ఆమెను చూడు! చనువును ఉపయోగించుకుంటున్నందుకు అన్యథా భావించకు!' అని. 'మీరు వెళ్ళిపోతూ పడకపై మరచిపోయిన శేషహారాన్ని మీకు ఇమ్మని ఇచ్చినది,' అంటూ ఆ హారాన్ని చంద్రాపీడునికి ఇచ్చివేశాడు.

అటువంటి పరిజనులను మరలొకసారి సందర్శించే భాగ్యం కలిగినందుకు ఎంతగానో సంతసించి, కాదంబరి పంపిన చందనం ముద్దను వొంటికి పూసుకుని, పచ్చకర్పూరం తాంబూలం వేసుకొని మహాశ్వేత పంపిన శేషహారాన్ని ధరించి, భటులకు ఇంద్రాయుధాన్ని సన్నద్ధం చేయమని, వైణికుడ్ని ప్రశ్నించాడు—

'వైణికా! నే వచ్చాక గంధర్వలోకంలో జరిగిన సంగతులను వివరం చేయ్. కాదంబరి ఏం చేసింది? మహాశ్వేత ఎలా ఉంది? మదలేఖ ఏమంటుంది? నా గురించి ఏమైనా అనుకున్నారా?'

'అనురాగోపశమా రాకుమారా! మీరు గుర్రాన్నధిష్టించి వెడుతుండగానే, కాదంబరీదేవి తన సౌధశిఖరమారోహించి, అశ్వపద ధూళితో కప్పబడిన మీ మార్గాన్నే రెప్పవాల్చక చూడసాగింది. ఆమె కపోల లావణ్యం జారిపోయింది. చిరునవ్వు కరిగిపోయింది. హృదయం ద్రవించిపోయింది. ఆ సౌధోపరిభాగంపై చాలాసేపు దిగాలుపడి నిలచిపోయింది.

'ఖేద మనస్కురాలై సఖిజనంతోడు వెళ్ళగా 'ఇదిగో యీ మరకత శిలలో దొలిచిన మొసలి నోటినుండొచ్చే నీటితో తడుపుతున్న పొదరింటిలోని యీ స్ఫటిక శిలావేదికపైనే ఆ రాకుమారుడు కూర్చున్నాడనీ, ఇక్కడే ఈ జలధార వద్దనే స్నానం చేశాడని, ఇక్కడే సెలయేటి ఒడ్డున శివుని పూజించాడనీ, ఈ చందన మలందిన ముత్యాల శిలపైనే ఆయన పవ్వళించాడని ఏమేమో చెప్పుకుంటూ ఆ స్మృతులను, గుర్తులను జ్ఞప్తికి తెచ్చుకుంటూ పగలల్లా అక్కడే గడిపింది. సాయంత్రపు ఆహారం — ఆ మణిమండపంలోనే మహాశ్వేత బలవంతంపై తీసుకొంది. అరచేతుల్లో చెక్కిళ్ళు పెట్టుకొని అరమోడ్పు కన్నులతో ఏమేమో ఆలోచిస్తూ మౌనం వహించేది. మరల కోల్కొని. చంద్రకాంతులు గోళ్ళపై త్రుళ్ళుతుండగా మందగమనంతో మోయలేక, మోయలేక మోస్తున్న శరీరంతో శయనమందిరానికి వెళ్ళిపోయింది. ఆ రేయి ఆమె మనోవికలత ఇక నేను చెప్పలేను దేవా! ఆ ఉదయమే నన్ను ఇక్కడకు పంపింది.'

ఆ మాటలు విన్నాక ఒక్క క్షణంకూడా రాకుమారుడు అక్కడ ఆగలేదు. భటులు తెచ్చిన ఇంద్రాయుధ మెక్కి త్రుటిలో గంధర్వలోకంలో వాలిపోయాడు.

వాలీ వాలగానే, తన కెదురైన కంచుకిని 'ఎక్కడ కాదంబరీదేవి?' అని అడిగాడు.

'మత్తమయూర నివాసమైన క్రీడా శైలం క్రింది తామర తోటలోని హిమ మందిరంలో ప్రభూ!'

వెంటనే హిమమందిరం వద్దకు చేరుకున్నాడు. తామర తూండ్లు పట్టుకొని, మొగలిరేకులు చెవుల కమ్మలుగా పెట్టుకొని, నుదుట చందనం అలందుకొని, సౌభాగ్యవతులుగా నున్న కాదంబరి చెలికత్తెలు ఆయనకు కనబడ్డారు. ఎండ తగులకుండా, కలువలూ, పూవులూ, అరటాకులూ, తామ రాకులూ, పూలగుత్తులూ, గొడుగులుగా వారు పట్టుకున్నారు. అటువంటి శీతలపరికరాలతోనే కొందరు పరిచారికలు కాదంబరికి సైత్యోపచారాలు చేస్తున్నారు. చంద్రాపీడుడు ఆ ఎదుట ప్రత్యక్షంకాగానే శిరస్సులు వొంచి నమస్కరించి ప్రక్కకు తప్పుకున్నారు.

అక్కడే చందన గంధం ప్రవహించే కలువకొలను వొకటుంది. చుట్టూ, అప్పుడప్పుడే కోసితెచ్చి వేడికి నల్లబడ్డ తామరాకు దొంతరలున్నాయ్. జలయంత్రాలపై నెమళ్ళు గెంతుతున్నాయ్. మధ్య ఎర్రతామరల పరుపులా ఇసుక తిన్నె ఉంది. లతా పల్లవాల ఊయెలలు, మొగలి రేకుల దోనెలు,

తామరతూండ్ల శెద్దూ ఉన్నాయ్. ఒక్క ముక్కలో చెప్పా లంటే, మాఘమాస రాత్రులకూ, వర్షఋతు దివసాలకూ అది ఆటపట్టనదగినంత శీతల ప్రదేశం.

ఆ ప్రదేశంగా, జలజల పారుతున్న గంగా ప్రవాహంలా కాదంబరి పవ్వళించి, వక్షోపరి భాగంపై తడిసిన తామర పత్ర ములు కప్పుకొని, విరహాగ్ని జ్వాలలతో మండిపోతోంది. అలంకారాలు లేవు. మణిభూషణాలు లేవు. అన్నీ పూలే. పూల సంకెళ్ళతో మన్మధుడామెను కట్టి పడవేశాడా అని పిస్తోంది. చందనం పూసిన ఆమె లలాటం, చంద్రుడు స్పృశించి నటులుంది. కనులలో నీరు కారుతుండడాన్ని చూస్తే వరుణు డామెను చుంబిస్తున్నాడా అనిపిస్తుంది. ఆమె నాసికా రంధ్ర ములనుండి వెడలే వేడి నిట్టూర్పులు, వాయుదేవుని వేసవి గాడ్పులేమో అన్నట్టున్నాయ్.

పగవారికైనా వొద్దా విరహతాపం! బ్రతుకే కన్నీటి మయం! ఆమె చనుకట్టుపైని పయ్యెద సంతాపంతో మాటి మాటికీ జారిపోతోంది. ఆమె కుచములపై ప్రతిఫలించే ఆమె ముఖమే, కన్నీరు కారుస్తూ ఆమె స్థితికి జాలిపడుతున్నట్టుంది. మెడలో ధరించిన పూలహారాలు కూడా మదనపరవశమై, భీతిచెంది ఆమెను కౌగలించుకుంటున్నాయి.

ఇకామె మనోవికారం వర్ణనాతీతం! మలయమారుతానికి అరచేతులతో ఆనకట్టవేయ సంకల్పిస్తోంది. కుసుమగంధంతో ఎదురువీచే చల్లగాలికి ముఖం అదోలా త్రిప్పుకుంటోంది.

పుష్ప బాణాఘాతాలకు మాటిమాటికీ దొరలుచున్నది. పరి
చారికలు 'అదుగో! రాకుమారుడు!' అంటూ ఓదారుస్తు
న్నారు. ఆ మరుక్షణంలోనే మళ్ళీ నిరాశ! హాతాశ!

ఇక కాదంబరి సహనాన్ని కోల్పోయే స్థితిలో ఆ ఎదుట
చంద్రాపీడుడు సాక్షాత్కరించాడు. వెంటనే మదలేఖ
రత్నాలు దాపిన బంగారు పీఠాన్ని తెచ్చి వేసింది. కాని
దాని నాయన కాలితో నెట్టివేసి క్రిందనే కూర్చున్నాడు.

ఆ మదన తాపాన్ని వైణికుని చే విన్నాడు. ఇప్పుడు
కళ్ళారా చూస్తున్నాడు. అయినా ఇంకనూ ఆశ్చర్యమే
ఆయనను ముంచెత్తుతోంది. ఆ ఆశ్చర్యాన్ని తొలగింప
కుందామని ముఖతః కాదంబరినే అడిగాడు —

'దేవీ, నీసంతాపం నీకంటే మమ్ముల నెక్కువ నేధి
స్తోంది. నీ సంతాప నిర్మూలనకు నే నేమి చేయడానికైనా
సిద్ధంగా ఉన్నాను. అసలా సంతాప హేతువేమిటో దయ
వుంచి చెప్పుతావా?'

ఆ మాటలోని ఛలోక్తిని అర్థం చేసుకొని ఆ ముగ్ధరాలు
ఒక చిరునగవు చిందించి, మౌనం వహించింది — సిగ్గుతో.

మదలేఖ అందుకొంది—

'రాకుమారా! ఏమని చెప్పగలము. యౌవనప్రాయంలో
అడుగుపెట్టే బాలకదా మా చెలి! సుకుమారమైన తామర
తీవెకు వెన్నెలకూడా ఎండలాగే తగలడం సహజమని తమకు
తెలియనిది కాదుగదా!'

తన ఛలోక్తిని మించిన చమత్కృతి అది. దానికి రాకుమారుడూ మాట్లాడలేకపోయాడు. మహాశ్వేత మాత్రం ఆ మాటా యీ మాటా మాట్లాడి పొద్దు వెళ్ళబుచ్చింది. ఇక రాకుమారుడు సెలవు గైకొని, తన స్కంధావారానికి పయనమగుటకు గుర్రమెక్కుతున్నాడు. వైశికుడు పరుగెత్తుకొచ్చి—

'దేవా! దేవా! మదలేఖ 'పత్రలేఖ'ను ఒకసారి పంపమని చెప్పినది. తొలి కలయికలోనే ఆమె కాదంబరీదేవి ప్రేమను చూరగొన్నదట.'

'అలాగే, అందుకామె తగినదని తే! అంటూ గుర్రమెక్కి తన శిబిరానికి చేరుకున్నాడు — చంద్రాపీడుడు.

అతెడింకా గుర్రం దిగనే లేదు. ఉజ్జయిని నుండి తన తండ్రి పనుపున వార్తాహరుడు ఒక లేఖను తెచ్చి సిద్ధమయ్యాడు. గుర్రంపై ఉండగానే తక్షణం తనను ఉజ్జయిని ఇంటికి రమ్మన్న ఆ లేఖను చదువుకొని ప్రక్కనే అశ్వాన్నధిరోహించి ఉన్న సైన్యాధికారి బలాహూణుని పుత్రుడు మేఘనాథునితో అన్నాడు—

'మేఘనాథా! వైశికుడు పత్రలేఖను తీసుకొని వస్తాడు. ఆమెను వెంట బెట్టుకొని నీవు రా! వైశికునితో నా మాటలు కాదంబరీదేవికి చెప్పమను! 'కాదంబరీదేవీ! నేను విస్వాసఘాతుకుడ్ని. వంఛితుడ్ని. అన్ని శక్తులకంటే నా తండ్రియాజ్ఞ నాపై బలీయంగా పని చేస్తుంది. ఆ ఆజ్ఞ రీత్యానే నిప్పుడు ఉజ్జయినికి వెళ్ళిపోతున్నాను. నా బ్రతుకున్నంత

వరకూ నా జీవం నీ చరణారవిందాల చుట్టూనే తిరుగుతుంది. కాని నా ఆశను మాత్రం ఇక నీవు పెట్టుకోకు! మహాశ్వేత నా గుణ గణాలను పొగిడి, నీ మనస్సును పాడుచేసింది — అందుకు ఆమెను నిందించకు! దానికి బాధ్యుడను నేను. అందుకే సిగ్గుతో క్రుంగి పోతూ నీకీ సందేశం పంపుతున్నాను. ఇక నన్ను తలచుకోకు! అందరికీ వందనాలు!'

వైశంపాయనునికి స్కంధావారమప్పగించాడు. గుర్రాన్ని అదిలించాడు. ఇంటి ముఖం పడుతున్న గుర్రమేమో! ఉత్సాహంతో ముంగాళ్లు నేలను జీరి, ఒక్కసారి పరిశీలించింది. దానితో బ్రహ్మాండం అదిరింది. సేనలు కదిలిపోయాయ్.

చంద్రాపీడుడు నగరాభిముఖుడై పోతుండగా దారిలో ఒక నిర్జన అరణ్యం కనబడింది. అందులో ప్రవేశించాడు.

అది కారడవి. ఏనుగులు విరచి పారవేసిన చెట్లు అడ్డదిడ్డంగాబడి వున్నాయ్. వేటగాళ్లు తవ్వుకున్న మాటుల గోతులు అక్కడక్కడున్నాయ్. పాడుపడిన నవబావులున్నాయ్. ఆ నీరెవ్వ డెవడూ త్రాగేవాడు లేడు. ఆశూన్యాటవిలో పగలల్లా ప్రయాణం చేసాడు—రాకుమారుడు. ఎక్కడ చూసినా కొమ్మలుకొట్టివేసిన కడిమిచెట్లూ, మోదుగచెట్లూ, గుబురుచెట్లూ కనబడ్డాయి. ఆ వన ప్రదేశంలో ఒక రక్త చందనం చెట్టు, చివర ఒక పెద్ద రక్తధ్వజం కట్టబడి ఉండడం చంద్రాపీడునికి అల్లంత దూరానే కనిపించింది. పచ్చిమాంసం

లాంటి లత్తుక ముద్దలతో, ఎర్రని నెత్తురులా రక్తచందన రసంతోనూ తప్తమై అది అరుణారుణంగా కనబడుతోంది. గవ్వలతో అర్ధ చంద్రాకారంగా ఆ ధ్వజం చివర ఒక ఆభరణముంది. ఆ ధ్వజం చివర ఒక తళతళ మెరిసే త్రిశూలముంది. అది ఆకాశాన్ని గుచ్చెత్తుతున్నట్టుంది. ఆ త్రిశూలం మొనకు ఒక గొలుసు, ఆ గొలుసుకు ఒక బ్రహ్మాండమైన గంట ఉంది. ఆ ధ్వజం దేవికై నైవేద్యాలు తెచ్చేవారి కోసం ఎదురు చూస్తున్నట్టు రెపరెప లాడుతోంది. ఆ ధ్వజానికి తిన్నగా చంద్రాపీడుడు కొంత దూరం వెళ్ళాడు. అక్కడ మొగలి రేకులా తెల్లనైన ఏనుగు దంతంతో చేసిన కవాటం కనబడింది. సింహద్వారానికి ఒక మెరుస్తున్న తోరణముంది- నెత్తురు చిందుతున్న అటవీ జాతుల శిరస్సులవలె కనబడుతోంది.

అది చండికాలయం. ఆలయానికి ఎదుట బలిపీఠ ముంది. ఆ పీఠంపై దున్నపోతు ఆకారంలో ఒక కాంస్య విగ్రహ ముంది. దానిపైని నెత్తురు మరకలను ఒక నక్క నాలుకతో స్పృశిస్తోంది. చండికపై అనేక పూవులు పడివున్నాయ్. అవన్నీ కారుదున్న కనులవంటి కలువలు, నెత్తురుతో తడిపిన పులి గోళ్ళవంటి మోదుగులు.

మరోకప్రక్క మెలికలు తిరిగిన జింక కొమ్ముల కుప్ప. ఆ ప్రక్క రక్తమయమైన నేల. రక్తపానం చేసినట్టు చాచిఉన్న చండిక నాలుక! అవన్నీ చూస్తే అక్కడ ఎన్నో రక్తబలులు

జరిగినట్టు ఇక్కడ అర్థమైపోతుంది. చుట్టూ ఉన్న అశోక వృక్షాల తలలు కుక్కలకు భయపడి, తలదాచుకో వచ్చిన కోళ్ళ తలల్లా కనబడుతున్నాయ్. బలిరక్తం తాగుదామని ఆశతో వచ్చిన భేతాళ శక్తుల్లా, ఆ చుట్టూ తాటి చెట్లు నిలిచి వున్నాయ్. ఆ భయంకరమైన బలులనుగాంచి వొణికిపోతూ, ఆరెటి, బిల్వవృక్షాలు గజగజలాడుతున్నాయ్. క్రింద పారు తున్న రక్తంలో సూర్యుడు ప్రతిఫలించి, ఆ బలులకు, కళ్ళు తిరిగిమూర్ఛచెంది అక్కడ పడిపోయినట్టు కనబడుతున్నాడు. దేవి విగ్రహం, పేగులు వ్రేలాడుతున్న గుడ్డపేలికల్లా పాదాల పైకి పడుతున్నాయ్. ఆమె తల వెంట్రుకలు దట్టంగా భయం కరంగా వ్రేలాడుతూ చిమ్మ చీకటి క్రమ్మిన కారడవిలా ఉంది. ముఖం రౌద్రంతో నిప్పులు గ్రక్కుతోంది. లలాటంపై బంగారపు రేకు ఉంది. దానిపై శబరస్త్రీలు పూసిన సింధూరం దగద్ధగాయంగా వెలుగొందుతోంది. ఆ విగ్రహం చుట్టూ సింహాపు పిల్లలు తిరుగుతున్నాయ్.

మహోగ్ర ప్రళయమూర్తి అయిన ఆ చండిక ముందు ఆమెను పూజిస్తూ ఒక వృద్ధుడు మౌనంగా కూర్చున్నాడు. అతడి శరీరం నల్లగా నరాలతో వుబ్బిఉంది. చెవులదాకా వ్రేలాడుతున్న జడలు రుద్రాక్షమాలల్లా కనబడుతున్నాయ్. ఎన్నిసార్లు, ఎన్ని సంవత్సరాలు ఆచండిక ముందు సాష్టాంగ పడ్డాడోగాని, అతడి నుదురు బొప్పికట్టింది. రెండు కళ్ళలో ఒకటి లేదు. ఎవడో సిద్ధుడు సిద్ధాంజనమని యిచ్చి వాడికా

కన్ను పొగొట్టాడు. అతడి ప్రక్క ఒక పెట్టె ఉంది. అందులో ఓషధులున్నాయ్. సరిగ్గా శుద్ధిచేయని రసాయన మేదో త్రాగాడనుకుంటాను. వాడికి కాలజ్వరం పట్టుకొంది. వాడి తల వూగుతుంటే, జోరీగల సంగీతంలా వినబడుతోంది.

ఇంతకీ వాడు ముసలివాడు కాదు. ఈ దక్షిణాపథాన్నం తనూ ఏలాలని, మహదైశ్వర్య సంపన్నత సిద్ధించాలని, రాగిని బంగారుగా మార్చివేయాలని, దేవకన్యలను పొందాలని ఎన్నెన్నో కోర్కెలు వాడికున్నాయ్. ఆ కోర్కెల కోసం, చుట్టూ కొన్ని సామానులు పెట్టుకున్నాడు. బొగ్గులమసి ఒక శంఖంలో ఉంది. దుర్గ స్తోత్రాలు రాసిన రేకు ఒకటి ఉంది. ఏనాడో అడుగంటిపోయిన మనుష్య రక్తంతో హోమాలను చేసే పాశుపతోపదేశం లిఖించిన తాళపత్రగ్రంథమొకటుంది. అతడు ఘోటక బ్రహ్మచారి. ముక్కోపి. అక్కడకు ఇతర దేశాలనుండి వచ్చిన అనేక మంది బాటసారులపై స్త్రీ వశీకరణ బూడిదచల్లి, కొన్ని ప్రయోగాలు చేసినవాడు. తాను అంబికపై వేసినపూలు క్రిందికి దొర్లిపోతే, కోపం పట్టలేక చండికపై కారాలుమిరియాలూ నూరిన ప్రబుద్ధుడు. మూర్ఖుడు! నమ్మినదాన్ని అదెంత ఘాతుకమైనా చేసి తీరుతాడు. మనిషి పొట్టి-చెవిటి. అందుకే సైగలతో వ్యవహరిస్తాడు. రేచీకటి ఉండటంవల్ల పగలే తిరుగుతాడు. వట్టి తిండిపోతు! అయినా తిండి లేక ఎన్నోసార్లు ఆ చండికాలయంలో కోర్కెల సిద్ధి

కోసం కటకట కాలిపోతూ ఉపవాసాలు చేసాడు. కాని ఫలితం శూన్యం. నిత్యం పూజలు చేస్తూనే ఉన్నాడు-ముసలి వగ్గు.

సరిగ్గా అక్కడికే ఆ రాత్రి కాలక్షేపం చేద్దామని చంద్రాపీడుడు వచ్చి, గుర్రం దిగాడు. ప్రశాంత ప్రదేశం కోసం చుట్టూ చూచాడు. కాదంబరీ విరహంతో దహించిపోతున్న రాకుమారునికి ఆ ముసలివగ్గు ఆకారంచూచి నవ్వు వచ్చింది. అతడిని పలుకరించాడు. ఏవేవో కబుర్లు చెప్తుతూ కాలం గడిపాడు. అతడి సైన్యాలుకూడా, అక్కడే చుట్టూ ఆ రాత్రి నిద్రపోయాయ్. చాలాచోట్ల నెగళ్ళు వెలిగించారు. బల్లేలను పాతి, వాటికి గుర్రాలనుకట్టారు. నిద్రలో రాజకుమారుడు, హేమకూట ప్రదేశంలో విహరిస్తున్నాడు. కాదంబరి కానుకగా యిచ్చిన శ్వేతహారాన్ని ముద్దు పెట్టుకుంటున్నాడు. కాదంబరి ప్రక్కనే కూర్చున్న పత్రలేఖను అభినందించాడు. అలా ఆ రాత్రి గడిపి, శుభోదయం కాగానే లేచాడు. ఆ ఆ ముసలివగ్గు కోరిన ధనమిచ్చి, తన సైన్యంతో అక్కడక్కడ విశ్రాంతి తీసుకుంటూ ఉజ్జయిని చేరుకున్నాడు.

ఆయన రాకకోసమే ఎదురు చూస్తున్న పరిజనం ఆనంద పరవశులై పోయారు. తారాపీడ మహారాజుకు పట్టరాని సంతోషం కలిగింది. ఆనందాశ్రువులు ముత్యాల్లా దొరలుతుండగా, కుమారునికోసం ఎదురు వెళ్లాడు.

తండ్రిని అల్లంతదూరాన చూడగానే చంద్రాపీడుడు ఆయన పాదాలకు నేలకు వొంగి నమస్కారం చేసాడు.

'నాయనా!' అంటూ తారాపీడుడు పుత్రుని గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు. చేసుకుని విలాసవతి మందిరానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ దిగ్విజయ యాత్రకు సంబంధించిన కథలతో చాలాసేపు కాలక్షేపం చేసి, వైశంపాయనునితో మంత్రి భవనానికి వెళ్ళి, శుకనాసుని, మనోరమాదేవినిగాంచి నమస్కరించాడు. తదుపరి తన భవనానికి విచ్చేసాడు.

కాదంబరిలేని ఆ భవనం, ఆ లోకం, అన్నీ అతడికి చీకటిగానే కనబడుతున్నాయ్. చేయాలన్నది చేయలేకపోతున్నాడు. నిద్రరాదు, ఆహారం సహించదు. తను తనలో లేడు. ఇలా కొన్ని రోజులు గడిచాయ్. ఒకరోజున సర్వసేనాని మేఘనాధుడు పత్రలేఖతో వచ్చి తనకళ్ళముందు కనబడ్డాడు. చంద్రాపీడునిలో చిరునవ్వు మొలకలెత్తింది. వసంతవృక్షంలా వికసించసాగాడు. పత్రలేఖ తనకెంతో ప్రియ స్నేహితురాలు. అందులోనూ కాదంబరి చెంతనుండివచ్చింది. తనెంత అదృష్టవంతుడు! ఎదురేగి ఆమెను ఆలింగనం చేసుకున్నాడు.

'పత్రలేఖా! మహాశ్వేత, కాదంబరీ, మదలేఖా అంతా క్షేమంగా ఉన్నారా?' అని ప్రశ్నించాడు.

'అంతా క్షేమమే రాకుమారా!'

'కాదు - వివరంగా చెప్పు!'

'వినండి! మీరు వైశంపాయనునితో పాటు వెళ్ళిపోయాక, నేను కాదంబరి పూలపాన్పు చెంత కూర్చున్నాను. నన్నామె కళ్ళలో పెట్టి పూజించుకుంది. సాయం సమయమయింది. అలా బృందావన వైభవంతో తులతూగే, ప్రమదావనంలో మణి స్తంభంవద్ద కొచ్చాం. అందులో ఆమె విగ్రహాన్ని చూసాను. నేను ముందుండడంవల్ల వెనుకకు తిరిగి కళ్ళలోకి చూస్తే ఆమె సిగ్గు పడవచ్చుగదా! కాని విగ్రహంలోనే ఆమె సిగుపడు తోంది. నాతో ఏదేదో చెప్పాలనుకుంది. తటపటాయిస్తోంది. ఆమె మనోవికాసాన్ని గమనించి 'తటపటాయిం పెందుకు? మనసులోని మాటను చెప్పగూడదూ?' అని అడిగాను. చెబు దామనే ఆమె ప్రయత్నించింది. కాని, మన్మధుడు ఊపిరి తిరక్కుండా ఆమెపై బాణాలు విసురుతున్నాడు. అటువం టప్పుడు ఆమెకు చెప్పడానికి అవకాశ మెక్కడిది! అక్కడికీ తన అందెల రవళితో, రాయంచలను సాగనంపింది. నెమళ్ళను పొమ్మన్నట్లు సహం కొరికిన తాంబూల మడుపును అందిం చింది, మళ్ళీ చెప్పడానికి ప్రయత్నించింది. చెప్పలేకపోయింది. చెక్కిట మాత్రం, ఉసిరిక కాయలంతటి కన్నీటి బిందువులు జారాయి. అప్పుడామె మనోవైఖరి విచిత్రమైనది. ఆమె సిగ్గు వద్ద సిగ్గే సిగ్గును నేర్చుకొంది. ముగ్ధత్వం ముగ్ధతను అలవరచు కొంది. భయం, వాణకును—విలాసాలు. రసికతను - విషాదం,

ఖేదాన్ని-వినమ్రత, వినయాన్ని నేర్చుకున్నదంటే నమ్మండి. నేను మళ్ళీ ఆ మనసులోని మాట చెప్పమని అడిగాను. అబ్బే! ఒక గాథ నిట్టూర్పు, కనుకొలకులలో నిలచిన, కన్నీటి బిందువులను కొనగోటితో చిందడం తప్ప, నోటమ్మట ఒక్క మాటకూడా రాలేదు. నేను బలవంతం చేశాను. నా భుజం పైని, బావురుమంటూ వాలి—

'పత్రలేఖా! నీవు నా పరిజనులందరికంటే మక్కువైన దానవయ్యావే. అమ్మ, నాన్న. మహాశ్వేతా, మదలేఖా వీరందరికన్నా ఎక్కువైనదానవు. నీతో తప్ప, ఇక నా జీవిత విషాదాన్ని ఎవరికి చెప్పుకోగలను? సఖీ! నేను సిగ్గును చంపుకున్నాను. వంశాన్ని నిర్వంశం చేసుకున్నాను. పెద్దలూ, తల్లిదండ్రులూ ఎవ్వరూ అనుమతించలేదు. బాల్య చాపల్యం నన్ను అధోగతికి తీసుకుపోయింది. ఇప్పుడు నేను ఏముఖంతో నావారిని చూడగలను. పంచప్రాణాలు అప్పగించిన ఆ చంద్రాపీడ రాకుమారుడే, నా ప్రేమను కాలదన్ని తనవారి మాటలను శిరసావహించి వెళ్ళిపోయాడే! ఇప్పుడు నగుబాటు పాలు కావడం తప్ప నాకు గతేమిటి? నమ్మినందుకు, మీ వయస్యుడు ఇలా చేయతగునంటావా? పోనీలే! పత్రలేఖా! నా పాపాలను ఆత్మాహుతితో కడుక్కుంటాను. జన్మంటూ ఉంటే మళ్ళీ జన్మలో మనం కలుసుకుందాములే!' అన్నది.

ఇక ఇప్పుడు నా గుండెల్లో భూకంపం పుట్టింది. భయ కంపితురాలనై పోయా. 'అమ్మా! దయవుంచి మా రాకు మారుడు నీకే అన్యాయం చేసాడో చెప్పగలవా?' అని అడిగాను.

ఆమె కొనసాగించింది—

'అన్యాయమని నెమ్మదిగా అంటున్నావా? నన్ను ఒదిలి పెట్టి వెళ్ళిపోయి కూడా నిద్రలో వస్తున్నాడు. తన అను రాగంతో నా పాదాలకు పారాణి వేస్తున్నాడు. ప్రేమలేఖ లను పంపి, నన్ను రతిసుఖంలో తేలియాడిస్తున్నాడు. ఒంటిగా ఉరేసు పట్టుకుంటాడేమోనని పొదరిళ్ళ మధ్యనుండి నేను పరు గెత్తుకు పోయినప్పుడు, ఏ ముళ్ళు గ్రుచ్చుకోనో నా చను వల్కలాలు చిక్కిపోతే, తటాలున వచ్చి నా వక్షాన్ని తన వక్షానికి అదుముకుంటున్నాడు. నా హృదయంపై మకరికా పత్రాలు దిద్దుతున్నాడు. మధువును పుక్కిలించి నాచే త్రాగి స్తున్నాడు. కామాంధుడై నన్నెన్ని అతడు చేసినాడో చెప్పా టకు నోరాడకున్నది — ఎంత ఆగడం మీ రాకుమారునిది ?' అని కాదంబరి అనగానే, పట్టలేనంత సంతోషం నాలో పొంగి పొర్లింది. ఈమె నా రాకుమారుడ్ని ఎంతో గాఢంగా ప్రేమి స్తున్నందున మురిసిపోయాను. ఇక చంద్రాపీడుడు తన యౌవ్వన విలాస లేఖినితో చందమామపై సువర్ణాక్షరాలు లిఖించినట్టే. మలయమారుతానికి చక్కని సమయం లభిం

చింది. వసంతానికి అదును వచ్చింది. లావణ్యాకాంతులు ఇక అమృత వర్షాన్ని కురిపించబోతున్నాయ్. ఏమని చెప్పను రాకుమారా! నా తలపులు తటాలను అధిగమించాయ్. మళ్ళీ కోలుకొని కాదంబరితో అన్నాను—

'అయితే ఇందులో చంద్రాపీడుని తప్పేమున్నది—కాముని కాఠిన్యం తప్ప?'

'ఎవరా కాముడు?' ఆమె అడిగింది.

'అతడికి రూపం లేదమ్మా! అతడు జ్వలింపజేసే కామ జ్వాలలు, అతడు వేసే బాణాలు అన్నీ నిరాకారాలే. ఆయన బాణాలు ప్రవేశించని గుండెలుగాని, అంతఃపురాలు గానీ ఏమీ ఉండవ్. అతడా కాఠిన్యం వహిస్తే చాలు. ప్రేమికు లకు పండుగ! తమ గాథలను తలచుకొని అనంత కాలాన్నే అవలీలగా గడిపి వేస్తారు.'

'అయితే కాముడు నాయెడలనే ఇంత కాఠిన్యం వహించి ఆయన యెడల ఉపేక్ష భావంతో ఎందుకున్నాడు? ఆతడి వికారాలన్నీ నాలోనే కనబడుతున్నాయ్. అవన్నీ మరచిపో పత్రలేఖా! ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్ చెప్పు? అని అడిగింది.

'చేయడానికేముంది? పూజించకనే మన్మథునివల్ల నీవు వరాన్ని పొందావే. ఇక నీవు ఖిన్నురాలవు కానవసరంలేదు. నేను ఆయనను కలుసుకోడానికి వెడతాను. అప్పుడు నీవు

ఒక సందేశాన్ని పంపు. నీ ప్రియుని తెచ్చిపెట్టి నీ ముందుంచే బాధ్యత నాదప్పుడు.'

ఆమె కళ్ళు వికసించాయ్-చంద్రాపీడా! వుబ్బి తబ్బిబ్బై నన్ను త్రాగివేస్తున్నట్లుగా చూచి అన్నది—

'అయితే నేనేమని సందేశం పంపను? ఆయనకు నేను ఇష్టమనడం తెలివి తక్కువతన మవుతుంది. పోనీ, కాముడు నన్ను పీడుస్తున్నాడని రాయనా, అది ఆత్మదోషం. మన్మథుడు నన్ను నీకు దానమిచ్చాడననా, అది ఆయనను చేరడానికి నేను పన్నిన మాయోపాయమవుతుంది. పోనీ బలవంతంగా, నిన్ను నేను కైవసం చేసుకున్నానని అననా అది వెలయాలిమాట అంటారు. పత్రలేఖా! యీ జీవనమే దుర్భరమైపోతోందినాకు. ఇలా అని అంటే, అది ప్రేమాతిశయమవుతుంది. ఏమని పంపమంటావ్ సందేశం?

'పంపినా అక్కడ ఆయన ఏ రాజ్యతంత్రపాలనలో చిక్కుకొని వుంటారో! జన్మభూమిపై మమతను వీడలేనంటారో, ఏమని చెప్పను? నీవు ఎంత ప్రాధేయపడినా రాకపోవచ్చు. రావడానికి అంగీకరించినా ఇంతకు ముందు నన్ను చూచిన కళ్ళతోనే మళ్ళా ఇంతలో ఎందుకని అభిప్రాయపడవచ్చు. అబ్బ! పత్రలేఖా! నాకాలోచన తట్టడంలేదు. కాని ఒకటి మాత్రం నిజం! నేను మహాశ్వేతకు మాటిచ్చిన ప్రకారం, ఆమె విరహిణిగా అవివాహితగా ఉన్నంత కాలం పెళ్ళి చేసుకోను.'

'అలా అనుకోవద్దు కాదంబరీ!'

'ఏమనుకోడానికైనా ఏముంది పత్రలేఖా ! వొద్దులే ! తయనిక్కడకు రానద్దు. నేనిలా కలల్లో, నిద్రలో, విరహంలో, ఆ రాకుమారుని ఏ క్రీడాశైలంపైనో. సెలయేటి యిసుక తిన్నెపైనో, వసంత మండప స్ఫటికశయనాలపైనో చూచు కొని హతమారిపోతాను.'

అని కనులు మూసిందామె. అప్పుడు ఆ కనులనుండి రెండు వేడి కన్నీటి బాష్పాలు ఆమె చనుకట్టు పై నుండి చర్రున జారాయ్, ముకుళించిన పద్మంలా ముఖాన్ని మూడుచుకొంది.

అప్పుడు నే ననుకున్నా.

ఆహా! ఈ కామపిశాచం ఎంత కఠినాత్మురాలు! — ప్రియుడంటే స్త్రీకి పంచప్రాణాలుగదా ? కన్యత్వం చెడని ఆ స్వప్న స్పర్శలూ, ఆలింగనాలూ, ముద్దులూ, ఆహా ! భావనా ప్రపంచంలో రెక్కల గుర్రంలా పరువులెత్తే ఆ ప్రణయాన్ని ఏమని వర్ణించను !

ఇంతలో అనురక్తమైన కాదంబరి మనసులోని మర్మం బయట పడ్డదన్న సిగ్గుతో సూర్యుడు పారిపోయి, పడమటి కొండల్లో అస్తమించాడు. సుగంధ తైలం పోసిన కాగడా లను పట్టుకొని గంధర్వ కన్యలు తిరిగారు ఆ కాంతులు

కాదంబరిపై పడి మన్మథుడు పుష్పశర బారికి ఆమె మేను కందిపోయినదా అనిపించి, నేనన్నా—

'దేవీ! కాస్త ఆవేశాన్ని అణచుకో! ఖేదపడకు! నేను వెళ్ళి చంద్రాపీడుడ్ని చిటికెలో తీసుకొస్తా.'

ఆమెకు మరల ఆశ చిగిర్చింది - చుట్టూ చూచి—

'ఎవరక్కడ?' అంది.

'ఏమి ఆజ్ఞ?' అంటూ, కలకలా రావంచేసే కలహంసల్లా అనేక మంది సఖులు ఆమెను చుట్టు ముట్టారు. అప్పుడు కాదంబరి నన్నుచూచి 'పత్రలేఖా! నీ ఇష్టం వచ్చినట్టు చెయ్. రాకుమారుడ్ని తెచ్చి నా ముందుంచినా, ఉంచక పోయినా నేనేమీ అనుకోను.' అంటూ సఖులచే నన్ను వీడ్కొలిపింది - చంద్రాపీడా!

రాకుమారా! మీరామెను ఇలా మదన తాపంతో వ్యధలు పెట్టడం భావ్యమేనా?' అని పత్రలేఖ చంద్రాపీడుడ్ని ప్రశ్నించింది.

కోమలమైన మృదువైన ఆవ్రత్తి పొడుపు ఆయనను ఎంతగానో గాయపరచింది—

'పత్రలేఖా! నే నొట్టి మూర్ఖుడను. ఆమె నా యెడల కనబరచిన ప్రణయ చిహ్నాలనన్ని సందేహంతోనే నేను గమనించాను. అలాంటి త్రిభువన సౌందర్యవతికివి సహజ చిహ్నాలే

ననుకున్నా. ఆ ప్రణయ చిహ్నాలు ఇలా మొగ్గలు తొడిగి, పుష్పించి కడకు రాలిపో సిద్ధంగా ఉన్నాయని నీ వంటుంటే, నా హృదయం పరితపిస్తోంది. ఆమె నన్ను కఠినునిగా లెఖ్ఖ కట్టింది. ఆమె హృదయంనుండి ఈ అభిప్రాయాన్ని తొలగించడానికి నీవేం చేయమన్నా ఈ చంద్రాపీడుడు చేయడానికి సిద్ధంగా ఉన్నాడు_చెప్పు పత్రలేఖా!'

'ఒకసారి వెళ్ళి ఆమెను చూడాలి – రాకుమారా.'

'అయితే పద!'

ఇద్దరూ లేస్తున్నారు. అంతలో ప్రతీహారి మహారాణి నుండి ఓ కబురు తెచ్చింది—

'నాయనా! నిన్ను చూడాలని నా మనస్సు ఆరాట పడుతోంది. పత్రలేఖను నీలాగే పెంచాను. ఆమెతో కలసి వచ్చి, నీముఖారవిందాన్నొకసారి నాకు చూపించునాయనా!'

అబ్బ! తనను చూడకుండా తల్లి ఒకనిముష ముండలేదు. తక్షణం అక్కడ కాదంబరి వద్దకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. రెండు కత్తులు ఒక ఒరలో ఇముడటం ఎంత కష్టం! ఎంత అసాధ్యం! ఇటు తల్లి దండ్రులను, రాజులనూ రాజ్యాన్నీ వొదులుకో లేడు. అటు తనను కాదంబరి ప్రాణప్రదంగా ఎంచుతోంది. ఆమెను పరిగ్రహించడానికి సమయం కూడా మించి పోతోంది. అది హేమకూటం! ఇది వింధ్య

కూటం. ఆ హేమ కూటానికీ, ఈ వింధ్య కూటానికీ మధ్య, అబ్బ ! ఎంత దూరం ?

ఏమైనా తప్పనిసరి - ప్రతీహారి దారి చూపుతుండగా పత్రలేఖతో మహారాణి అంతఃపురానికి వెళ్ళాడు. తల్లి తన మాతృ హృదయాన్ని విప్పి, లాలిస్తోంది. ఆ లాలింపులో కాదంబరీదేవి ప్రేమ కనబడ లేదు. పగలంతా ఇట్టే గడచి పోయింది.

ఇంతలో చీకటి పడింది. చంద్రుడు మన్మథుని రెచ్చ గొడుతూ ఉదయించాడు. మెల్లగా మంద మలయానిలం వీస్తోంది. చంద్రాపీడునికి కనుల ముందు కాదంబరి కన బడింది. నిద్ర పట్టలేదు. ఆమె ఆలింగనాల్లో, చుంబనాల్లో చెక్కిళ్ళలో, పెదవులలో, లావణ్య ప్రవాహంలో ఈదు లాడుతున్నాడు. ఆమె ఆయనకు తనదై పోయింది. తనదై పోయినప్పుడు రక్షణ భారం కూడా చంద్రాపీడునిదే గదా!

మిగతా ప్రపంచం అతనికి కనబడలేదు. వీణానాదాలు, సంగీత వాయిద్యాలు అన్నీ శ్రావ్యంగా ఆలకిస్తున్నా అవి ఆయన వీనులను చొరలేక పోతున్నాయ్. దృష్టి పథంనుండి కాదంబరి తొలగడంలేదు, ఇక తన మనసు బయటబడి పోతుందేమోనన్న భయంతో పూర్వంలా అతడెవరికీ దర్శన మివ్వడం మానివేశాడు. కామాగ్ని దహిస్తున్నా, తల్లి దండ్రులకు తెలుస్తుందని తామర శయనాన్ని అలంకరించ

లేదు. తామరతూళ్ళనూ, చివురుటాకు రెమ్మల్నీ తెమ్మని సఖులకు చెప్పలేదు. నిరంతరం శీతలోదకాలతో చల్లగా నుండే ధారాగృహం గడప త్రొక్కలేదు. రాత్రిం బవళ్ళు ఎడ తెగని మన్మథాగ్నితో వ్రేగిపోతున్నాడు. మన్మథుడ్ని పట్టి పరిమార్చుదామనుకుంటే, అతడెవరికీ కనబడడు. పోనీ, ఆ తూపులనుండి తప్పుకుందామంటే గొప్ప విలువిద్యా విశారదుడై యుండికూడా తప్పుకోలేక పోతున్నాడు. శరీరం చిక్కిపోతోందేగాని, కాదంబరిపై ఆయన మక్కువచిక్కడం లేదు. సుఖాన్ని త్యజించాడేగాని, ధీరతను చంపుకోలేదు. ప్రజలపై ప్రేమ త్రుంచుకోలేదు. ఆయన నెమ్మది నెమ్మదిగా మొగ్గాడుకాని, కామునికి దాసుడై పోలేదు.

ఒకవేపు ప్రజలపై గౌరవం, మరోవేపు కాదంబరిపై మమత ముందుకు లాగుతున్నా, అతడు నిబ్బరాన్ని కోల్పోలేదు. కామోద్రేకం చంద్రునిలా ఎంత పొంగించినా, నేలను అతిక్రమించి ప్రవహించిన సముద్రునిలా గాంభీర్యతను మొక్కవోనీ లేదు.

కొన్ని రోజులు గడిచి పోయాయ్. అవి ఆయనకు కొన్ని యుగాలు.

ఒకరోజు నదీజలాలపైనుండి పిల్లగాలులు వీస్తుండగా ఆ తీరంపై తిరుగుతున్నాడు, నదికి ఆవలపై మైదానంలో పెద్ద అశ్వికసేన కనబడింది. ఆ గుర్రాలు ఒకదాని నొకటి తప్పుకుంటూ, రాసుకుంటూ భయభ్రాంతమైన జింకల బారుల్లా

పరుగెత్తుకొస్తున్నాయ్. అవి ఎవరివై యుంటవో చూడమని చంద్రాపీడుడు ఒక మనిషిని పంపాడు.

ఆ సేన దగ్గరకొస్తోంది. పత్రలేఖతో నదినిదాటి ఆవలి తీరంపై నిల్చి, దృష్టి నిగిడ్చి చూచాడు.

'ఆ! పత్రలేఖా! అటుచూడు! ఆ గుర్రాలలో ముందు ఉరక వేసుకొస్తున్న ఎత్తైన మయూర ఛించమున్న గొడుగుతో నున్న దానిపై కనబడుతున్నది-వైశంపాయనుడు కదూ?'

పత్రలేఖ చూచింది. ఆమె అతడే వైశంపాయనుడని చెప్పే లోపుగానే, వైశంపాయనుడు ఆ గుర్రాలపై వచ్చి చంద్రాపీడుని ముందు నిలిచాడు. అతడి శరీరం ధూళిధూసరితమై ఉంది. ఆ ధూళిలో అతడి వొంటిపైనుండి చందన సుగంధ మేమీ రావడంలేదు. ఏదో దైన్యం అతడి ముఖంలో ప్రస్ఫుటి స్తోంది. ఇక కాదంబరి వృత్తాంతం అతడి ముఖంపై రాసి ఉన్నట్టే అనిపించి—

వైశంపాయనా! మనం భవనానికి పోయి, విశ్రాంతి తీసుకున్నాక మాట్లాడుకుందాం! పద!' అటూ అతడిని ఒక ఏనుగుపైకి ఎక్కించుకొని, వెనుక పత్రలేఖను కూరోచ్చె పెట్టుకొని, కుమార భవనానికి వచ్చాడు.

వచ్చి, దాస దాసీజనంతో, వైశంపాయనునితో ప్రశాంతమైన ప్రమదావనంలో ప్రవేశించి, కొన్ని గడియలు జంత్ర

గా త్తాలతో కాలక్షేపం చేసి, వైణికుడు స్థిమిత పడ్డాక అడిగాడు—

'వైణికా ! కాదంబరీ, మహాశ్వేతలు కుశలమేనా ? కాదంబరీదేవి ఏమైనా సందేశం పంపిందా ?'

'రాకుమారా! ఆ విషాదగాథ ఏమని వివరించను? నేను పత్రలేఖను మీ సేనాని మేఘనాధునికి అప్పగించి, తిరిగి వెళ్ళి మీరు ఉజ్జయినికి వెళ్ళిపోయారని చెప్పిన వార్త విని, ముందుగా మహాశ్వేత కటకటలాడిపోయి, తన తపోవనానికి వెళ్ళిపోయింది. ఇక కాదంబరి అంటారా ? ఆమెకు యీ వార్త పిడుగుపాటయింది. తెలివి తప్పిపోయింది. పాద లేఖతో కూడా, ఆ దినమంతా ఆమె మాట్లాడలేదు. ఆ లేత ప్రణయ హృదయంలో ఆ రోజు ఎన్నెన్ని పెను కెరటాలు కెరలాయో ? బడబానలం రలిగిందో నేనేమి చెప్పగలను ? మరునాడు ఆమెను దర్శించుకుందామని వెళ్ళాను. ఆమె కళ్ళు ఉబ్బిపోయి ఉన్నాయ్. ఏడ్చి ఏడ్చి ముఖమంతా ఎర్రబడిపోయింది. ఇక నేనామెతో ఏమీ మాట్లాడలేక, మీకై యిక ఆత్మాహుతి కానున్నదని అర్థం చేసుకొని, ఆమెను రక్షించగలవారు మీరొక్కరేనని యిలా పరుగెత్తు కొచ్చాను.

'దేవా ! విను ! మొట్టమొదటిసారిగా మీరు మలయ మారుత వీచికలా, ఆ కన్యాకుమారి సుకుమార నందన

వనంలో జొచ్చి, ఆమెను ఊపివేశారు. ఆమెలో మన్మథుడు ఆవేశించాడు. కామాగ్నిని ప్రజ్వలింపజేసాడు. అది ఆరదు. చందన పూతలు ఆ మంటలను చల్లార్చలేవు. శీతలోపచారాలు ఆ వేడిని ఉపశమింప చేయలేవ్. ఆమెకు ఆ నాటి నుండి నిద్రాహారాలులేవ్. అయినా మన్మథాగ్నిలో మండే కణంలా ఆమె లావణ్యం మరీ ప్రకాశించ సాగింది ఏనాటి కైనా తన ప్రియుని కలుసుకోగలనన్న ఆశతో ఆమె బ్రతుకుతోంది. ఆ బ్రతుకులో ఆమె వేదన నేను నా నోటితో చెప్ప లేను ప్రభూ !

'ఆ ఆవేదనను గాంచగలిగిన ఎవరికైనా గుండెలు కరిగి పోగలవే. కాని మీరు ఆమెను అర్థం చేసుకోలేకపోయారు. శతసహస్రకోటి సూర్యకాంతులను పుణికి పుచ్చుకొని వికసించే కమల తోరణాలను ఆమె ప్రక్కగా పరిస్తే, అవన్నీ సంతాప దగ్ధమైన ఆమె శరీరం వేడికి వాడిలిపోతున్నవి, రాకుమారా! పులకరింపులు ఎక్కువై, మాటిమాటికి జారి పోయే వక్షోపరిభాగంపైని పైటనుసవరించుకోడానికి చేయెత్తి నప్పుడల్లా, ఆ చేయి మీపాణిగ్రహణంకోసం చూస్తున్నట్టే నాకు కనబడేదంటే నమ్మండి !

'ఇంకా ఆమె అవస్థ ఏమని చెప్పను దేవా ! చిక్కి, శల్యమై, ముంజేతి కంకణాలు క్రిందకు జారిపడిపోయాయ్. మొలనూలు కాళ్ళపైకి మాటిమాటికీ జారిపడిపోయి, బంధ

నాల్లో అడుకొంటుంది. కురులు ముడిచివేయడంలేదు గదా! కస్తూరి తిలకాన్నీ, చందనసుగంధాన్ని అన్నిటినీ దరిదాపుల్లోకైనా రానీయడంలేదు గదా!

'ఆ రాత్రితో తామర శయనలపైనే పొర్లుతోంది. విసిగిపోయి, లేచి లతా తీగెలను పట్టుకొని తూలిపోకుండా అక్కడక్కడ నిలుస్తుంటుంది. ఆమె బ్రతుకంతా అటు తామర తోటలూ, ఇటు సరోవర తీరమే ఐపోయింది. అయినా వీణా నాదాలు చేసే తుమ్మెదలు ఆమెను మరీ బ్రతుకనీయటం లేదు. కోయిలలు మాటి మాటికీ కూజితాలతో ఆమె గుండెల్ని కోస్తున్నాయంటే నమ్మండి! ఇక చంద్రోదయ మైందా? తమకంతో కుసుమ కాంతలా నవనవలాడిపోతోంది, వెన్నెలలా ఆమె కనులు కరిగిపోతాయ్. తామర తోటలా ఆమె గుండె వాడిపోతోంది. సముద్ర తుషారాల్లా నిట్టూర్పులు విరజిమ్ముతోంది. చక్రవాకాల కోర్కెల్లా ఈమె కోర్కెలూ ప్రశ్నార్థకాలతో నిలచిపోతాయ్.

'ఇక చంద్ర కాంతినీ, శీతల పవనాలనూ ఆమె భరించలేదు. వాటినుండి తప్పించుకుని పారిపోదామని మణి భవనానికి వస్తుంది. అక్కడా, ఆ చంద్రకాంత శిలా ఫలకాలే! ఎటు చూచినా తనను ముట్టడించ వస్తున్న మన్మథ దండయాత్ర! ఆముట్టడిలో ఆమె చిక్కిపోయి, తప్పించుకోడానికి

దాని దొరక్క తపించిపోయే ఆమె మానసిక దుర్భర స్థితిని నేనిక చెప్పలేను రాకుమారా!'

'విరహంతో ఆమె క్షీణించిపోయింది. శైత్యోపచారాలకు సరోవరంలోని తామర తూళ్ళన్నీ అయిపోయాయ్. పరిచారికలు చెప్పే మృదు సూక్తులన్నీ ఇక వ్యర్థమైపోయాయ్. ఆమె బ్రతికే మార్గాలన్నీ మూసుకుపోయాయ్.

'ఇప్పుడు నీ పేరే ఆమెకు హరనామ జపన! నీ రూపమే ఆమెకు దివ్యకాంతి! సర్వ సఖిజనం, సంపదా, ఆలోచనలూ అన్నీ నీ వైపుకే ప్రవహిస్తున్నాయ్. ఆమె తెలివి తప్పినప్పుడల్లా నీ పేరు చెప్పే ఆమెను తెప్పరిల్ల చేస్తున్నారు - సఖీజనం! ఇకామె బ్రతుకంతా నిశ్వాసాలలోనే ఉంది, దేవా!' అని ఒక గాఢ నిట్టూర్పును విడిచి చంద్రాపీడుని కళ్ళలోకి చూసాడు వైణికుడు. ఏడీ, చంద్రాపీడుడు? అప్పటికే అతడు మూర్ఛిల్లిపోయాడు.

నిర్ఘాంతపోయాడు వైణికుడు.

# 10

ప్రక్కనే ఉన్న పత్రలేఖ వెంటనే తాళపత్రంతో వీచి సేద దీర్చింది. తెలివి కోల్గాని చంద్రాపీడుడు వైణికునితో అన్నాడు—

'వైణికా! కాదంబరి నన్ను కఠినాత్ముడనని భావించి ఉంటుంది. లేకపోతే నన్ను నా వద్దకు వెళ్ళమని ఆమె స్వయంగా ఎందుకు చెప్పలేదు! మహాశ్వేత కూడా కినుక వహించే, తపోవనానికి వెళ్ళిపోయి ఉంటుంది. ఆహా! కాదంబరికి ఎంత అన్యాయం చేసాను ? సచ్ఛీలురాలు కాబట్టి, మార్దవ స్వభావురాలు కాబట్టి తన మనో అవస్థను తాను చెప్పలేక పోయింది - దేవి! చెప్పితే ఈ దాసుడు తక్షణం ఆమె చరణారవిందాలపై వాలకుండా ఉంటాడా? ఆమె సిగ్గే ఆమెనీస్థితికి తెచ్చింది. కోమలమైన కడిమపూవులాంటితనశరీరాన్ని క్షీణింప చేసుకొని ఇన్ని బాధ లెందుకు పడాలి ! వైణికా! బహుశా, ఆమె ముగ్ధావస్థే ఆమె సిగ్గుకు కారణమై ఉండొచ్చు. అందుకే ప్రౌఢ పరిపాకానగాని కన్యకు సిగ్గు వొదలదంటారు! పోనీ మదలేఖతోనైనా తన మనోభావం చెప్పవచ్చుగా! సకల విలువిద్యా విశారదుడనైన నేనే ఆ మన్మథ తూపుల దాడికి తట్టుకోలేక పోతున్నానే, ఆమెఎలా తట్టుకోగలదు? ఈ దురవస్థను అనుభవించలేక అలసిపోయి ఆఖరుకు....'

అతడి పెదవులు కంపించాయ్. నోట ఇక మాట రాలేదు....పాపం! అతడి తపనను తనవేడి కిరణాలతో మరింత తపింప జేయడమెందుకని జాలిపడ్డాడనుకుంటూ, సూర్యుడు తన కిరణాలను ముడుచుకున్నాడు. సంధ్యాకాంత, తన కరు

ణానురాగాన్ని అతడిపై ప్రసరించింది. ఆ సమయంలో అతడి కేదీ కనుపించకుండా చేయాలనే అనుకుంటూ - తిమిరకాంత తన విరయబోసిన కురులను అన్ని వైపులా పరిచింది. చీకటి వ్యాపించింది.

కాస్సేపటికి తూరుపుదిశ దిద్దుకున్న సుగంధ తిలకంలా, అమృతం నింపిన నిండు కుండలా, నేత్రానందకరుడైన చంద్రుడు, తన చల్లని కిరణాలను వెదజల్లుతూ, ఉదయ గిరిపై వెలసాడు.

చంద్రాపీడుడు ఉద్యాన వనంలో ప్రవేశించి, వసంత మండపంలోని తరుపత్ర శయనంపై మేను వాల్చగా, పత్ర లేఖ పాదాలు వత్తుతోంది. ప్రక్కను కూర్చున్న వైణికు నితో రాకుమారుడు మరల అంటున్నాడు—

'వైణికా! నాకు పితృాజ్ఞ బంధనంలా తగుల్కొని, నా కాదంబరీదేవిని విడిచి వెళ్ళవలసి వచ్చింది. అది సరే! ఇప్పు డిక మనమెళ్ళేవరకూ కాదంబరి జీవించి ఉండగలదంటావా? ఆమెను ఓదార్చటానికైనా మహాశ్వేత తపోవనం నుంచి తిరిగి వచ్చి ఉంటుందంటావా?'

'ప్రభూ! ధైర్యంగా మనం ప్రయాణం కావటమే మంచిది మీ కై తపించిపోతున్న కాదంబరి మీ దర్శనం కోసమైనా, కొనగళ్ళతో ప్రాణాలను నిలుపుకొని ఉండగలదని నమ్మకం.'

'సరే! శుభోదయంలో ప్రయాణం చేద్దాం!' అని వైణికుని నిద్రించమన్నాడు. తానూ నిద్రపోవా లనుకున్నాడు. కాని నిద్ర రావడంలేదు.

కాదంబరీదేవి వద్దకు వెళ్ళవలసివుంటే, తల్లి దండ్రులకు చెప్పకుండా, వారి ఆశీస్సులను పొందకుండా ఎలా వెళ్ళడం? వారి ఆశీస్సుల కోసమని వారివద్ద కెడితే, తనను కాదంబరీ దేవి దగ్గరకు కాదుకదా, చివరకు తనకుమార భవనాన్నైనా విడిచి వెళ్ళనీయరే! వెళ్ళినా తన భుజస్కంధాలపై తండ్రి పెట్టిన ఈ రాజ్యభారాన్ని ఎవరికి అప్పగించడం? పోనీ చెప్ప కుండానే వెళ్ళి వద్దామంటే, ఆ సంగతి తెలిసి, తనకోసమని దిక్కు లదరగొడుతూ, భూమ్యాకాశాలను ధూళి ధూసరితం చేస్తూ సమస్త సేనావాహినీ తనకోసం కదలిపోతుందే! జనా వళంతా తన తండ్రిపైనున్న అనురాగం కొద్దీ తమ భార్యా పుత్రులనుకూడా విడిచి నాకై వెంట పడతారే!

వీరి నందరినీ కాదని, నేను ఎలా వెళ్ళను? ఎక్కడకు వెళ్ళను? పోనీ చెప్పకుండా వెళ్ళి, తిరిగి వచ్చాక వీరికి ఏ ముఖం చూపించను? ఎక్కడికి వెళ్ళావంటే, ఏమని బదులు చెప్పను? ఇప్పుడిప్పుడే మూడేండ్లు, దిగ్విజయయాత్ర జరుపు కొని వచ్చినవాడినే, ఇపుడు చెప్పకుండాఎక్కడకు పోయినా, జైత్రయాత్రలో ఆర్జించుకున్న యశస్సంతా కరిగిపోదా!

'అయ్యో! తల పగిలేడి తలపులతో సతమతమవుతున్న నాకు, ఆలోచన చెప్పడానికైనా దగ్గర వైశంపాయనుడు లేడే! ఇప్పుడు నా దుఃఖాన్ని ఎవరితో పంచుకోను! నావల్ల నా తల్లిదండ్రులకు కోపంవస్తే, వారికి నచ్చ చెప్పగలిగిన మిత్రుడు నా కిప్పుడెవడున్నాడు! అంటూ నిద్రపట్టక ఆలోచిస్తూండగానే తెల్లవారిపోయింది.

వెలుగుతోపాటు సూర్యభగవానుడు మరో శుభవార్తను కూడా చంద్రాపీడునికి అందజేసాడు.

దశపురికి ఒక సేనతో వెళ్ళిన వైశంపాయనుడు, తిరిగి నగరుకు వస్తున్నాడు.

చంద్రాపీడుడు ఎగిరి గంతులు వేసాడు. ప్రక్కనున్న వైణికుడ్ని, ఆ సంతోషంలో గాఢంగా కౌగలించుకొని—

'వైణికా! నా వైశంపాయనుడు వస్తున్నాడు. మనకార్యం సిద్ధిస్తుంది.'

'అవును రాకుమారా! మన కార్యం సిద్ధించడమే కాదు-కాదంబరీ సమాగమం, మధుర కలయికగా పరిణమిస్తుందని మీ ముఖ కవళికలే చెబుతున్నాయ్, తెలుపెక్కిన తూరుపు దిశ చంద్రోదయాన్ని, ఎరుపెక్కిన చివురుటాకులు, పూసే పూతను, పచ్చబడిన ప్రకృతి వసంతాగమనాన్ని చెప్పవా ప్రభూ! ఏమైనా కాదంబరి జీవించి ఉన్నదన్నది అనుమానాస్పదం గదా! నేను ముందుగా వెళ్ళి, మీ ఆగమనవార్తను

చెబితే, కొనవూపిరితోనైనా ఆమె జీవించగలదు. నాకు ముందుగా కాదంబరీదేవి వద్దకు బయలుదేరడానికి అనుమతించండి!

'భేష్! బావుంది - వైణికా, నీ ఆలోచన బాగుంది. మాపై నీకెంత భక్తి! అటులే కానియ్! దేవి ప్రాణరక్షణకు నా రాకను తెలుపుటకు పత్రలేఖకూడా నీకూడా వస్తుంది. ఇద్దరూ వెళ్ళి ఆమెకు ధైర్యాన్ని చేకూర్చండి!' అంటూ పత్రలేఖవైపు చూచాను.

ఆమె శిరస్సు వొంచింది-ఆమోదించినట్లు.

వెంటనే మేఘనాధునికి కబురు వెళ్ళింది. కబురందుకున్న తక్షణం చంద్రాపీడుని ముందు వాలాడు-మేఘనాధుడు.

'మేఘనాధా! ఇంతకుముందు పత్రలేఖకోసం నీవాగావు చూసావ్-అక్కడికిప్పుడు యీ పత్రలేఖనూ, వైణికుడ్నీ తీసుకెళ్లు. వైశంపాయనుడు రాగానే, నేనొక అశ్వికదళంతో వచ్చి నిన్ను కలుసుకుంటాను.'

'చిత్తం!'

'ఇదిగో, మీరిద్దరూ ఇలా చూడండి! దేవికి నా మాట' లుగా ఇలా చెప్పండి! 'దేవీ! నా తొలి చూపులోనే నీ వలపు దోచి వచ్చేటపప్పుడు నీతో చెప్పనైనా లేకపోయి నందుకు క్షమించు! ఈ ఒక్క నేరంవల్ల, నేను నాలో మంచి

తనాలన్నీ పోగొట్టుకొని, దోషభూయిష్టుడ నైపోయాను. నిన్ను క్షమాపణ కోరడానికైకూడా అనర్హుడిన్ని. ఏ ముఖంతో క్షమించమని కోరగలను? నిన్ను ఇంతకాలమూ, ప్రణయాను రాగ జ్వాలలలో దహించివేసానే? నీ శరీరాన్ని చివికి, క్షీణింప జేసానే? అయినా నీలోనున్న దివ్యగుణాలనుచూచు కునే, యీ క్షమాపణను కోరుకున్నాను. పరులను మన్నించ టమే త్యాగుల లక్షణంగదా! శరణార్థులను రక్షించడమే ఉదారుల పద్ధతిగదా? అందుకే నిన్ను వేడుకుంటున్నా.

'క్షణమాత్ర పరిచయంతో నీ మనసెల్లా దోచి. సిగ్గు లేకుండా నా ముఖాన్ని నేను త్వరలోనే చూపబోవడం సాహసమే. పాదపతితుడనైన నన్ను ఉదారతతో ఆలించ గలవని నమ్ముతున్నాను' అని దేవికి చెప్పండి. పత్రలేఖా! ఆమె ప్రాణాన్ని నిలబెట్టడం కోసమే నిన్ను పంపుతున్నాను. ఏమరకు! ఆమెను విడిచిఉండకు! నా జీవితమే నీచేతిలో ఉంది సుమా!' అంటూ వారిని సాగనంపాడు-చంద్రాపీడుడు.

వారు వెడుతుండడాన్ని రెప్పలార్చక చూస్తున్నాడు. వీరు దారిలో ఎన్ని రోజులు ప్రయాణం చేస్తారో? త్వరగా హేమకూటాన్ని చేరుకుంటారో లేదో?....అవే ఆలోచనలు! కాస్సేపు ఆ ఆలోచనలతోనే కూర్చొని, కడకు వచ్చే వైశం పాయనుని ఆహ్వానించుటకు తనను పంపవలసిందిగా కోరుటకు, తండ్రివద్దకు రాజభవనానికి బయలుదేరి వెళ్ళాడు.

రాజభవనంలో అడుగుపెట్టాడు, అప్పుడే ఆలోచన మందిరంలో కూర్చుని మహారాజు తారాపీడుడు, మహామంత్రి శుకనాసునితో ఏదో ముచ్చటిస్తున్నారు. ఎదురుగా రాకుమారుడు కనపించాడు. తారాపీడుడు సంతోషంతో, కన్నకుమారునిగాంచి ఉప్పొంగిపోయి, శుకనాసునితో అన్నాడు—

'చూశావా, మహామంత్రీ! మన చిరంజీవికి అప్పుడే మీసకట్టు మొలకలెత్తింది. అది బంగారు కొండపై నీలాల వెలుగులా, గజకుంభస్థలంపైని మదధారలా, చంద్రునిలో నీడలా, ఆ ముఖంపై కాంతులీనుతోంది కదూ! వివాహ మంగళానికి కను సన్నలాఉంది కదూ! అది పెండ్లియీడునే సూచిస్తోంది. మహారాణికి చెప్పి, వివాహ ప్రయత్నాలు చేయండి! పుత్రముఖ దర్శనంతోపాటు కోడలి ముఖాన్ని కూడా దర్శించుకునే భాగ్యాన్ని నాకు కలుగ జేయండి!'

'అలాగే ప్రభూ! దిగ్విజయుడై రాజ్యలక్ష్మిని చేపట్టినవాడు, చతుస్సముద్ర పరీత భూకాంతను వరించినవాడు పెండ్లికుడు రాకుండా ఉంటాడా మహారాజా?'

ఆ మాటలు కాస్త దూరంనుండి వస్తున్న చంద్రాపీడుని చెవుల్లో పడ్డాయ్. ఏమిటీ విచిత్రం! తను కాదంబరిని కలుసుకోనున్న తరుణంలో ఇయా పెండ్లిమాటలు? చంద్రాపీడుడు సంతోషాంతరంగుడై పోయాడు. సముద్రంలో కొట్టుకుపో

తున్న వానికి తెప్ప దొరికినట్లు, మృత్యుముఖాన ఉన్నవానికి సంజీవి దొరికినట్టుగా అయింది.

'నాన్నగారూ!' అంటూ పాదాలవద్ద వాలాడు.

'నాయనా!' అంటూ అతడి ప్రకాశవంతమైన ముఖాన్ని మరీమరి ముద్దాడాడు. అక్కడనుండి విలాసవతి మందిరానికి వెళ్ళి ఆమెను ఎత్తి పొడిచాడు—

'దేవీ! కుమారుని ఆ నూనూగు మీసం అన్నీ చూచి కూడా వానికి పెండ్లి ప్రయత్నాల ప్రస్తావన తేలేదంటే, నీకు వానిపై ప్రేమలేనట్టుగానే కనబడుతోందే!' అని.

కాస్సేపు కుమారుని గుణగణాలను ముచ్చటించుకుంటూ కాలక్షేపం చేశాక, కాలకృత్యాలను తీర్చుకోడానికి వెళ్ళిపోయాడు.

వైశంపాయనుని చూస్తే ఇక కాదంబరిని చూచినట్టేనన్న ఆనందంతో మహామంత్రి వద్ద వైశంపాయనుని ఎదురేగి తోడ్కొచ్చుటకు అనుమతిని పొందాడు-చంద్రాపీడుడు.

మిత్ర సందర్శనోత్కంఠతో ఎలాగో ఆ పగలు గడిపాడు. ఇంతలో చంద్రదర్శనం అయింది, రంధ్రాన్వేషణం చేస్తూ వెన్నెల వెలుగులు రసాతలంలోకి చొచ్చుక పోయాయ్. భవంతులన్నీ మణులు తాపినట్టు ప్రకాశిస్తున్నాయ్. చీకటికి

చందనం పూతవేస్తున్నట్లుగా, దిక్కులకు వెల్ల వేస్తున్నట్లుగా ఉందా వెన్నెల.

వెన్నెల కిరణాలు, తమ పనిక తీసిపోయినట్లు, జలతరంగాలపై, ముగ్ధల చెక్కిళ్ళపై, ప్రౌఢుల పాలిండ్లపై ఆడుకుంటున్నాయ్. చంద్రాపీడునకు కాదంబరీ సమాగమాన్ని త్వరితం చేయుటకా అన్నట్టు, విల్లమ్ములుపట్టి మన్మథుడు ప్రక్కనున్న కలువతోటలో ప్రవేశించి నారి మోగించాడు. వియత్తలం అదిరింది. దిక్కులు పిక్కటిల్లాయ్. చంద్రాపీడుని వరాలు పొంగాయ్. తారకాహారాలు ధరించి, కలహంసల్లా, అందెల రవళితో వస్తున్న వారాంగనల సవ్వడి, మధుర ధ్వనులను దీర్ఘంగా లేపుతోంది.

వేలకొలదీ గుర్రాలను నేల యీనినట్లు కనబడింది. అశ్వికులు వాటికి జీనులను తగిలిస్తున్నారు. రాచప్రాంగణమంతా వెళ్ళే, వచ్చే గుర్రాలతో కిటకిటలాడి పోయింది. రాచ నగరులో వీధులన్నీ అతి కోలాహలంగా మారిపోయాయ్.

జనసమ్మర్ధమైన ఆ వీధులబడి రాకుమారుడు, వంధిమాగధుల స్తోత్ర పాఠాలతో, జనావళి పొగడ్తలతో, వెంట వచ్చే చతురంగ సేనాబలంతో, ఇంద్రాయుధాన్ని అధిష్ఠించి దిక్కులను మెరపిస్తూ, వజ్రకిరీట దగద్ధగలతో, రాచ దర్పంతో, దశపురిదారిని ముందుకు సాగాడు. దారిలోనున్న శిప్రానదిని దాటివేశాడు. నిడుపైన, సన్ననైన, దశపురి

బాటలో సాగుతున్నాడు. వైశంపాయనుణ్ణి ఎంత త్వరలో చూస్తానూ అన్న ఆతృతలో, అప్పటికే మూడు యోజనాల దూరం అధిగమించినట్టు ఆయనకే తెలిసింది కాదు.

చీకటి నీలి తెరను కప్పినట్టు, రాత్రి రావడం, పోవడం కూడా జరిగిపోయింది. చల్లని మంచుబొట్లు పూరేకులపై పడుతూ నవరత్నాల్లా మెరుస్తున్నాయ్. పరిమళంతో మత్తెక్కిన గాలి, రేయిపోయి, పగలు వచ్చిందని చంద్రాపీడునికి బాస చేసింది.

నెమ్మదిగా ఆ చంద్రుడూ వెలవెల పోయాడు. గగన దేవత విరహార్తితో, వియోగ దుఃఖంతో విడిచి పారవేసిన సన్నని వలువలా వెన్నెల చంద్రుని మీది నుండి జారి పోయింది. నక్షత్రాలు మాయమై పోయాయ్. లతాపల్లవములు నీటిలో నుండి పైకి లేచాయ్. తూరుపు కన్య చెవి నలంకరించిన ఎర్ర అశోకం రెమ్మల్లా, ఆకాశ సరోవరం లోని తామర పూవుల్లా, దివసముఖమనే ఏనుగు ముఖంపై పెట్టిన కుంకుమరాగంలా, సంధ్య అరుణిమను చల్లింది. ఆ అరుణిమే ఏదో దావాలన మనుకొన్న పక్షులు, ఆ కాంతికి భయపడి అరుస్తూపారిపోయాయ్. పనుల్లోకి పోయే గ్రామీణ ప్రజల అడుగుల గుర్తులు నేలపై కనబడ్డాయ్.

ఏడు లోకాలకూ ఏక నేత్రుడైన సూర్యుడు, రేయల్లా విరహంతో మరిగిపోయి, ముడుచుకుపోయిన తామర కన్యను సందర్శించడానికా అన్నట్టు, ఉదయగిరిపై అవతరించాడు.

అప్పటికి అరక్రోశు దూరంలో చంద్రాపీడునికి, సైన్యం కనుపించింది. విపరీతమైన ధూళి, అవిరళమైన ధ్వని, రోదసీ గహ్వరాన్ని నింపివేసింది. మహాసముద్రంలా ఉంది - ఆసేన.

చంద్రాపీడుడు ఆమందానంద భరితుడై పోవాడు. మూగ వానిలా, అంధునిలా వైశంపాయనుని కలుసుకోవాలన్న కుతూహలంతో వెళ్ళిపోతున్నాడు. దారిలో కనబడ్డవారినల్లా 'వైశంపాయను డెక్కడ? అని అడుగుతున్నాడు. 'వైశంపాయనుడా? ఎవరాయన? ఎదురు ప్రశ్నలు వస్తున్నాయ్. తానెవరిని అడుగుతున్నాడో, ఎందు కడుగుతున్నాడో అతనికే తెలీదు. దయ్యం పట్టినవానిలా, వస్తున్న స్కంధావారంలోకి ఇంద్రాయుధంపై ప్రవేశించాడు. ప్రవేశించగానే 'వైశంపాయనుడెక్కడ?' అని ప్రశ్నించాడు. ఆ ఇంద్రాయుధాన్ని గాంచి గుర్తించిన సైనికులు—

'దిగండి, రాకుమారా! వివరంగా మనవిచేస్తాం!' అన్నారు.

వివరంగా మనవి చేయడమేమిటి! ఏమైంది. వైశంపాయనునికి? గుండె గుభిల్లుమన్నది - చంద్రాపీడునికి. ఏమేమో ఊహించుకొని మూర్ఛపోయాడు. మూర్ఛ తేలేక పిచ్చెక్కిన వానిలా తనలో తానే అనుకున్నాడు,

'ఏమైంది - వైశంపాయనునికి అతడులేని బ్రతుకు చీకటి మయమే. ఇంకెందుకు బ్రతుకు? ఆత్మహత్య చేసుకోడమే

ఇక శరణ్యమనుకుంటాను....వైశంపాయనా? హా! మిత్రమా.' అంటూ కెవ్వున బిగ్గరగా అరిచాడు.

'ఆహా! ఇక నాకు సుముఖమేముంది? ఈ జీవితంలో కాదంబరితో నాకు పనేముంది? హా! తల్లీ, మనోరమాదేవీ! నీవు 'నా పుత్రుడేడ'ని అడిగితే నేనేమని చెప్పను? మహా మంత్రి ముఖాన్ని నేనెలా చూడగలను?' అంటూ సైనికుల ముఖాల్లోకి పిచ్చిగా చూస్తూ—

'చెప్పండి! నా వైశంపాయను డేమయ్యాడు?' అని గర్జించాడు. 'మాట్లాడరేం? ఏదైనా యుద్ధం సంభవించిందా? ఆ యుద్ధంలోగాని చనిపోయినాడా?'

అప్పటికి వారికి అర్థమైంది-వైశంపాయనుడు మరణించాడనుకొని, రాకుమారుడుమతి భ్రమించి మాట్లాడుతున్నాడని.

'వైశంపాయనునికి నూరేళ్ళాయుష్షు రాకుమారా!'

'హా! నూరేళ్ళాయుష్షా? ఏడీ? ఎక్కడ?'

మళ్ళీ అంతరంగంలో సంతోషం చెలరేగి ప్రశ్నపై ప్రశ్న వేశాడు.

వారు చెప్పారు—

'వినండి రాకుమారా! వైశంపాయనుడు దారిలో స్కంధావార పాలకులను తీసుకొని, అచ్ఛోద సరస్సుకు వెళ్ళారు. వెళ్ళేటప్పుడన్నారు. 'అచ్ఛోద' సరస్సంటే కలలోకూడా

మానవులు దాన్ని చూడలేరు. అది అతి పవిత్రమైనదని పురాణాల్లో ఉంది. అందులో స్నానంచేసి, ప్రక్కనే ఉన్న మహేశ్వరునికి పూజలుచేసి మరీపోదాం,' అని తిన్నగా కాలినడకను అక్కడకు వెళ్ళారు.

'అది అతిమనోహరమైన సరస్సు! నిర్మలమైన పరిమళ ప్రదేశం. ఆ ప్రదేశాన్ని చూచి ఆశ్చర్యపోయి, చిరుగాలికి కదలాడే కిసలయాలు, వీనుల విందైన సంగీతం పాడుతున్న తుమ్మెదలు, తనను ఆహ్వానిస్తున్నట్టుగా భావించి అదంతా కలియ చూడసాగాడు. అక్కడొక పొదరిల్లు ఉంది. అది మామూలు పొదరిల్లుకాదు. పచ్చనివెలుగులు చిందుతోంది. మబ్బులు పట్టిన ఆకసంలా దానినే నెమళ్ళు చూస్తుంటాయ్. రతీదేవి వినోద విహార స్థావరంలా, సర్వాంగ సౌందర్యానికి మణిమకుటంగా ఉందా పొదరిల్లు! అచ్ఛోద సరస్సులోని చల్లని అలలపై నుండి వీచిన పిల్లగాలులు యీ పొదరింటి పైకే వీస్తూంటాయ్. ఆ పొదను చూడగానే, ఎవరినోపూర్వ పరిచయమున్న మహావ్యక్తిని చూచినట్లు వైశంపాయనుడు అలాగే నిలిచి పోయాడు. ఆ పొదను చూచి కన్నీరుకారుస్తు న్నాడు. ఎంతకీ కదలిరాడే! కడకు మేము అడిగాం– 'చూడ వలసిన ప్రకృతి సౌందర్యాన్ని తిలకించాం. ప్రయాణ సన్నా హామా పూర్తిచేసాం! మీ కోసం సేన బయలుదేరడానికి సిద్ధమైకూడా వేచివుంది. పదండి!' అని. ఆయన మా మాట

లను పట్టించుకోనే లేదు. బహుశ వినబడ వేమో? ఉండుండి ఆయన కళ్ళ కన్నీరుకూడా కారచొచ్చింది. 'నేను రాను. మీరు వెళ్ళిపొండి! చంద్రాపీడుని రక్షణ క్రింద ఉండవలసిన యీ సేనను మరిక్కడ పెట్టుకు ఉండడం మంచిదికాదు,' అన్నాడాయన! మాకు ఆశ్చర్యం కలిగింది, మా విధి కాక పోయినా, మే మాయనకు అనేక విధాల చెప్పడం - 'మన మిట్లా వుండిపోవడం మంచిదికాదు. తారాపీడునికి పుత్రుని తర వాత పుత్రుడంతటి వారు మీరు. విలాసవతీదేవి మిమ్ముల్ని ఒడిలో పెట్టుకొని పెంచింది. చదువు సంధ్యలు నేర్పింది. అటువంటి వారిని విడిచి, మీ కంటే ముందు వెళ్ళిపోయిన రాకుమారుడ్ని విడిచి ఆయన అధికారాలన్నీ మీపై నమ్మక ముంచి, విడిచిన విశ్వాసాన్ని కాదని ఇక్కడఉండిపోడమా, చంద్రాపీడునికి మేమేమని చెప్పగలం? ఆ భ్రమను వీడి బయలుదేరండి!' అని కూడా అనేసాం. ఆమాటకు వైశంపా యనుడు చిరునగవుతో జవాబు చెప్పాడు, 'చంద్రాపీడు డంటే నాకు బహిః ప్రాణం కాని ఏం చేయను? నాకు తెలి యని శక్తి ఏమిటో నన్నిక్కడ నిలవరించింది. కాళ్ళకు ఎవరో సంకెళ్ళు తగిలించారు. నన్ను ఒక వేళ మీ రిక్కడనుండి బలవంతంగా లాక్కువెళ్ళాలని అనుకోవచ్చు. నేను మాత్రం యీ స్థానాన్ని విడిస్తే అమాంతంగా చచ్చిపోతాను. నా మన స్సులో ఏదో మెదలుతోంది. నేనురాలేను. మీరువెళ్ళండి!

అవకాశ ముండికూడా రాకుమారుణ్ని చూడలేని దురదృష్టా నికి నేను నోచుకుంటే, అవకాశం లేకపోయినా ఆయన్ను చూడగలిగిన అదృష్టాన్ని మీరు వరించారు. వెళ్ళండిక!' అని ఇకాయన మాట్లాడలేదు. మేమక్కడే మూడు రోజు లుండి పోయాం. ఆయన విరాగిలా, ఆ పొద చుట్టూనే, ఆ సరస్సు గట్టు వెంబడే మహేశ్వరుని ఆలయం చెంతనే తిరుగా డాడు, వేదనలో, బాధలో తిరిగి తిరిగి ఖిన్నుడై మరల పొద రింటి వద్దనే వచ్చి కూర్చున్నాడు. మౌనందాల్చాడు. ఆయన అవస్థ చూచి ఏమైనా కాస్త ఆహారం తీసుకోమని కోరు కున్నాం. తీసుకున్నాడాయన. 'ఆహా! వైశంపాయనుడు తెలివి కొల్చాన్నాడు!' అని మేమెంతో సంతోషించాం. ఆ సంతోషాన్ని ఒక్క క్షణమైనా ఆయన నిలబెట్టలేదు. మరల తన్ను తాను మరచి పోయాడు. ఎందువల్ల రాలేక పోతు న్నాడో చెప్పడు! మమ్మల్ని వెళ్ళిపొమ్మంటాడు. ఇక కొన్ని రోజులు ఓపికపట్టి, ఇలా వచ్చివేసాం, రాకుమారా! మీకు ఈ సంగతి ముందే చెప్పలేక పోవడానికి కారణం - భయపడే!' అని స్కంధావారంలోని కొద్దిమంది సైనికులు చంద్రాపీడ రాకుమారునికి వివరంగా చెప్పారు.

తాను కలలో కూడా ఊహించని సంఘటన జరిగింది. ఆశ్చర్యంతో అతడు శిలా విగ్రహమై పోయాడు - కొద్ది క్షణాలు, ఏవేవో కారణాలను అతడు అనుకొంటున్నాడు-

'వైశంపాయనుని ఈ నైరాశ్యానికి కారణమేమి? పుత్ర పౌత్ర సంతానం కలిగి ధర్మార్థ కామములను సాధించి, సకల కర్మలూ క్రతువులూ కొనసాగించి, యౌవ్వనం సడలిపోయి వృద్ధాప్యంలో అడుగు పెట్టినప్పుడుగదా అతడికి వైరాగ్యం రావాలి? పోనీ అలా వైరాగ్యంగాక అతని యెడల ఎవరైనా పరుషంగా ప్రవర్తించారా? తనతో సమానంగా దాసీ జను లంతా ఆయనకు కూడా మ్రొక్కుతారే! తల్లి తండ్రులకు ఏకైక కుమారుడే! అతడిపై పెగటు ఎవరికి కలుగుతుంది? పరుషంగా ఎవరు ప్రవర్తిస్తారు? కాదు-అదేదీ కాదు. అయితే ఏ స్త్రీ వ్యామోహ పాశానికైనా చిక్కుకున్నాడా! అదీ కన బడదే! అతడు నిష్కాముడే. అస్ఖలితుడే! మరెందు కాతడు ఆ పొదరింటిని చూచి తన ఉనికినే మరచిపోయాడు?'

ఎటూ ఆయనకు తోచ్కలేదు.

'ఆ! కీడులో మేలుగా ఇదీ బాగానే జరిగింది. అతడు నిలు చున్న చోటు కాదంబరీ పితృ రాజ్యమేకదా! వైశంపాయ నుని వెదకుటకు వెళ్ళినట్లూ ఉంటుంది, కాదంబరిని చూచి నట్లూ ఉంటుంది. మిత్రునియెడల తనకు సంభవించినదుఃఖం, కాదంబరివల్ల తనకు సంభవించిన మదన సంతాపం, రెండూ దూరమౌతాయ్. వైశంపాయనుని తోడ్కొని వచ్చుటకే తనకు అనుమతి ఇచ్చినమహారాజు, ఇప్పుడు వెనుదిరిగి వెడితే మరల కాదంబరీదేవి దర్శనానికి ఎట్టి పరిస్థితుల్లోనూ వెళ్ళ

టకు అనుమతించరు. ఇప్పుడు వైశంపాయనుని వెదకుటకు వెళ్ళే నెపంతో కాదంబరీ దర్శనం కూడా చేయవచ్చు!' అంటూ ఒక అభిప్రాయానికి వచ్చి స్కంధావారాన్ని ఆజ్ఞాపించాడు—

'సరి! మీరలు ఈ స్కంధావారాన్ని రాత్రి రెండు జాములకే, నగరం వైపునకు తరలించండి! నేను కొద్ది పరివారంతో మూడవ జాములో వైశంపాయనుని వెదకుటకు బయలు దేరగలను!' అని.

ఆ సైన్యాలు ఉజ్జయిని ముఖం చూచి నాలుగేండ్లు దాదాపు కావొచ్చింది. రాకుమారుని ఆజ్ఞ వారి కెంతో సంతోషమైంది. ఆ రాత్రి వారికి నిద్ర లేదు. మొదటి జాములోనే ప్రయాణ భేరీ నాదాలను ప్రయోగించి, సైన్యాలు నగరం వైపునకు కదలిపోయాయ్.

మిగిలిన పరివారంతో వైశంపాయనుని గురించే, చాలా సేపు మాట్లాడి, చంద్రాపీడుడు మూడవ జాములో కొద్దిగా మిగిలిన గజతురగ సేనను తోడ్కొని, ప్రశాంత విపినంలో దగ్గర మార్గాన్ని పట్టి బయలు దేరాడు. వారితో పాటు రేయి కూడా దగ్గరగా పడింది.

రసాతలం ఉబికింది. చూపులు నిగిడ్చింది. జీవలోకం మహోత్సాహంతో పునఃసృష్టిగా వించబడ్డటు లేచింది. పూల

తలన్నీ వికసించాయ్. ముకుళించిన వృక్షాలూ, పూవులూ సర్వం మేల్కొని నవ్వుతున్నాయ్. గగనస్థలం పారాణి ధరించిన కన్యలా ఎర్రబడింది. పూకన్నియలకు చక్కిలి గింతలు పెడుతూ, సూర్యబింబం ప్రాగ్దిశను నిలచింది.

రాకుమారుడు ప్రయాణం చేస్తూనే ఉన్నాడు. దారిలో అనేక తలంపులాయనకు. కంటిపై కునుకూ, ఆకలిదప్పులూ, ప్రయాణ బడలికనూ ఆయన లక్ష్యం చేయడంలేదు. గగన కుసుమాల్ని అందుకుంటున్నాడు. గాలిమేడలు కడుతున్నాడు.

'హేమకూట పర్వతం చేరి, వైశంపాయనునిగాంచి వెనుక మారుగా వెళ్ళిహఠాత్తుగా ఆలింగనం చేసుకుంటాను. వానిని చూచాక అకారణంగా నాపై ఆగ్రహంచెంది తపోవనానికి వెళ్ళిపోయిన మహాశ్వేతను కలుసుకుంటాను. హఠాత్తుగా వచ్చి నన్ను చూచి ఆమె ఉక్కిరిబిక్కిరై ఉప్పొంగిపోతుంది. అక్కడే నా అశ్వికదళాన్ని, గజదళాన్ని విడిదిచేసి, ఆమెను తీసుకుని హేమకూటం వెడతాను కాదంబరి దాసీలు నన్ను చూస్తారు. గుర్తిస్తారు. కంగారుపడి, నమస్కరిస్తూ ప్రక్కదారులు పట్టి పరుగెడుతారు. ఎక్కడికి? కాదంబరి దగ్గరికి! ఆమెను దాసీలు ఏడిపిస్తారు? 'అబ్బ! చెప్పండర్రా! ఎక్కడకొచ్చాడు రాకుమారుడు? ఇప్పుడెక్కడ?' అని వారినిఅడుగుతుంది. తాత్కాలికంగా నా ఆగమన వార్తతో కాస్త ఉపశమనం కలిగి, కుచపాళిపై కప్పుకున్నతామర పత్రాలనుతొల

గించుకొని. పైటను వేసుకొంటుంది. వాడిపోయిన తామర తూళ్ళపై నుండి శరీరాన్ని కాస్త ప్రక్కకు మార్చుతుంది. నుదుట పూసిన చందన పూతను తుడుచుకుంటుంది. అప్పుడు ఆమె దగద్ధగాయమానమైన లావణ్యం నాకు కనబడేలా కాంతిస్తుంది. చెక్కిళ్ళపై జారిన కురులను, మణిదర్పణంలో సవరించుకుంటుంది. ఆనందంలో, మేను పులకరింతలలో, బయల్వెడలిన జలబిందువుల చే, తానంతవరకూ అనుభవించిన సంతాపాగ్నిని చల్లార్చుకుంటుంది. గళ్ళున మంజీరాలతో లేచి, తడబడుతూ నావైపునకు రాబోతుంది. అప్పుడు తటాలున ఆమెను నేను ఆలింగనం చేసుకుంటా! నా బాహుబంధనంలో యిముడ్చుకుంటా! మదలేఖ సుస్వాగతంతో, కాదంబరీ కర పరిగ్రహణం చేసి, అగరు, గంధ ధూపములతో, పునుగు, కస్తూరి సుగంధములతో అలరారే కాదంబరీ భవనంలోని శయ్యా మందిరాన్ని చేరుతాను. మమ్మక్కడకు దిగబెట్టి మదలేఖ వెళ్ళిపోతుంది. అప్పుడు కాదంబరీదేవి సిగ్గుతో తల వంచుకుంటుంది. ఆ సిగ్గులోనున్న ముగ్ధరాలిని, అరమోడ్పు కన్నులతోనున్న కాదంబరీదేవిని, చేతులపై శయనంపైనుంచి ముద్దుల వర్షం కురిపించి, నా జన్మ సార్థకం చేసుకుంటాను. దేవతలకే దుర్లభమైన ఆమె అధరామృతాన్ని ఆస్వాదిస్తాను. ఆమె సౌందర్యారాధనలో ఆమె రతిస్పందనంలో, మన్మథాగ్నితో దగ్ధమైన నా శరీరాన్ని చల్లబరచుకుంటాను.

'సర్వేంద్రియాలూ, ప్రసన్నత చెందుతాయ్. స్పర్శ భాగ్యంతో శరీరం తేలికవుతుంది. స్వేదం చిందినా అదిఆనంద హేతువు. ఆ సౌందర్య భామినిని అనుభవించడం పదేపదే, ఆమెతో సుఖించడం పునరుక్తి దోషానికి దూరమైనది. బ్రహ్మానందలహరిలో, సహజ సౌందర్య ఉపాసనంలో యౌవ్వనం మరింత యౌవ్వనవంత మవుతుంది.

'అనంతరం ఏకాంతంలో దేవిని ప్రార్థించి మదనలేఖను వైశంపాయనునికిచ్చి వివాహం చేస్తాను. అతడూ సర్వసుఖాలనూ అనుభవించి....' అంటూ ఏవేవో అనుభూతులతో అతడు ముగ్ధుడైపోతున్నాడు.

ఇంద్రాయుధం కన్నుమూయకుండా దారివెంబడి అహో రాత్రులూ ప్రయాణం చేస్తూనే ఉంది.

సగం దూరం వెళ్ళేసరికి కాలం మారింది. వానకారు వచ్చింది. వర్షాకాలం, దారులకు కాలసర్పంలాంటిది. ఎండకు బురద పూతవంటిది. సూర్యునికి రేయివంటిది. చంద్రునికి రాహువు లాంటిది. వియోగులకు మరణం లాంటిది. వాహనాలకు ఉక్కు-బంధంలాంటిది. అది ప్రవాసులకు దాటరాని కారడవి. జీవనలోకమంతా ఆ కాలంలో ఇనుప పంజరంలో బంధించబడ్డ చిలుకలా మారిపోతుంది!

కారు మేఘాలు ఆకాశాన్ని ఆవరించాయ్. ఫెళఫెళార్భటులు పిక్కటిల్లాయ్. మేఘాలు ఘూర్ణిల్లాయ్. ఉరుములు రోదసిని నింపివేశాయ్. ఇంద్రధనస్సులు విరిసాయ్. కుండపోతగా వర్షం!

చీకటి చాటునవచ్చి వెన్నుపోటు పొడిచే కుతంత్ర విరోధిలా పరోక్షంగా వానవచ్చి, చంద్రాపీడుని గమనాన్ని, దారినీ నిరోధించింది. అతడి ఆనందమంతా, కొటుకకుండలా మారిపోయింది. నిట్టూర్పులు విడిచాడు. కన్నీరు కార్చాడు. వర్షాపాతంతో నదులు పొంగాయ్. ఆయన మమతకూడ పొంగింది. కాదంబరిని కలుసుకొని సుఖించగల ననుకున్న ఆయన ఆశ, నడిసముద్రంలో చిక్కుకున్న నావలా మారిపోయింది. పులకితమైన ఆయన శరీరం వర్షపు ధాటికి వొణికిపోతోంది. ఎడతెగని వర్షంతో విచ్చిపోయిన పుట్టగొడుగుల్లా ఆయన కన్నులు ఎర్రబడిపోయాయ్. మొరసిపోతున్న నదుల పోటులకు పడిపోయే గట్లలా ఆయన గుండెలు విడిచిపోతున్నాయ్. ఫెళ ఫెళార్భాటాలకు విచ్చిపోతున్న ఆకాశంలా అతని హృదయం విచ్చిపోతోంది. దిసల క్రమ్ముకున్న అంధకారం ఆయన మోహాంధకారాన్ని ఇనుమడింప జేసింది.

గగనంలోని గాంభీర్య గర్జనలకు గగుర్పాటు చెంది ముక్కులు చాచే చాతక పక్షులు, నేల గుంటలలో బెకబెకలాడుతున్న కప్పలు వర్షపు ధారలను సైతం చీల్చి వేస్తున్న

ఎదురు గాలులు, కోలాహలంతో గర్జిస్తూ కొండ గుట్టలలోని గుహాలను వెదుక్కుంటున్న భయకంపితమైన నెమళ్లు, రాళ్ళపై బడి గుండెలదిరి జారిపోతున్న సెలయేళ్ళు అన్ని ఆయన మనస్సును చెదరగొట్టాయ్.

ఇక చంద్రాపీడునికి శాంతి సన్నగిల్లింది వైశంపాయనుని గాని, కాదంబరీదేవినిగాని ఎంత తలచుకొని తన కోరికలను ఊరింపజేసుకున్నా అశాంతినుండి ఆయన బయటపడడంలేదు.

ఒకవేపు అశాంతి. మరొకవేపు మదనాగ్ని. ఎంత ధీరుడైతేనేం? నిబ్బరాన్ని కోల్పోయాడు - రాకుమారుడు, మోహాంధకారంలో మునిగిపోయాడు. జలభారంతో క్రమ్మిన మబ్బుల ముట్టడిలో చిక్కిపోయాడు. సకల జీవరాసులకు, లోకులకూ జీవహేతువైన వర్షకాలం ఆయన పాలిటి విరోధిగా వెలసింది.

సందిగ్ధావస్థలో, ముంచుకొస్తున్న నదీ ప్రవాహంలోపడి, చిన్నవాడు, కాదంబరీ చింతాపరితప్తుడై వానకురాలే కడిమి పూల పుష్పాడికి కనులు మూసుకుంటూ, ఉరుములకు కంపిస్తూ, మూర్ఛిల్లిపోతూ ముందుకు సాగుతున్నాడు.

బ్రతుకుపై ఆశలను విడిచి పెట్టుకున్న గుర్రాలను అదలిస్తూ, మూత పడిన దిక్కులను దూసుకుంటూ కాదంబరిని చూడగలనన్న కోర్కెను చంపుకోకుండా ప్రయాణం సాగించాడు.

అలా రెండు వంతులదూరాన్ని అధిగమించాడు. ఇంకొక్క వంతు మిగిలింది, ఆ వంతులో మేఘనాథుడు తలవని తలం పుగా ఎదురయాడు.

ఎదురైన వెంటనే రాకుమారుడు ప్రశ్నించాడు—

'మేఘనాథా! పత్రలేఖ ఎప్పుడు వస్తుందో తరువాత చెబుదువుగాని, ముందు వైశంపాయనుని సంగతి చెప్పు! అతడెందు కక్కడ ఆగిపోయాడో, తెలుసుకున్నావా? ఆగిపోయి నందుకు పశ్చాత్తాప పడుతున్నాడా? పడితే, నాతో రావడానికి అతడు సిద్ధపడతాడా? అతని ఉనికెక్కడ ఇప్పుడు?'

'రాకుమారా! వైశంపాయనునికి స్వాగతమిచ్చి, గుర్రంపై తక్షణ మొచ్చి మమ్మలను కలుసుకుంటానన్నారు గదా! మేమువిన్నగా అచ్ఛోద సరస్సుకు వచ్చాం. అక్కడ వైశంపాయనుడున్నట్టే మాకు తెలియలేదు. మీరు రావడం ఆలస్యంకాగా, వర్షకాలం ఇంతలో ఆరంభం కాగా, ఈ కఠిన కాలంలో తమరు ప్రయాణం చేయడానికి మహారాజు, మహారాణీ అనుమతించలేదేమోనని అనుకున్నాం. వైణికుడూ, పత్రలేఖా వెనుక వస్తామనగా, నేను అచ్ఛోద సరస్సుకు వెళ్ళి, ఇప్పుడక్కడనుండే తిరిగి వస్తున్నాను.'

'మరి పత్రలేఖ ఈరోజు తిరిగి వస్తుందనుకుంటున్నావా?'

'నేనేం చెప్పగలను ప్రభూ! కాలంమధ్యలో అంతరాయం కలిగించకపోతే, రావాలి మరి!'

చంద్రాపీడునికి మనస్సు చివుక్కుమంది. కారుమేఘాలు ఆయన కళ్ళకు కాల పురుషులుగా కనబడ్డాయ్. మెరుపులు మదనాగ్నిలా, ఉరుములు యమునిదున్నపోతు గిట్టలధ్వనిలా, వర్ష ధారలు మన్మథ శర పరంపరలా అతడికి గోచరించాయ్. వర్షకాలంలో మరింత మదనాగ్నిని భరించలేక కాదంబరి ఏ విరహ సముద్రంలో మునిగిపోయిందోనని, బెదరిపోయాడు. ఆయనలో దైన్యం ఆవహించింది. మాటలిక తడబడుతున్నాయ్. పంచేంద్రియాలూ స్వాధీనం తప్పాయ్. చుట్టూ నీరు, కనులలో నీరు, హృదయ స్పందనంలో, ఆవేదనలో ఎక్కడ చూచినా నీరు!

సర్వాం జలమయంలా కనబడ్డది — ఆయనకు. కన్నీళ్ళతో కరిగిపోతూ, కాదంబరిని తలచుకుంటూ ఎలాగో ముందుకు సాగిపోయి, అచ్ఛోద సర స్తీరం చేరుకున్నాడు.

# 11

తీరంలో ఎటు చూచినా, వానవల్ల చెట్లూ, పొదలూ, తీవలూ పెరిగిపోయాయ్, పచ్చిక బయళ్ళన్నీ జలమయము లై దారి, అరణ్యంగా మారిపోయింది, తామర మొగ్గలన్నీ మునిగి పోయాయ్. ఆకులు తేలిపోయాయ్. సౌగంధిక, కలువ పుష్పాలు కళను కోల్పోయాయ్. భయంతో తుమ్మెదలు

తిరుగుతున్నాయ్. హంసలు పారిపోయాయ్. మునిగిపోగా మిగిలిన పత్రాలపై నిల్చి చక్రవాక జంటలు రెక్కల మధ్య తలలు దూర్చి ముసుగుకు బిగిసిపోయాయ్.

తాను ఆ సరస్సును అంతకుపూర్వం చూచినా, ఇప్పుడది నూతనంగా కనబడుతోంది. ఆ తీరంపై అతను అంతకు ముందు చూచిన గుర్తులన్నీ చెరగిపోయాయ్.

ఆ చెరిగిపోయిన గుర్తుల్లో ప్రవేశించిన చంద్రాపీడుడు, కూడా వచ్చిన అశ్విక దళాధిపతులకు ఆజ్ఞాపించాడు—

'పొద పొదనూ వెతకండి! మనలను చూచి మనస్సు చెడి, వైశంపాయనుడు ఇందుక్కడైనా దాగి ఉండొచ్చు.'

తనూ, పొదపొదా వెతుకుతున్నాడు. ఎక్కడా వైశంపాయనునిజాడ కానరాలేదు. మనసులో అనుకుంటున్నాడు—

'నేను వస్తున్నట్లు పత్రలేఖవల్ల తెలుసుకొని ఎక్కడికైనా పోలేదుగదా? ఎక్కడికి పోయినా అతడిని చూడకుండా నేనొక్క అడుగైనా యిప్పుడు ముందుకు వేయలేనే!'

ఆయనకు నిరాశ వ్యాపించింది. కారుచీకటిలో కాంతిరేఖలా అంతలోనే బుర్రలో మెరిసింది - 'బహుశా, మహాశ్వేతకేమైనా వైశంపాయనుని జాడ తెలిసి ఉండొవచ్చునేమో! ఎందుకైనా మంచిది - ఆమెను చూచాకనే, ఒక నిశ్చయానికి రావడం మంచిది' అనుకొని, గుర్రాలను

అక్కడే నిల్చి, తన వొంటిపైనున్న కవచాన్ని వొలిచి, ఆయుధాలను తీసి అక్కడనే పెట్టి, వెన్నెల కాంతులనుచిందు ధవళ వస్త్రాలను ధరించి, మహాశ్వేత తపోవనాశ్రమానికి చేరుకున్నాడు. అతడివెంట ఇంద్రాయుధాన్ని కావలికాసే అశ్వికులు మాత్రమే వచ్చారు.

ఆశ్రమోన్ముఖంలోని రాతిబండపై మహాశ్వేత మౌన మూర్తియై కూర్చొని ఉంది. మెరుపు తీవలా ఉన్న ఆమె శరీరం గాలివానకు కంపించిపోతోంది. ప్రక్కనే కన్నీరుకారు స్తూన్న తరళిక ఆమెను పట్టుకున్నది.

మహాశ్వేతను చూడగానే, చంద్రాపీడునికి గుండెలు గుభిల్లుమన్నాయ్.

ఆమెవైఖరి చూడగానే భరించరాని ఆవేదనతో ఉన్నట్టు ఉంది. తనను చూచిగాని అసహ్యతను వెల్లడిస్తోందా?

అనుమానంతో అతడి జీవం నీరు కారిపోయింది. ఎట్లాగో వెళ్ళి, ఆ ప్రక్కనున్న బండరాయిపై కూర్చొని, 'ఎందుకిలా మహాశ్వేత దిగులుగాఉంది?' అన్నట్టు తరళికను ప్రశ్నించాడు'

మహాశ్వేత అతడి రాకనుగాంచి, అతడి ప్రశ్న విని గద్గద స్వరంతో అంది—

'కుమారా! నేను సిగ్గులేనిదానను. నా బ్రతుకే ఒక దౌర్భాగ్యమైనది. రాక రాక వచ్చిన నీకు శుభవార్తకు బదులు, చెడువార్తను చెప్పవలసిన గతి నాకు పట్టింది.

చంద్రాపీడుని ప్రాణాలెగిరిపోయాయ్.

'ఆ చెడువార్తను తప్పదుగాబట్టి చెబుతున్నాను, విను నాయనా! వైశంపాయనుడు నీవు రాగలవని చెప్పాడు. అప్పుడు నేను కాదంబరివద్దనే ఉన్నాను. కాదంబరీ, ఆమె తల్లి దండ్రులూ, నన్ను నీ వచ్చేవరకూ అక్కడుండమని ఎంత చెప్పినా వినక, యీ తపోవనానికి వచ్చేశాను.

'నేను వచ్చాక ఒక విప్రకుమారుడు, సరిగ్గా నీ పోలికల గల వాడొకడు నా చెంతకొచ్చి, కన్నీరు కారుస్తూ, ఏదో పోగొట్టుకున్నవానిలా, మతి చెడినవానిలా, శూన్యంగా నా వైపు చూశాడు.

'చూచి, నా దగ్గరకొచ్చి అంతకు మున్నెన్నడూ పరి చయం లేకపోయినా, అతిసన్నిహితునిలా, నాకు అధీనుడైన వానిలా, నన్ను చూచి ఆనందిస్తున్నవానిలా, నా దుఃఖాన్ని సగం పంచుకున్నవానిలా, పిచ్చెక్కినవానిలా అలాగే నిలబడి నన్ను చూడసాగాడు.

'కాస్సేపలా చూచి, నన్నడిగాడు—

'తన్వీ! సహజానుగుణమైన స్వభావాన్ని ఎవరూ కాదనరీ లోకంలో. కాని నీవు సహజ సౌందర్యంతో ఉట్టిపడుతూ, తద్విరుద్ధమైన యీ తపస్సుకు ఎందుకు పూనుకున్నావో అర్థం కావడంలేదు. లేజాజి పూదండవలె కంఠాన్ని అలంకరించ

వలసిన నీ శరీరాన్ని ఎందుకిలా, తపోగ్నిచే తగల బెడుతు న్నావ్? నీ వయోయావ్వన రూపాలకు తగిన ఫలాన్ని మనోహర లతా కాంతవలె పొందుటకు ఎందుకు ప్రయత్నిం చవ్? నీలాంటి యావ్వనవతి, జీవన సుధారాగంపై విరక్తి చెందితే, మన్మథుని ధనస్సు మూలబడిపోయినట్టే గదా? వసంతమిక వ్యర్థమేగదా! పూలవానలూ, వర్షోదయాలూ, వెన్నెలలూ, సెలయేళ్ళూ అన్నీ అడవినగాసిన వెన్నెలయే గదా! బూడిదలో పోసిన పన్నీరేకదా?' అంటూ ఏవేవో అతడేం మాట్లాడుతున్నాడో అతనికే తెలియని స్థితిలో మాట్లాడేస్తున్నాడు.

'పుండరీకునితోనే తనువంతమైపోయిన నేను అతడి కేమీ సమాధానం చెప్పలేదు. అతడిని నీ వెవ్వరవనికూడా అడుగలేదు. అతడ్ని తప్పించుకోవాలని నేను దేవ పూజకు పూలు కోసుకోడానికి వెడుతూ తరళికతో చెప్పాను - 'తరళికా! ఇతడెవరో విప్ర కుమారునిలా కనబడుతూ నన్ను అన్యథా భావిస్తున్నాడు. ఇతడమంగళం పాలు కాక తప్పదు,' అని.

'ఆమె అతడిని ఎంత ఆటంక పరచినా కామాంధకారం వల్లనో, అమంగళంపాలు కానుండడం వల్లనో నా మీద అనురాగాన్ని అతడు విడనాడుకోలేదు.

'అలా కొన్నిరోజులు గడిచాయ్. వెన్నెలరోజు వచ్చింది. తరళిక నిద్రపోతోంది. నాకు నిద్ర పట్టలేదు. ఆవేదనతో బయటకొచ్చి ఈ బండపైనే కూర్చున్నా. 'అచ్ఛోద' సరస్సునుండి పిల్ల గాలులు వీస్తూ ఇటే వస్తున్నాయ్. ఆ వీచికల్లో నా ఆలోచనలు అలలు అలలుగా పైకి లేచాయ్. పుండరీకుడు, అతడ్ని ఎత్తుకు పోయిన మహాపురుషుడు, వారిని వెంటాడి వెళ్ళిన కపింజలుడు ఏమైనట్లు? ఎక్కడికి పోయి నట్టు? ఆ మహాపురుషుడు నాకిచ్చిన మాట ఏమైనట్లు? ఇవే నా తలపులు!

'సరిగ్గా ఆ సమయానికల్లా మళ్ళీ ఆ యువకుడు నాముందు కొచ్చాడు. అతడిశరీరం మదనాగ్నిలో భస్మమై, పైకెగసిన మొగలి పుప్పొడిలా తెల్లగా ఉంది. కాముని బాణాలు గుచ్చుకొని గగుర్పొడుస్తున్నట్లు అతడి శరీరం వొణకు తోంది. తామరతూండ్లు కుండలాలుగా ధరించాడు. మొగలి రేకు మొన కర్ణాంతంలో ఉంది. ఉద్వేగంతో ఆయువకన్నెకు ధారాపాతంగా కారుతోంది. నా ప్రాణగ్రహణం కోసం మంగళస్నానం చేసివచ్చినట్లు, అతడి శరీరమల్లా స్వేదమయ మైంది. నన్ను ఆలింగనం చేసుకోవాలన్న తలంపుతో అల్ల కల్లోలమైనరాగసముద్రాన్ని ఈదుకువస్తున్నట్లు కనుపించాడు. కామ పరతంత్రుడై త్రాగుబోతులా, పిచ్చివానిలా నిలిచాడతడు.

'నేను హడలిపోయాను. ఆ పిచ్చిలో అతడు నన్ను తాకాడా! నేను తక్షణం ఈ శరీరాన్ని విడిచిపెట్టేయాల్సిందే గదా! ఎంత కాలంగానో నా పుండరీకుని సందర్శనం కోసం ఎదురు తెన్నులు చూచి శుష్కించిన ఈ బొందె కూడా వ్యర్థం కానున్నదే! కొన్ని క్షణాలు గడిచాక అన్నాడు—

'చంద్రవదనా! కామసఖుడైన చంద్రుడు నన్ను వెంటాడు తుండగా, ఇటు వచ్చి నిన్ను శరణు వేడుకుంటున్నాను. శర ణన్నవానిని రక్షించడం, తపస్వినులకైనా తక్షణ కర్తవ్యమే గదా! లేదా, నేనా కాముని బాణాలకు హతమైపోతాను - కాపాడు నన్ను!'

'ఛీ! ఛీ!' అని గద్దించాను నేను. నాలో క్రోధారుణ జ్వాలలు పైకి లేచాయ్. నిప్పులు గ్రక్కే చూపులతో అతడ్ని భయపెట్టాను. తొక్కత్రొక్కిన త్రాచులా లేచి, కఠినోక్తు లాడాను—

'ఓరీ! దుర్మార్గుడా! ఈ మాటలన్నందుకు నీ నెత్తిపై పిడుగులు పడతాయ్ జాగర్త! నీ నాలుక వేయి చీలికలై పోతుంది సుమా! నీవింత నైచ్యంగా మాట్లాడుతున్నా, నీపై జాలే కలుగుతోంది. కానియ్! నీ మాటలకు తగ్గ జాతి లోనే నీవు పుట్టి ఇక ముందు మాలాంటి వారిని కామించ కుందువుగాక'' అని నేను చంద్రునివైపు తిరిగి 'దేవా! నేను

పుండరీకుని తప్ప మరో పరపురుషుని తలంచని దానవైతే, ఈ కాముడు, చిలుక జాతిలో పుట్టుగాక!' అని నా శాపాన్ని పునరుద్ఘాటించాను.

'నేనలా ఉద్ఘాటించగానే, పూర్వజన్మ పాపంవల్లనో, కామపీడనవల్లనో, నా శాపశక్తివల్లనో అతడు, మొదలు తెగిన మ్రానులా నేలపై పడిపోయాడు. అతను చనిపోయాక అతడ్ని చూచిన వారు చెప్పుతున్న దానినిబట్టి అతను మీ స్నేహితుడేకావచ్చు' అంటూ మహాశ్వేత, కన్నీరు కారుస్తూ సిగ్గుతో తలవాల్చింది.

చంద్రాపీడుడు ఆమాటలు విన్నంతనే, క్షణకాలంస్పృహ తప్పాడు. తరువాత అతడి మాటలు తడబడ్డాయ్ —

'భగవతీ! నా వైశంపాయనుడు పోయాక, కాదంబరీ దర్శనం కలగక పోయాక ఇక నేను బ్రతికేందుకు!' అనేసి మరల చంద్రాపీడుడు కాదంబరీ వియోగ దుఃఖంతో, గుండె విచ్చి క్రింద పడిపోయాడు.

ఆయన పరిజనం ఆయన్ను పట్టుకొని విలపించ సాగారు. రుసరుసలాడుతూ మహాశ్వేతను నిందించారు—

'మహాపాపీ! దుష్టసన్యాశినీ! ఎంతపని చేసావ్! లోక కళ్యాణ కారకుడైన తారాపీడ వంశాన్ని తుదముట్టించావ్! అనాథులకిక దిక్కులేకుండా చేసావ్! ధర్మాన్ని సర్వ నాశనం చేసావ్! అయ్యో! ఇక మహారాజును మే మెలా

చూడగలం! విలాసవతీదేవిని ఎలా ఓదార్చగలం! ఇంత కాఠిన్యమా నికృష్టురాలా!' అని.

ఇంద్రాయుధం రాకుమారునిపై దృక్కులు నిగిడ్చి, విలపిస్తూ, పదతాడనతో స్ఖలిస్తూ నురుగులు గ్రక్కుతూ, తన కున్న బంగారు జీనును త్రెంచుకోడానికి ప్రయత్నిస్తోంది.

* * *

అక్కడ పత్రలేఖ, చంద్రాపీడుని ఆగమన వార్తను కాదంబరి కందించింది. ఇక నేం కాదంబరి – మేఘ ఘర్జనకు నాట్యం చేసే నెమలిలా, వసంతోదయానికి సుస్వాగతమిస్తూ పాటలుపాడే కోయిలలా, ఆనందపరవశురాలై మహాశ్వేతను చూచిరావాలని సింగారించుకొంది. అందెలు, కింకిణీలు, మణి మేఖల, రత్నహారం, పూలమాలలూ, సన్నని వస్త్రాలూ ధరించి సుగంధ ద్రవ్య శోభితురాలై పరిచారికలతో మదలేఖ దారి చూపిస్తుండగా మహాశ్వేతాశ్రమానికి బయలుదేరింది.

'మదరేఖా! రాకుమారుడు వస్తున్నట్టుగదా, పత్రలేఖ చెప్పింది! అతడు వస్తాడని నమ్మకం నాకు కలగడంలేదు. ఒకవేళ వచ్చి మాటాడించినా నేను మాటాడను. ఆ కఠినుడు నా కాళ్ళపై పడినా, మెత్తబడను! అతడిన్ని నీవే సమాధాన పరచుకో!' అంటూ చంద్రాపీడునిపై మండిపడుతూనే, అతడి దర్శనానికి ఆతృతపడుతూ, చరచరా, వచ్చింది – ఆవనానికి.

కాని చంద్రాపీడుడు జీవరహితుడై కాన్పించాడామెకు.

అంతే! త్రుంచివేసిన తులసి మొక్కలా, తల తెగిన అరటి మానులా, తల్లడిల్లి పోయింది-కాదంబరి!

ప్రాణం పోయిన తన ప్రియుని చూడగానే 'కెవ్వు'న ఒక్కటే కేక పెట్టింది. ఆ కేకతోనే ఆమె మూర్ఛిల్లి క్రింద పడిపోగా, మదలేఖ పట్టుకుంది.

కాస్సేపటికి తెలివి వచ్చింది - కాని వికార చూపులు ! మదలేఖ చలించిపోయింది—

'చెలీ! తమాయించుకోమ్మా! దుఃఖాన్ని అణచుకోమ్మా! మదిరాదేవినీ, చిత్రరధుడ్నీ తలచుకో తల్లీ! నీవు లేకపోతే, ఆ రెండు వంశాలూ, నిర్వంశాలై పోతాయమ్మా!'

పిచ్చి చూపులతోనే కాదంబరి అంది—

'పిచ్చిదానా! నా ప్రియునితోనే, నా బ్రతుకు వ్యర్థమై పోయింది. నాపై ఆశనిక వొదిలిపెట్టు, ఎవరికోసం మిమ్మల నందర్నీ శీతలోపచారాలతో వేధించుకు తిన్నానో, ఎవరి కోసం మహాశ్వేతను కష్టపెట్టి ప్రతిన పూనానో, ఆ నా మనో హరుడే పోయాక, యీ కాయ మెందుకు ! యీ లోక మెందుకు! మదలేఖా! ఇప్పుడు నాకు మరణమే జీవితం! నాపై నీకు దయే ఉంటే, నా వల్ల నా తల్లి దండ్రులు మరణించ కుండా చూడు! నీవే వారికి కూతురవై మెలగు. నాకు జలాం

జలిని వదలే పుత్రుడ్ని కని, నా వంశం దిక్కులేనిది కాకుండా చూడు!

'నా భవనం ముంగిట, పెళ్ళి చేద్దామని నేను పెంచిన గున్నమామిడి మొక్క, మల్లెతీగా ఉన్నాయ్. వాటికి ని చేతులతో పెళ్ళిచెయ్. నా మందిరం తలవైపు గోడకున్న కాముని బొమ్మ ఉన్నదే, దాన్ని దగ్ధంచెయ్! నా క్రీడా శైలాన్ని ఏ తపస్వికో, తపోవనంగా దానం చేసివెయ్! పాపం! నా ఉల్లాసంకోసం, గోరువంకనూ, చిలుకనూ, పంజరంలో బంధించాను. వాటిని వొదిలివేయ్. నా ఆభరణాలన్నీ అనాధులకు దానంచెయ్! ఇకమిగిలిన తారహారాలూ, తామర పాన్పులూ ఇవన్నీ ఉన్నాయ్ వాటితో నాఅంత్యక్రియలు జరిపించు!' అంటూ కాదంబరి, మదలేఖకు తుది మాటలు చెప్పి, మహాశ్వేతను కౌగలించుకొని—

'సఖీ! నీకు జీవితంలో ఆశనేది మిగిలి ఉంది! నాకా ఆశ అంతరించిపోయింది. నాకుసెలవియ్. బాగుంటేమళ్ళీజన్మలో కలుసుకుందాం' అని కన్నీరు కార్చింది.

ప్రియుని ముఖాన్ని చూచింది. గడియసేపు ఆయనతో శయన సుఖాన్ని అనుభవించినట్టుగా ఆమె కనులనుండి ఆనంద బాష్పాలు దొరలాయి. శరీరం చెమర్చింది. ఒడలెల్లా పులకరించింది. గబగబా ముందుకొచ్చి ముంగురుల్లో ముడుచుకున్న పూలను ఆయన పాదాలకు అర్పించింది. అమృతంలా

స్వేదబిందువులు కారే తన చేతులతో చంద్రాపీడుని తన వొడిలోకి తీసుకొంది.

ఆమె కరస్పర్శతో చంద్రాపీడునినుండి ఒక దివ్యకాంతి పైకి లేచి ఆ ప్రదేశాన్నంతనూ, తేజోమయం చేసి, ధవళ కాంతితో పైకి వెళ్ళిపోయింది. ఆ వెంటనే ఆకసంనుండి అశరీరవాణి పల్కులిలా వినబడ్డాయ్—

'వత్సా, మహాశ్వేతా! నీపుండరీకుని శరీరం నాలోకంలో నీ సమాగమం కోసం ఎదురు చూస్తోంది. ఇక, ఈ తేజోమయమైన నా శరీరం నశింపు లేనిది. ఈ కాదంబరి కర స్పర్శతో అదసలే నశించదు. కాని ఈ చంద్రాపీడుని శరీరం శాపగతంచే విముక్తమైంది. సమయం వచ్చేవరకూ ఈ బొందెను మాత్రం కాపాడండి, అతడు తిరిగి జీవిస్తాడు!'

అంతా ఆపల్కులు వినబడ్డ వైపుకు ఆశ్చర్యంగా చూస్తున్నారు. పత్రలేఖ మాత్రం ఆ తేజస్సుకు, పలుకులకు తెలివొంది, లేచి ప్రక్కనున్న అశ్వికుని చేతిలోని ఇంద్రాయుధాన్ని లాక్కొని 'నీ స్వామిని విడిచిపెట్టి నీవింకా ఉన్నావా, సిగ్గులేదూ?' అంటూ దాన్ని 'అచ్ఛోద' సరస్సులోకి త్రోసివేసి, దానితో తనూ అందులోకి దూకేసింది.

వారు నీటమునిగిన కాస్సేపటికి అందులోనుండి ఒక తాపస కుమారుడు పైకి వచ్చాడు. నీటికి చివికిపోయిన మందార వల్కలాలు ధరించాడు. ముఖం మీద నీటి బిందువులను

రాలుస్తూ, పడుతున్న జడలను ప్రక్కకు తోస్తూ, కన్నీరు నిండిన అరుణ నేత్రాలతో ఖేద పడుతున్నాడు.

మహాశ్వేత వద్దకు అతడొచ్చి ఆవేదనతో—

'గంధర్వ భామినీ! మరో జన్మనెత్తినట్లున్న నన్ను నీవు గుర్తించావా?' అని అడిగాడు.

తేరి చూచింది-మహాశ్వేత! ఒక కంట ఆనంద బాష్పాలు, మరోకంట విచార బాష్పాలు రాలగా చేతులు జోడించింది.

'ఆహా! కపింజలా! నిన్ను గుర్తించలేనంతటి పాపినను కున్నానా? అవును. అనుకోవలసిందే. లేకపోతే పుండరీకుడు పోయినా, ఇలా మోడులా బ్రతికున్నావంటే ఏమిటి? ఇంతకూ ఆయనను ఎత్తుక పోయిన వాడెవరు? వారిని ఒదిలి నీవు వొంటరిగా ఎందుకొచ్చావ్?'

'అదా? అయితే విను! నేను ఆ ఎత్తుక పోయినవాని వెంట పడి, దేవతా స్త్రీలు దారి ఇస్తుండగా, అభిసారిక తారకలు నమస్కరిస్తుండగా నక్షత్రలోకం దాటి చంద్ర లోకంలో అడుగు పెట్టాను. అక్కడ అతడు, పుండరీకుని పెద్ద మణి మయమైన పాన్పుపై ఉంచి నాతో అన్నాడు—

'కపింజలా! నేను చంద్రుడ్ని, నేను పోతున్నప్పుడు, ఇతడు వొట్టి పుణ్యాన నన్ను శపించాడు. 'దుష్టుడా' చంద్రుడా! నేను నా ప్రియురాలిని పొందలేక వేదన చెందుతూంటే, నీవా చల్లని కిరణాలతో నన్ను చంపుతున్నావా? నీవుకూడా

కర్మభూమియైన భారత వర్షంలో ప్రేమించిన ప్రియురాలిని పొందలేక ప్రాణం విడుతువుగాక!' అని.

'అతడి శాపంతో నేను భగ్గుని మండిపోయాను. మండిపోతూ, నేనాయన్ను శపించాను. 'నాతోపాటు నీవూ సుఖదుఃఖాలను పంచుకుంటూ ఉందువుగాక!' అని. తరువాత నాకు కోపం తగ్గింది. ఆలోచించాను. మహాశ్వేత ఇతడిన్ని ప్రేమించిందని తెలుసుకున్నాను. మహాశ్వేత నా కులంలోని గౌరికి పుట్టినది. ఇతనినామె స్వయంగా వరించింది. ఈ స్వయంకృతాపరాధంతో, అతడు నాతోపాటు భూమిపై రెండుసార్లైనా పుట్టవలసి ఉంది. అంచేత అతడిశరీరం నశించకుండా, యీ శాపాంతంవరకూ భద్రపరుద్దామనే దీన్ని నేను తీసుకువచ్చాను. వస్తూ మహాశ్వేతకు ధైర్యం చెప్పాను. నీవు పోయి, ఇతడి తండ్రి శ్వేతకేతుకు యీ విషయాన్ని చెప్పు! అతడు తరుణోపాయాన్ని వెదక్కపోడు!' అని చంద్రుడు నన్ను పంపివేశాడు. నేను వస్తూ, శోకావేశంతో దారిలో అడ్డువచ్చిన ఒక దేవదూతను ఢీకొన్నాను. అతడు కోపిష్టి. వెంటనే నన్ను శపించాడు – 'దురహంకారీ! ఇంత గగనమార్గం ఉండగా, నన్ను గుర్రంలా, దాటివెడతావా? నీవా గుర్రంగానే మనుష్య లోకంలో జన్మింతువుగాక!' అని. అప్పుడు నేను క్షమాపణ కోరుకొని శాపాన్ని మళ్ళించ

మన్నాను. 'అయితే విను. నీవు ఎవరికి ఎన్నాళ్ళు వాహ నంగా ఉన్నా, అతడు చనిపోగానే నీటిలో మునిగితే శాపం పూర్తవుతుంది,' అన్నాడతడు. నేను మరల కోరుకొన్నాను. 'మహానుభావా! అయితే నా మిత్రుడు పుండరీకుడు కూడా, చంద్రునితోపాటు భూలోకంలో పుట్టాలే! అతడితోనే నేను గుర్రంగా ఉండేలా చేసిపెట్టండి!' అని.

'అతడు దివ్యదృష్టితో చూచి - నాయనా! నీ మిత్రత్వం మెచ్చుకోదగింది. ఉజ్జయినీలో తారాపీడుడు పుత్రుడికోసం తపస్సు చేస్తున్నాడు. అతడికి చంద్రుడు కొడుగ్గా పుడతాడు. నీ పుత్రుడు పుండరీకుడు కూడా ఆ రాజు మంత్రి శుకనాసు కిని పుత్రుడై జన్మిస్తాడు, నీవుకూడా, చంద్రాత్ముడైన ఆ చంద్రాపీడునికి వాహనంగా ఉండు!' అని దేవదూత అదృశ్యమైపోగానే, నేను సముద్రంలో పడిపోయాను. గుర్రమై బయటికొచ్చాను. నాకు పూర్వజ్ఞానంపోలేదు. అందుచేతనే, చంద్రావతారుడైన చంద్రాపీడుడ్ని యీ ప్రదేశానికి తీసుకు వచ్చాను. మహాశ్వేతా! నిన్ను కోరినవాడూ, నీవల్ల శపింప బడినవాడూ ఎవరనుకున్నావ్? వైశంపాయనుడనుకున్నావా? కాదు. పూర్వానురాగుడైన, నా మిత్రుడు - పుండరీకుడే!'

'అయ్యో పుండరీకా! నేనెంత దుర్మార్గురాలిని? నీ కోసం వ్రతంపట్టి ఉండికూడా, కాళ్ళ చెంతకొచ్చిన నిన్ను కాల దన్నుకున్నానే? చేజేతులా నిన్ను చంపుకున్నానే? గత జన్మ

లోనూ, ఈ జన్మలోనూకూడా నీ మరణానికి కారణ భూతు రాలనైనాను. ప్రభూ! నన్ను క్షమించవా? పలుకవా?'

'అమ్మా! ఎందుకిలా నీకునీవే నిందించుకుంటావ్? నీవేమి తప్పు చేసావని? సుఖం రానున్న సమయంలో నీకా విచార మెందుకు? నీ శోకం నా మిత్రునికి మంగళకరం కాదు. తపో బలంచే సాధించలేని దేముంది! గౌరి, ఈశ్వరుని అర్ధశరీరాన్ని దేనితో సాధించింది? ఊరట చెందమ్మా! ఆ తపోబలంతో నీ ప్రియుడ్ని బ్రతికించుకో! నీవు బ్రతికించుకో గలవ్.'

'అయితే కపింజలా! నీతో పాటు ఈ సరస్సులో పత్రలేఖ దూకినదే, ఆమె ఏమైనది?'

'ఏమో, ఆ సంగతి నాకేం తెలుసు? ఆ చంద్రాపీడుని గురించీ, వైశంపాయనుని గురించీ, పత్రలేఖ గురించీ, తెలుసు కుందామనే, ఇప్పుడు నేను శ్వేతకేతు మహర్షి వద్దకు వెడు తున్నా. అతడు మహాజ్ఞానసంపన్నుడు!' అంటూ కపింజలుడు ఆకాసంలోకి ఎగిరిపోయాడు.

అతడలా ఎగిరిపోగానే, కన్నీరు విడుస్తూ కాదంబరి మహాశ్వేత నడిగింది—

'నెచ్చెలీ! విధాత నీవలె నన్నూ దుఃఖితురాలుగా చేసాడు, అందుకు నేను బాధపడను. నీ చెలినై ఆమాత్రం దుఃఖాన్ని పంచుకో లేకపోతే ఇక నా బ్రతుకెందుకు? ఇప్పుడు నేనేం

చేయాలో చెప్పు ! నా మనస్సు డోలాయమానంగా ఉంది, ఏమీ తోచడంలేదు.'

'ఇందులో చెప్పేందు కేముంది? పుండరీకుని విషయం కపింజలుని ద్వారా తెలిసిందిగదా? ఆ అశరీరవాణి ద్వారా చంద్రాపీడుని గురించి కర్తవ్యబోధన జరిగింది. దేవతలను రాతి విగ్రహాలుగాచేసి కొలిచే మనం ప్రత్యక్ష దైవమైన చంద్రాపీడుని మూర్తిగా ఆరాధించి ఈ శరీరాన్ని చెడకుండా చూచుకోడమే కర్తవ్యం.'

అప్పుడు కాదంబరి మౌనంగా లేచింది. ఒంటిపైనున్న నగలను వొలిచి వేసింది. రాసుకున్న సుగంధ ద్రవ్యాల సువాసన, వేసుకున్న తాంబూల రాగరక్తిమ చెరగునందాకా సరస్సులో స్నానం చేసింది. శృంగార జీవితాన్ని విసర్జించి, తాపస వేషధారియై తెల్లని వలువలనే ధరించి, రూపుగొన్న శోకంలా మారిపోయి, తన ప్రియుని పాదాలను ఒడిలో పెట్టుకొని కూర్చొంది.

చీకటి పడింది. దట్టంగా మబ్బు క్రమ్మింది. ఎక్కడి వారక్కడే పడుకున్నారు. కాని ఆ అర్ధరాత్రి మేఘ గర్జనలతో, భయకంపితమైన మెరుపులతో, ఆకాశం ఘూర్ణిల్లుతున్న ఆ కారడవిలో, స్త్రీ సహజమైన భయాన్ని విసర్జించి, కంటిపై కునుకు పడనీయక, తన పతి చరణాలను చూచుకుంటూ, ఆమె గడిపి వేసింది.

తెల్లవారింది. తెర తొలగించిన చిత్రంలా చంద్రాపీడుని శరీరం ఆమెకు కనబడింది. ఆ ముఖంలో వినూత్న ప్రకాశం ద్యోతకమయింది. ఆమె వదనారవిందం వికసించింది. ఆనందంతో, ఆ శరీరాన్ని మదలేఖకు చూపి—

'మదలేఖా, చూసావుటే యీ శరీరం! సహజకాంతితో జీవజ్యోతిలా ఎలా తొణికిసలాడుతోందో!' అంది.

'అవునమ్మా! తామరపద్మంలాంటి ఈయన ముఖం ఎక్కడా కళతగ్గలేదు. చిరునగవులు చిందే పెదవులు, ఆనగవులు చిందకున్నా, చెక్కిళ్ళను మెరయిస్తూనే ఉన్నాయి, దీనిని బట్టి కపింజలుడు చెప్పిన గాధ నిజమేనమ్మా!'

'నిజమేనంటావా!'

ప్రక్కనే విచిత్రంగా ఆ శరీరాన్ని చూస్తున్న అశ్వికులు అన్నారు—

'ఇంకా నిజమేనా అంటున్నారా! మా రాకుమారుడు మాకు ఎరికలేదా! ఆ చరణద్వయం, వికసిత కమలాలను పోలే ఉన్నది. ముఖం పూర్వంమల్లె పున్నమ చందురుని పోలే ఉంది. ఇదంతా నీ మహాత్మ్యం తల్లీ! కాకపోతే, యీ విచిత్రం, ఎప్పుడైనా విన్నామా, కన్నామా!'

ఇప్పుడు కాదంబరి విశ్వాసం మరింత ఎక్కువైంది.

'అయితే మదలేఖా! నీవు క్రీడా శైలానికి వెళ్ళి, ముందు మా తల్లిదండ్రులకు చెప్పవే. వారు నాచింతలో నిలువలేరు

వారికి నా ప్రియుడు బ్రతుకునన్న నమ్మకం కలిగించి, విల పించకుండా చేసిరావే!'

మదలేఖ వెళ్ళివచ్చింది—

'చెలీ! నీ కోరిక సిద్ధించింది. చిత్రరథుడు చాలా సంతో షించినాడమ్మా! మీ అమ్మ మదిరాదేవి, నిన్ను ఆలింగనం చేసుకున్నానని తన మాటలుగా ఇలా చెప్పమన్నారు. మా బిడ్డ అల్లునితో ఉన్నదని మాకు తెలియనే తెలియదే! ఆయన చంద్రుని అవతారం గావడం మరీసంతోషం! శాపం తీరాక, అల్లునితో ఆనందంతో తొణికిసలాడే మా బిడ్డ ముఖాన్ని త్వరలోనే చూడగలం!' అనిమదలేఖ వూరుకుంది.

ఇక కాదంబరిలో సంతోషం పరవళ్ళు త్రొక్కింది. వర్షాకాలం అంతరించింది. నేల బిరుసెక్కి, రథాశ్వాలు పోడానికి వీలుచిక్కింది. అప్పుడే మహారాజు చంద్రాపీడుని సంగతి తెలుసుకొని రమ్మని, దూతలను పంపాడు, ఆ దూత లకు మేఘనాధుడు, చంద్రాపీడుని అవస్థను వివరించి త్వర లోనే చంద్రాపీడునితో అందరమూ రాగలమని మహారాజుకు విన్నవించమని చెప్పి పంపివేసాడు.

# 12

మహారాణి విలాసవతీదేవి, కుమారుని జాడ తెలియ లేదని, శోకానల తప్తయై పరితపించి పోతోంది. చంద్రాపీడుడు తిరిగివస్తే మొక్కు చెల్లించుకుంటానని సర్వదేవతలకూ మొక్కుకుంది. ఆ రోజు అవంతీ నగర దేవతలైన అవంతీ మాతృకల దేవాలయానికి బయలుదేరబోతోంది.

ఇంతలో దాసీలు పరుగెత్తుకొచ్చి—

'అమ్మా! అవంతీ మాతలు అనుగ్రహించారు. యువరాజు వద్దకు పంపిన దూతలు తిరిగి వచ్చారు.' అని విన్నవించారు.

'ఏరీ! ఎక్కడ దూతలు! త్వరగా ప్రవేశ పెట్టండి!' అని మహారాణి ఆతృతతో పూల పళ్ళెరాన్ని అక్కడే ఉంచి, రెండడుగులు ముందుకేసి మునివ్రేళ్ళపై సాగిసాగి మరీ చూస్తోంది.

దూతలు ధూళితో రూపు మారి వచ్చి మహారాణి ముందు నిలిచారు.

'ఏమయ్యా, అలా మౌనం వహిస్తారు! ముందు నా కుమారుని చూచారో లేదో సూటిగా చెప్పండి!'

కంపిస్తున్న పెదవులతో భద్రసేనుడన్నాడు—

'చూశాం, దేవీ! వివరాలు భరతసేనుడు నివేదిస్తాడు.'

'అతడింకేం నివేదిస్తాడు? మీ ముఖాలు చిన్నవోయి ఉండడం చూస్తే.........అయ్యో! కుమారా! నీ కేమి జరిగి పోయింది? నా కన్నుల పండుగ చేస్తూ ఎందుకు రాలేదు నాయనా! ఆలస్యం చేయకుండా వెనువెంటనే వస్తాననినాతో అని వెళ్ళావే! బాబూ! నన్ను అక్కడ నుండైనా ఒకసారి 'అమ్మా!' అని పిలవరా! నీ నోట మాట వినాలని ఉందిరా! ఈ భరతసేనుడు గుండెలు వ్రక్కలు చేసే ఇంకే వృత్తాంతం చెబుతాడో, వొద్దు! నాకా వృత్తాంతం వద్దు. నా బాబు కోసం ఏడ్చి ఏడ్చి మరణించనివ్వండి!'

ఆ పలుకులతో ఆ మహాతల్లి మూర్ఛితురాలై పోయింది. ఆమె పడిపోతుండగా, దాసీలు ఆమెను పట్టుకున్నారు!

ఆ వార్త అప్పుడే చిలవలు, పలవలు అల్లుకొని మహా రాజు చెవిలో ప్రవేశించింది. ఉన్న పళంగానే మహారాజు వడదడ కంపించిపోయి, శుకనాసునితో బయలుదేరి అంతః పురానికి వచ్చాడు. అతనితో రాజభవనమే కదిలిపోయి వెళ్ళి పోయింది.

అక్కడ మహారాణికి దాసీలు శీతలోపచారాలు చేస్తు న్నారు. అరటాకులతో వీస్తున్నారు. అరమోడ్పు కన్ను లతో అప్పుడప్పుడే తెలివిని పొందుతున్న మహారాణిని తారా పీడుడు చూచాడు. ఆమె నుదురునూ, చెక్కిళ్ళనూ తాకుతూ మార్దవం కంఠంలో తొణికిసలాడుతుండగా అన్నాడు—

'దేవీ, ఎందుకీ విచారం? మన కుమారుడు పోయాక మన మెలాగూ బ్రతుకముగదా! చేయవలసిన జీవిత ధర్మా లన్నీ చేసాం. పుత్రుడ్ని కన్నాం. పుత్రోత్సాహం చేసాం. పుత్రుని రూపూ, శక్తీసీ చూసి ఉప్పొంగి పోయాం. ఇక ఆనందించ దగినది మన జీవితంలో ఏముంది, చెప్పు? మిగిలి ఉన్నదా మరణం ఒక్కటేగదా? ఇంతకూ ఏమి జరిగిందో మనకు తెలియదుగదా? వివరాలు తెలుసుకున్న పిదపచావో, బ్రతుకో స్వీకరించవచ్చును గదా?'

వెంటనే భరతసేనుడు ముందుకొచ్చి ఆ వివరాలు చెబుతూ చంద్రాపీడుని గుండె పగిలిన వృత్తాంతాన్ని ఎత్తే సరికి మహారాజు, మొదలు నరిగిన మ్రానులా కూలబడి పోయాడు.

'ఇకాపు చెయ్ భరతసేనా! ఆహా! నాయనా! వైశంపా యనునిపై నీకున్న ప్రేమ మాకు లేకపోయెనే? అతనితో పాటు నీవూ వెళ్ళిపోయావా? ఆ మాత్రం పుణ్యం మాకు కూడా పంచి పెట్టవా, బాబూ?.... దేవీ! పద! మన బిడ్డడు ఒంటిగా దూరం పోకుండానే మధ్యలో కలుసుకుందాం. మహాకాళి దేవాలయం ఎదుట చితిని పేర్చమని ఆజ్ఞాపించు! పురోహితా! ఆలస్యం చేయకు! ఖజానాలు విడగొట్టి దాన ధర్మాలు సాగించండి! పేర్పించండి-చితుకలు! నా కొడుకు చనిపోయాడు. ఇక తారాపీడునికి రాజ్యమక్కర లేదు.

యీ శరీర మక్కరలేదు.' అని విలపిస్తూండగా, భరతసేనుడు 'మహారాజా! మహారాజా!' అని రెండుసార్లు పిలిచి, మహారాజు తనను చూడగానే—

'మహారాజా! యువరాజు గుండంటే పగిలింది కాని ఆయన శరీరం జీవకాంతి తగ్గలేదు మహాప్రభూ! ఏదో శాప దోషంవల్ల జరిగినదేకాని ఆయన చనిపోలేదు ప్రభూ!' అంటూ వైశంపాయన, చంద్రాపీడుల శాపగత కారణాలను వినిపించాడు.

అతడు చెప్పినమాటల్లో నమ్మదగిన అంశాలెన్నో మహారాజుకు కనబడ్డాయ్. ఆశ్చర్యంతో, నిలువుగ్రుడ్లు వేసి విన్నాడు. శుకనాసుని ముఖాన్ని చూచాడు. మిత్రులు తామెంత దుఃఖంలో ఉన్నా, తమ దుఃఖాన్ని అణచుకొని, మిత్రుల శోకాన్ని ఉపశమింపజేయడానికి కృషి చేస్తారుగదా! అలాగే శుకనాసుడు మహారాజును ఓదారుస్తున్నాడు.' అంటూ, దివ్యజ్ఞానంగల వైశంపాయనమనే చిలుక, శూద్రక మహారాజుకు - జాబాలి మహర్షి, తన ఎదుటనున్న మునులకు చెప్పిన, ఆ కథను చెప్పి అన్నది—

'శూద్రక మహారాజా! యీ కథను మునులకు చెప్పి, జాబాలి మహర్షి ఫక్కున నవ్వాడు. నవ్వి, హారీతుడు మొదలుగా గల మునులతో అన్నాడు - 'చూశారా! ఎంతలోతు కెళ్ళిందో కథ! కామతృష్ణకదా, యీ కథకు కారణం!

దివ్యలోకంనుండి పుండరీకుని పదభ్రష్టంచేసి, భూలోకంలో శుకనాసునికి వైశంపాయనునిగా పుట్టించింది. భూలోకంలో మళ్ళీ మరో అపరాధం చేసి, ఆ వైశంపాయనుడు చిలుకై మన కట్టెదుట పడ్డాడు.'

'ఆ మాటలు వినగానే పూర్వజన్మ జ్ఞానంగల నేను ఉప్పొంగిపోయాను. సిగ్గుపడిపోయి, మహర్షి కిలా విన్నవించుకున్నాను.

'మహర్షీ! మీ అనుగ్రహంవల్ల నాకు పూర్వజన్మజ్ఞానం సంక్రమించి, సంబంధులనందరినీ తలచుకొనగలిగాను. నా గుండె పగిలిపోయేలా ఉంది. అందులోనూ, నేను పూర్వ జన్మలో చనిపోయానని వినగానే, చంద్రాపీడుని గుండె విచ్చిపోయినదని తెలిసి, ఆ వేదనను భరించలేక పోతున్నాను. దయయుంచి, ఆయన జన్మ వృత్తాంతంకూడా చెప్పి, ఆయనతో నన్ను కలిపేలా చేయించండి!'

'ఛీ! ఛీ! నీవొట్టి దుర్మార్గుడివి. మళ్ళీ చపలచిత్తమైన కోర్కెలు కోరి, పూర్వపు పాపాన్నే చేసుకోబోతున్నావ్!'

అప్పుడు హారీతుడు కలుగజేసుకొని—

నాన్నా! యీ కథంతా వింతగా ఉంది. 'మహా తపోనిష్ఠుడైన పుండరీకునకు కామతృష్ణ ఎలా కలిగింది? ఇంత అల్పాయుష్షు ఎలా సంభవించింది?'

'నాయనా! పుండరీకుడు స్త్రీవీర్యంవల్ల కలిగినవాడుగదా! ఏ వీర్యంతో పుడితే. ఆ పుట్టినవానికి ఆబుద్ధులే పుడతాయని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయ్! అటువంటి వీర్యంవల్ల పుట్టినవాడు కామాతురుడై, అతి స్వల్ప కాలంలోనే చని పోవటంకూడా తథ్యం! అయితే యీ శాపానంతరం యితడికి దీర్ఘాయుష్షు సంక్రమిస్తుంది.'

అంతలో నేను అడిగాను—

'మహర్షీ! ఆదీర్ఘాయుష్షు ఎప్పుడు సంక్రమిస్తుంది? మీ అనుగ్రహంవల్ల నా కిప్పుడు పూర్వ జ్ఞానం కలిగింది. మాటాడే శక్తి కలిగింది. ఆ ఆయుష్షునుకూడా అనుగ్రహించి నాకు శక్తిని సమకూర్చరా!'

'అది తరువాత దానికదే జరుగుతుంది! ఇప్పటికే కథచాలి స్తున్నాం. అదిగో! పూలవాసనలు గుభాళిస్తూ ప్రభాత మారుతం వీస్తోంది. నాకిక అగ్ని కార్యానికి వేళైపోయింది.

అంటూ జాబాలి మహర్షి లేచి పోయాడు. ఆయనతో పాటు అందరూ వెళ్ళిపోయారు. ఆహా! చేతగాని పక్షి జాతిలో పుట్టినందుకు నేను దిగులుతో, దుఃఖాబ్ధిలో మునిగి పోయాను! ఎన్ని పుణ్యాలు చేసుకుంటే మానవజన్మ లభి స్తుంది? అంతకంటే అమృత తుల్యమైన మునిజీవితం పొంద డానికి ఎన్ని తపస్సులు చేయాలి? ఇప్పుడీ పక్షి జాతి నుండి బయటపడే మార్గ మేమిటి?' అని ఆవేదనతో ఆలోచించు

కుంటున్న సమయంలో నవ్వు మొగంతో, హారీతుడు నా ఎదుట ప్రత్యక్షమై—

'వైశంపాయనా! నీ కింక భయంలేదు. నీ తండ్రి శ్వేతకేతు మహర్షి నుంచి, నిన్ను వెతుక్కుంటూ కపింజలుడు వస్తున్నాడు.' అన్నాడు.

నా కప్పుడు ఆనందంతో రెక్కలు వచ్చినట్టయింది. ఎగిరి పోయి ఆయన పాదాలముందు వాలినట్టుగా, మోర నిగిడ్చి 'ఏడీ?' అని ప్రశ్నించాను.

'నాన్నగారివద్ద ఉన్నాడు.'

'అయితేనన్నక్కడికి తీసుకుపోరా!' అని జాలిగా అడిగాను.

ఇంతలో కపింజలుడు నా ఎదుటకే వచ్చాడు. అప్పు డప్పుడే అతడు గగన మార్గంగుండా రావడంవల్ల జడలన్నీ గాలికి చిక్కులుపడి ఉన్నాయ్. గాలిలో తేలిపోతూ, మొయిలు తిన్నెలను దోచుకుంటూ వచ్చిన బడలిక అతని వొడలుపై కనబడుతోంది. పాపమాయన రాగరహితుడైనా నాపై అనురాగాన్ని విసర్జించలేక పోయాడు. అహంకారం లేకపోయినా, నేనే తనుగా భావిస్తున్నాడు. ఇహ సుఖ దుఃఖాలు అంటరానివాడైనా ఆరాటపడి పోతున్నాడు. ఆయన కృతజ్ఞుడు! నేను కృతఘ్నుడిని, దుష్టుడిని! అందుకే అతడిని చూడగానే నా కనులలో కన్నీరు తిరిగింది. అడిగాను—

'మిత్రమా! కపింజలా! నీకు నేను ఏమిచేసి నీ ఋణం తీర్చుకోగలను?' అని—

అతడు నేను కోరకుండానే తన చేతుల్లోకి నన్ను తీసుకొని, హృదయానికి హత్తుకొని ముద్దిడుకొని, ఘోర ఆవేదను అనుభవించాడు. అతడిని నేను ఓదార్చుదామని, 'మిత్రమా! అదేమి కన్నుల తడిపెడుతున్నావు? పితృపాదులు క్షేమమేగదా?'

'ఆ? క్షేమమే! వారు మన సంగతిని ముందుగానే దివ్యదృష్టిలో తెలుసుకొని, ప్రతి క్రియకు ఆలోచిస్తున్న సమయంలో నేను గుర్రం రూపాన్ని విడనాడి, వారి చరణ సన్నిధిని చేరుకున్నా. చేరుకొని, భయంతో నోట మాట రాక విలపిస్తున్నాను. ఆయన కలుగజేసుకొని—

'ఎందుకు నాయనా విచారిస్తావ్? నీ మిత్రుని దీర్ఘాయుష్షు కోసం; నేనే ఖర్మనూ ఆచరించలేక పోయాను. ఇప్పుడా పని నెరవేరుతుంది. ఖేదపడకు! నీవిక్కడుండిపో!' అన్నారు.

'కాదు. నా మిత్రునివద్దకు నన్ను పంపివెయ్యండి!'

'ఇప్పుడు వాడు చిలుక రూపులో ఉన్నాడే, తెలుసుకోడం కష్టం! అయినా చెబుతున్నాను విను! నీ మిత్రుడు జాబాలి ఆశ్రమంలో ఉన్నాడు. వెళ్ళగలిగితే, వాడినికలుసుకొని, ఇక్కడ నేను చేసే క్రతువు సమాప్తమయ్యేవరకూ అక్కడే ఉండమను. ఈ కర్మలో అతడి తల్లి లక్ష్మీదేవి

దుఃఖితయై పరిచారికగా పనిచేస్తున్నదని చెప్పు!' అని నా పితృపాదుల ఆజ్ఞను కపింజలుడు నాకు వినిపించి, యింకా దుఃఖిస్తున్నాడు. అతడిని అనేక విధాల ఓదార్చాను. అతడి మహోదార హృదయానికి చేతులెత్తి ప్రణుతి చేసాను.

'సరి! ఇక నేను చెప్పవలసినది చెప్పాను. నేనూ ఆ క్రతువులో పాల్గొంటున్నాను. నన్ను వెళ్ళిపోడానికి అనుమతించు!' అంటూ కపింజలుడు అంతరిక్షంలోకి ఎగసిపోయాడు.

ఇంతలో హారీతుడు ఆహారం తెచ్చిపెట్టాడు నాకు. అతడి పోషణవల్ల కొన్ని రోజులకు రెక్కలొచ్చాయ్ నాకు. ఇప్పు డెగిరిపోగలను. కాని చంద్రాపీడు డెక్కడ? అతడి జాడ తెలియక పోయినా, మహాశ్వేత అక్కడే ఉంటుంది కదా! ఆమె ద్వారానే అన్నీ తెలుసుకుంటానని ఒక కృత నిశ్చయానికి వచ్చి, ఉదయ విహారం వంకతో లేత రెక్కల బలంతో ఎగిరిపోయాను. దిక్కులను చుక్కానిగా చేసుకొని ఎగిరిపోతూ, ఇక శక్తి సన్నగిలి పడిపోతాననగా, ఒక అడవిలో ప్రవేశించాను! ఒక పొదరింటిపై వాలాను. ప్రక్కనే చెట్లనీడలోనున్న సరస్సులో దిగి, ఆ చల్లని తియ్యని ఉదకాన్ని సేవించాను. అలసటతో ఉన్న వాణ్ని నేమో, ఆజలం సేవించాక నిద్రపట్టేసింది. కొంత సేపటికి మెలకువ వచ్చి చూసుకునే సరికి నన్నెవరో బంధించినట్టు వొంటికి కట్లు కనబడాయ్. ఎదుట చూచాను. యమకింకరునిలా, ఒక భయం

కర మనిషి! యముడైనా సరే, వాడిన్ని చూసి భీతావహం చెందవలసిందే! అంతకు ముందెప్పుడూ, నేను అట్టి కర్కశ ఆకారాన్ని చూడలేదు. ఇప్పుడు చూసాక, నాకు ప్రాణాలపైనున్న ఆశ కాస్తా సన్నగిలిపోయింది.

'శూద్రక మహారాజా! అప్పుడు నేను బ్రతకాలి! నా మిత్రుడ్ని కలుసుకోవాలి! అందుకని ఆ కిరాతకుడ్ని కనికరించమని కోరుకున్నాను. నా కోరికకు అతడన్నాడు. 'మహాత్మా! నేను చండాలుడను. అయినా నిన్ను చంపడానికి నేను రాలేదు. మా యజమాని, శబరదొరకు ఒక కూతురుంది. జాబాలి ఆశ్రమంలో అద్భుతమైన చిలుక ఉన్నట్టు ఆమెకు తెలిసిందట. ఆ చిలుకను తెమ్మని నాలాంటి వారిని అనేకులను పంపింది. నీవు దొరికావు కాబట్టి ఆమె వద్దకు తీసుకెడతా! వొదిలిపెట్టమని ఆమెనే కోరుకో!' అని.

నా కొన ఊపిరి ఆగిపోయింది. విలవిల తన్నుకున్నాను. ఛండాల ప్రాంతంలోకి ప్రవేశించవలసిన దుర్గతి పట్టిందికదా, అని ఎంతగానో విలపించాను. అతడు నన్ను నిద్రలో నుండగానే పీక నులిమి చంపివేస్తే ఈ బాధలే ఉండక పోనుగదా! హా! కపింజలా! ఇప్పుడు నా కెవరు దిక్కు? అని మరల ఆ కిరాతుడి పాదాలను పట్టుకొని—

'నన్ను పట్టుకున్నట్టు ఎవ్వరికీ తెలియదు కదా, దయయుంచి నన్నువిడిచిపెట్టి పుణ్యం కట్టుకో!' అని ప్రార్థించాను.

'ఛీ! నా దొర బిడ్డవద్ద నన్ను అబద్ధమాడమంటావా? లోకం కండ్లనైతే కప్పగలము కాని, మనో నేత్రాలను కప్పుకొనగలమా, పద! మా దొరవద్దకు!' అని లాక్కుపోయాడతడు.

దయ్యాలు పట్టిన వారివలె, అమ్మోరు సంబరాల్లో అంగ విన్యాసాలు చేస్తున్న బోయగూడేనికి నన్ను తీసుకు పోయాడతడు. అక్కడ కిరాతకులు పక్షులను పట్టే డేగలకు, మృగాలను పట్టే కుక్కలకు శిక్షణ నిస్తున్నారు. కొన్ని గుంపులు వేటాడి భుజాలపై రక్తసిక్తమైన మృగ కళేబరాలను మోసుకొని వస్తున్నారు. కొందరు వలలు అల్లుతున్నారు. నూనె జిడ్డుతో నల్లగా అసహ్యంగా ఉన్నారు వారంతా! త్రాగుడే వారి పురుషార్థం. వారి బలిదానములన్నీ రక్త దానములే! హింస విలయ నృత్యం చేస్తోం దక్కడ!

అంతటి నరక భూయిష్టమైన, పాపపంకిలమైన శబర జీవితంలో నున్న ఒక దొర బిడ్డ నన్ను ఊరకే వొదిలి పెడుతుందా? ఆమె ఛండాల కన్యే! కనికరం చూపగలదా? అని ఎంతగానో తపన పడుతున్నా.

అతడు తన దొర కూతురికి నన్ను అప్పగించాడు.

'భేష్! మంచి పని చేసావ్! అమ్మ! ఎంత కాలానికి దొరికావ్. ఇంకెక్కడికి పారిపొతావో చూస్తాను,' అంటూ ఆ కన్య నా పీక పట్టుకొని ఒక కొయ్య పంజరంలోకి త్రోసి

సింది. నేను గిజగిజ గింజుకు పోయానంటే నమ్మండి! నా వాంఛలన్నీ, నా కోరికలన్నీ అంతతో మట్టి కలసి పోయాయ్. ఇక నేను చూడాలనుకున్న నా మిత్రుడూ, ఆ మహాశ్వేతా అంతా మటుమాయమైన నక్షత్ర కాంతులై పోయాయ్.

ఆమెను విడిచి పెట్టమని బ్రతిమాలుకోందామనుకున్నాను. కాని నే మాట్లాడగలనని ప్రత్యక్షంగా తెలిసిపోతే వొదిలి పెడుతుందా? క్రూరమైన జాతికి పుట్టిన బిడ్డ—ఆమెలో కని కారానికి తావుంటుందా? అయినా గాడిద కాళ్ళు పట్టుకోని, పడతాపులు తిన్నదానింటే ఈ బాధలను అనుభవిస్తూ ఈ పంజరంలో బ్రగ్గడమే మంచి దేమోనని మౌనం వహించాను.'

భోజన సమయానికి నాకు ఆహారం తీసుకొచ్చి పెట్టారు. నేనా పాపపు పిండాన్ని ముట్టుకోలేదు. అంతట ఛండాలకన్య నా వద్దకొచ్చి—

'ఇది విచిత్రంగా ఉందే! ఆకలి దప్పులు మాకులకే సహజం! నీవు పక్షివై ఉండికూడా ఆహారానికి ఎగబడే దానికి బదులు ఎందుకు కాలదన్నుతున్నావ్! నీవేదో పూర్వ స్మృతి కలదానివని దీనివల్ల భావించుకోవలసి వస్తోంది. ఏదో చేసుకున్న పాపంవల్ల ఈ పక్షివై పుట్టి, పుట్టుకకు అను గుణంగా ఎందుకు నడచుకోవూ? ఆహారం పెడితే ఎందుకు

నిరాకరిస్తావ్ ! మాది ఛండాలజాతి అనా ! ఛండాలజాతి అయినా వారి బుంగల్లోంచి భూమిపై పడితే చాలు, నీరు కూడా పవిత్రమవుతుందే ! నీ వెందుకు ముట్టకపోవాలి ?' అని ఆమె నన్ను దిగ్బంధంచేసి అడిగింది. నేను ఆశ్చర్య పోయాను. ఛండాల కన్యకు ఇంతటి వివేకం ఎలా వచ్చిందో నమ్మ శక్యంగాక పోయింది నాకు. నేను శాస్త్ర పట్టు విడి చాను. ఆహారం తీసుకున్నాను. కాని నోరు మాత్రం విప్ప లేదు. విప్పినా – నాకిక విముక్తి లేదని నా భయం !

ఇలా కొంతకాలం గడిచింది. నాకు ప్రాయం వచ్చింది. పంజరంనుండి బయటకు విడిస్తే భువన భువనాలనూ అధిగ మించి ఎగిరిపోగల శక్తి వచ్చింది. ఒకనాడు నిద్రించి, తెల్లవారి లేచి చూచుసరికి, నేనున్న కొయ్యపంజరం బంగారు పంజరంగా మారిపోయి ఉంది. బోయిగూడెమంతా స్వర్గధామంగా మారిపోయి ఉంది.

'శూద్రక మహారాజా ! అప్పుడు నే నాశ్చర్యచకితనై అంతవరకూ పట్టిన మౌనవ్రతాన్ని భంగపరచుకొని నోరారా ఆమెను అడుగుదామని, మళ్ళీ భీతితో ఆగిపోయాను. సరిగ్గా అప్పుడే, ఆ ఛండాలకన్య మీ చరణ సన్నిధికి నన్ను తీసు కొచ్చింది. ఆమెవ్వరో, మీలాగే నాకూ తెలీదు. నన్నెం దుకు మీ చెంతకు తీసుకొచ్చిందో కూడా తెలియదు!' అని

పూర్వజ్ఞాన సుకృతమైన వైశంపాయనమనే చిలుక అనగానే శూద్రకమహారాజు ఆ ఛండాలకన్యను తక్షణం రావించి అసలు కథను అడిగాడు.

కాంతిలో శూద్రక మహారాజునే మించిపోయిందా కన్య! వాగ్ధాటిలో, సమస్త భువనాలనే జయించగల శీవిని ప్రదర్శిస్తూ అంది—

'భువన భూషణా! భూ రమావల్లభా! ఇప్పుడు నీవు అందరి వృత్తాంతమూ విన్నావ్. వాడు తండ్రి ఆజ్ఞను జవదాటి ప్రేమాంధుడై ప్రియురాలి వద్దకు వెళ్ళాడనీ విన్నావు. ఇక నా కథ విను! నేనే లక్ష్మీదేవిని. వీడి తల్లిని! వీడు అలా ప్రియురాలి వద్దకు వెళ్ళగానే, అతడి తండ్రి సన్నాజ్ఞాపించాడు — 'వీడికి పశ్చాత్తాపం కలిగినగాని లాభం లేదు. వీడు రానురానూ, పక్షిజాతికంటే హీనుడై పోవచ్చు. వాడికి బుద్ధి వచ్చేవరకూ వాడితో పాటు నీవూ భూలోకానికి పోయి, కనిపెడుతూ ఉండు! వాడు పశ్చాత్తాప పడేలా చూడు!' అని.

'వీనిని వంచడానికే నే నిలా చేశాను. ఆ క్రతువు పూర్తయింది. శాపాంతంకానుంది. శాపం ముగిసే సమయానికి మీ రుభయులూ సమంగా సుఖ మనుభవించాలని, మీ

చెంతకు తీసుకొచ్చాను. సకల కలుష భూయిష్ఠమైన, యీ మానవలోక సంపర్కం నుండి, స్పర్శనుండి దూరంగా ఉండ డానికే నేను ఛండాల కన్యగా రూపు దాల్చాను. ఇలా అయితేనే నన్ను ముట్టరు. ఇక మీరు మీ తనువులను త్యజించి, అసలు రూపాలతో ఆనంద మనుభవించండి' అని చిన్నకుండా మె. ఆ వెంటనే ఒక మహోజ్వల కాంతి, విపరీత మైన చణంచణ ధ్వని ఆ సభా మండపాన్ని విద్యుత్తేజితం చేశాయ్. ఆ తేజస్సులో లక్ష్మీదేవి, గళ్ళు గళ్ళన మధుర ధ్వనిచేస్తూ, ఆభరణ గలగలలతో ఆకాశానికి ఎగసిపో పోయింది.

సభంతా స్తంభీభూతమైపోయింది.

ఆ మాటలతో, శూద్రక మహారాజుకు పూర్వ స్మృతి వచ్చి, తాను చంద్రాపీడుడని తెలుసుకొని 'మిత్రమా! వైశంపాయనా! పుండరీక విధి విలసితంవల్ల మన ఇరువురి రూపాలూ ఒక్కసారే అంత మవుతున్నాయ్.' అని అంటూం డగానే, కాదంబరిని తూపుగా చేసి, మన్మధుడు విసరిన బాణం గుచ్చుకున్నట్టుగా అతడి వొడలు పులకరించింది. నోటిలో తాంబూలం క్రింద జారిపడి పోయింది. శరీరం చెమర్చింది. కన్నులు చెమ్మగిల్లాయ్. నేత్రాంచలం, చంచలమైంది.

హృదయం రాగరంజితమైంది. కాదంబరిపై తమకంతో అతడి హృదయం మరులుగొని ఊపి వేయసాగింది. అతడి వేడిని, మదనాగ్నినీ చల్లార్చడం ఎవరితరమూ కాలేదు. చిగురుటాకులూ, తామర పత్రాలూ, కలువ పూదండలూ, అన్నీ నిష్ప్రయోజనములై పోయాయ్.

అతడు కాదంబరీ ధ్యానంలోనే, ఆమె దివ్యరూప సందర్శనంలోనే, ఆమె నామస్మరణలోనే, ఆమె సౌందర్యోపాసనలోనే నిమగ్నుడై పోయాడు. ఇతనికి ప్రియ మిత్రులూ, అంతరంగిక పరిచారికలూ, ఎవ్వరూ కనబడ్డంలేదు. జీవితంపై వెగటు జనించింది. కన్నీరు కారుస్తున్నాడు. నోరు మెదపడం లేదు. సఖీజనం, అంతఃపుర కాంతలు ఎందరొచ్చి ఎన్ని ఉపచారాలు చేసినా, ఎంత గంధం పూసినా, ఎంత పన్నీరు జల్లినా అతడి తాపం పెరిగిందేగాని తరగలేదు. కార్చిచ్చు ముట్టడించిన వటవృక్షంలా అతడు భుగ భుగ మండిపోతున్నాడు. అతడి కామాగ్ని పరాకాష్టనందుకొంది.

సరిగ్గా అలాగే వైశంపాయనుడై చిలుకగానున్న పుండరీకునిలోనూ, మహాశ్వేత యెడల తమకం రేగింది. ఆరని జ్వాలలు వారుభయుల్నీ మండించ సాగాయ్.

# 13

కామాగ్నిని మరింత రగిల్చే వసంతం వచ్చింది. చివురించిన లతానికుంజాలకు నాట్యాన్ని నేర్పుతున్నాయ్—వసంత వీచికలు, పూగుత్తులతో నిటారైన వృక్షాలు వొంగిపోతున్నాయ్. ఎటు చూచినా, ప్రకృతి రామణీయకత గళ్ళు గళ్ళున నాట్యకత్తెలా నాట్యం చేస్తోంది,

కాముకుల మనస్సులు నిరంకుశాలై పోయాయ్. సిగ్గూ, లజ్జా, వినయమూ, విధేయతా, వారిని విసర్జించాయ్. మోదుగు పూలు మన్మథుని రక్తపతాకల్లా ఎగురుతూ వారిని అధర చుంబనాలకు పురిగొల్పుతున్నాయ్.

సర్వజీవకోటీ చైతన్య విలసితమైంది. బంగారు పూతతో ప్రకృతి దివ్య కాంతితో ప్రకాశిస్తోంది. ఉత్సాహం, ఆనందం మధురాగమంగా మారిపోయింది. తుమ్మెదలు పూదేనియలు త్రాగి మత్తిలి ఝూంకారాలు చేస్తున్నాయ్. గండు కోయిలలు క్రొవ్వెక్కి రెమ్మలపై నెక్కి మదనారవంతో అరుస్తున్నాయ్.

మదనుని మహాస్త్రమైన వసంతం, ఇక్కడ కాదంబరిని కూడా చలింపజేసింది. కామోద్రేకాన్ని ఎలాగో అణచుకొని, ఆ రోజు గడిపింది. సాయం సమయం కాగా, స్నానం

చేసి కామదేవుని ప్రార్థించుకొంది. తన పతి శరీరాన్ని సుగంధ శీతల ద్రవ్యాలచే స్నానం చేయించింది, ఆ పాద మస్తకం, హరిచందనం పూసింది. తాను వొడలల్లా పూల మయంగా చేసుకొన్నది. జడలో, మెడలో ఎక్కడ చూచినా పూదండలే. సాక్షాత్తూ రతీదేవిలా తయారై, లేవబోయే మదనునితో, కళా విక్రీడనకు సిద్ధపడిన దానిలా కనబడు తోంది. రెప్ప వాల్చకుండా ప్రియుని ముందరే నిల్చి చూస్తూ, అతడి సౌందర్యాన్ని దోసిళ్ళతో పట్టి త్రాగి వేస్తోంది. బడలికచే నిట్టూర్పులు, అలసటలో స్వేదబిందు వులు, జలజల వెడలుతున్నాయ్. వొడలెల్లా పులకరించగా, తనువే మోహన తమకంతో మెరయగా, మహాశ్వేతగాని చూస్తుందేమోనని బెదురుచూపులు చూస్తూ, మాటిమాటికీ పరాధీన అవుతూ, లజ్జతో, స్త్రీ సహజమైన సిగ్గుతో కనులు మూసుకొని యిక ఆగలేక నిగ్రహాన్ని కోల్పోయి, చంద్రా పీడుడు బ్రతికిన ప్రియుడే అనుకొని ఆ శరీరాన్ని గట్టిగా కౌగలించుకుంది.

ఆ అమృతాలింగనంలో, మధుర స్పర్శలో, దూరమేగి పోయిన చంద్రాపీడుని ప్రాణాలు, అతడిలో కొచ్చి చేరు కున్నాయ్. ఆయన శ్వాసించాడు. ముకుళించిన కుముదం వికసించినట్లు ఆయన ముఖం రాగరంజిత కాంతితో ప్రకా

శించింది. నిద్ర మేల్కొన్నవానిలా, శరీరాన్ని విదళించు కుంటూ, ఆవులిస్తూ, చంచల, చకిత, పులకిత దేహంతో, ఎదుటనున్న కాదంబరిని చూచి – 'దేవీ! కాదంబరీ!' అని అమాంతంగా ఆలింగనం చేసుకున్నాడు. గట్టిగా ఆమె కొమ్మలు గుచ్చుకొనగా, హృదయానికి హత్తుకున్నాడు. ఆమె పరాధీన ఐపోయింది. ఆమె శరీరం ఇకామె వశంలో లేదు. ఆమె సిగ్గుతో భయపడిన దానిలా, ముఖాన్ని ముడిచి వేసుకుంటోంది—

'పిచ్చిదానా! ఎందు కిలా భయపడిపోతావ్? ఎందుకీ సిగ్గు? అమృత సంభవమైన అచ్చరజాతిలో పుట్టినదానవే. ఒక నాడు, నాయీ శరీరం నాశం లేనిదని, కాదంబరీదేవి స్పర్శతో అది పోషితం కావలెనని చెప్పలేదా? ఇప్పుడే విరహ గతమైన నేను ఆ శూద్రకుని శరీరాన్ని విడిచి వచ్చాను. ఈ దేహమైనా ఎందుకుంచమన్నానంటే, నీవు దీనిని ప్రేమించి, పోషించావు కాబట్టి. ఇప్పుడిక నీకు ఈ లోకమూ, చంద్ర లోకం కూడా పాదాక్రాంతాలయ్యాయ్. నాతో పాటు నీ చెలి మహాశ్వేత ప్రియుడుకూడా శాపవిముక్తుడయ్యాడు.' అని చంద్రాపీడ శరీరందాల్చిన చంద్రుడు మాట్లాడుతుండ గానే, ఆకాశంనుండి చేతులు పట్టుకుని, పుండరీక కపింజలులు దిగుతున్నారు. అప్పుడే చంద్రలోకం నుండి దిగివస్తున్నందు వల్ల వారినుండి అమృతపరిమళం గుభాళిస్తోంది. సరిగ్గా అతడు

మహాశ్వేతను విడిచినప్పుడు ఏ దుస్తులు, ఏ ఏకావళి ధరించాడో, ఏ పాలిపోయిన చెక్కిళ్ళతో ఉన్నాడో అలాగే వున్నాడు.

వారు కనిపించగానే, కాదంబరి చంద్రాపీడుని కౌగిలి నుండి దూరమైంది. పరుగెత్తుకుని వెళ్ళి పుండరీకుని ఆగమన ఆనందాన్ని మహాశ్వేతకు అందించింది. ఆమె పులకాంకితైంది పుండరీకుడు భువిపైకి దిగగానే చంద్రాపీడుని గట్టిగా కౌగలించుకున్నాడు.

ఆ శుభాగమన సందేశాన్ని వినిపించడానికై తొందర తొందరగా, వైణికుడు హేటకూటానికి పరుగెత్తుకెళ్ళి చిత్ర రథుడ్నీ, మదిరాదేవినీ తీసుకొచ్చాడు.

పత్రలేఖ విధిశానగరానికొచ్చి చంద్రాపీడుని శుభవార్త మహారాజు తారాపీడునికీ. మహారాణి విలాసవతికీ అందించింది. వారి ఆనందానికి అంతులేదు. వేడుకకు మితిలేదు. నగరమంతా సంతోషకరంగా డోలికమై తేలియాడింది. మహారాజు మహానందంతో విలాసవతిని, పరివారాన్నీ సేనను, కానుకలనూ, వెంటదీసుకొని రాజులూ, రారాజులూ తనను కొలువగా, పత్రలేఖ వెంట అచ్ఛోద సరస్సు చెంతకు బయలు దేరి వెళ్ళాడు, ఆనంద పరవశత్వంలోనున్న శుకనాసుని చెట్ట

పట్టాలే పట్టుకొని, చంద్రాపీడుడున్న ప్రాంతానికి చేరుకున్నాడు.

పుండరీకుని కౌగలించుకొని ఉన్న చంద్రాపీడుడ్ని గాంచి, శుకనాసునితో అన్నాడు—

'మహామంత్రీ! పుత్రదర్శనం పునరుజ్జీవనాన్ని ప్రసాదించిందీ రోజు!' అని.

ఆ మాటలు విని చంద్రాపీడుడు పుండరీకుని విడిచి తండ్రిని కౌగలించుకొని, అలా పాదాలపైనే వాలిపోయి, ఆనందాశ్రువులు చిందాడు. విలాసవతి పుత్రుని ముఖారవిందాన్ని, చెక్కుటద్దాలనూ తనివితీరా ముద్దుపెట్టుకుంది.

'నాయనా! నీవు నాకు పుత్రుడవు కావు. తండ్రివి! లోకపాలకుడివి!' అని పాదాలవద్దనున్న పుత్రుని లేవదీసి, మరల ఆలింగనం చేసుకున్నాడు - తారాపీడుడు.

శుకనాసుని గాంచి, స్పందించిన చంద్రాపీడుడు—

'ఇదుగో, మీ వైశంపాయనుడు!' అని ఎరుకపరచి, వారి దివ్యాశీస్సులను అందుకున్నాడు.

[illegible] కపింజలుడు ముందుకొచ్చి—

'మహాభాగా! శుకనాసా! శ్వేతకేతు మహర్షిచే ఇతడు పెంచబడినవాడైనా, కన్నది మీరు. ఇక ముందు దుందుడుకు పనులకు దిగకుండా చూడమని మహర్షి మీకు చెప్పమన్నారు.'

'కపింజలా! సర్వజన మనోభిలాషలను తెలుసుకొనగల దివ్యనీయుడు - శ్వేతకేతుడు! ఆయన ఆజ్ఞను పాలించక పోవడమా?' అంటూ పుండరీకునిగానున్న వైశంపాయనుని ఆలింగనం చేసుకున్నాడు.

ఇక వారందరూ ఆ రోజల్లా వేడుకతో దివ్యానుభవాలను చెప్పుకుంటూ గడిపి వేసారు.

గంధర్వరాజు సిగ్గుతోనున్న కూతురును గాంచి మురిసి పోయాడు. హంసరాజు హాసలాలసుడై తన బిడ్డను కౌగలించుకున్నాడు. ఆ అచ్ఛోద సరస్తీరం ఒక వెన్నెల కాసిన దివ్య భూమిలా తళతళలాడుతోంది. మహోత్సాహం వెల్లి విరిసింది. వారి ఆనందాన్ని గాంచి, పూలతలూ, కుసుమ వృక్షాలూ కుసుమ వర్షాన్ని కురిపించసాగాయ్.

శుభోదయమైంది - తారాపీడుని కౌగలించుకొని గంధర్వ రాజు చిత్రరథుడన్నాడు—

'అయ్యా! స్వభవనాలుండగా ఈ అరణ్యంలో ఈ వేడుకలను జరుపుకోడ మెందుకు? మా గంధర్వ లోకానికో,

చంద్రలోకానికో, మీ రసాతలానికో వెళ్ళిపోయి ఈ వేడు కలను జరుపుకుందాం పదండి !' అని

'ఇంతకంటే కన్నులపండువైన ప్రదేశ మింకేముంటుంది ! ఎక్కడ సంతోష ముదయిస్తే, ఎక్కడ అనురాగ మేర్పడితే అదే పుణ్యభూమి గదా ! మీరు మీ అల్లుని పుణ్యలోకా నికి తీసుకొనిపోయి వేడుకలు జరుపుకోండి. మే మిక్కడనే జరుపుకుంటాం !' అన్నాడు – తారాపీడుడు.

అలాగేనని గంధర్వరాజు చంద్రాపీడుడ్ని కాదంబరీ సమేతంగా హేమకూటానికి తీసుకుపోయి, తన యావత్తు రాజాన్ని, లలితకోమలమైన గారాబు కన్యనూ యిచ్చి అత్యంత వైభవంగా వివాహ మహోత్సవం జరిపించాడు. మనసారా ప్రేమించుకున్న కాదంబరీ, చంద్రాపీడులు పరస్ప రానురాగంతో కృతార్థులై ప్రేమఫలాన్ని అనుభవిస్తున్నారు.

ఆ అనురాగంలో ఉండగా కాదంబరి చంద్రాపీడుడ్ని అడిగింది—

'ప్రియా ! మనమందరమూ తిరిగి కలుసుకున్నామే, మరి పత్రలేఖ ఏమైనట్టు ? ఆమె మన మధ్య ఇప్పుడెందుకు లేదు ?'

'అదా ! ఆమె చంద్రరూపంలోని నా సతి రోహిణి! నేను శాపగతుడను కాగా, ఒక్కడనే భూలోకంలో ఉండలేనని, వొద్దన్నా వినక నాసేవకై వచ్చి భూలోకంలో పుట్టింది. తిరిగి నేను మరో జన్మమెత్తగా, ఆమె శరీరం వొదలిపెట్టింది. నేను తిరిగి బ్రతుకుతాననగా, తనూ నా వెంట ఉంటానని

బెంవంత పెట్టింది. నేనే ఆపివేసాను. చంద్రలోకానికి మనం వెడతాంగా, అప్పుడు చూద్దువుగానిలే, ఆమెను.'

ఆ మాటలు విని, ఆమె పాతివ్రత్యానికి కాదంబరీదేవి సిగ్గుపడిపోయింది. అంతలో పగలు అంతరించి చంద్రోదయమైంది. ప్రేమికుల పాలిటి కల్పతరువుగదా చంద్రుడు! ఆ శారద రాత్రిలో, అరమోడ్పు కన్నులతో, సిగ్గుతో అడ్డు పెట్టుకున్న చేతులతోనున్న కాదంబరిని, ప్రథమానురతితో సుఖపారవశ్యం చెందాడు - చంద్రాపీడుడు! అలా పదిరోజులు గడపి, అత్తమామలను విడిచి భూలోకానికి వచ్చి - తల్లి దండ్రులతో కాలక్షేపం చేసి, రాజ్యభారాన్ని పుండరీకునిపై మోపి, కొన్ని రోజులలో, జననీ జనకుల చరణారవిందాల ముందు భూలోకంలోనూ, మరికొన్ని రోజులు చంద్రలోకం లోనూ, మరికొన్ని రోజులు గంధర్వ లోకంలోనూ గడ పుతూ, రమణీయ ప్రదేశాలను కాదంబరీ సమేతంగా విహ రిస్తూ రెండు జన్మల సుఖాన్ని అనుభవించసాగాడు.

అలాగే మహాశ్వేత తనకు నోములపంటగా, ప్రేమఫలంగా దక్కిన పుండరీకుని ఇక ఎడబాయకుండా, అనుక్షణం అను రాగంతో స్వర్గసుఖాలను అనుభవిస్తోంది.

కష్టాలలో కాకలుదీరిన వారి జీవితాలు, మూడు పువ్వు లారుకాయలుగా విరాజిల్లుతున్నాయ్.

—♦ శుభం ♦—